శ్లో॥ ఆగమార్థంతు దేవానాంగమనార్థంతురక్షసాం । కుర్యాద్ఘంటారవంభక్త్యా శంభోరర్చనపూర్వకం ॥

తా॥ దేవతులయొక్క ఆగమనము కొరకు రాక్షసులయొక్క గమనముకొరకులింగముయొక్క పూజపూర్వకముగాభక్తి చేత ఘంటవాయించవలయును.

శ్లో॥ పుష్పమేకంగృహీత్వాతుసజ్జికాస్థితలింగకం । మూలమంత్రత్రయేణైవదృష్ట్వాపుష్పంసమర్పయేత్ ॥

తా॥ ఒకపుష్పము తీసుకొని, సజ్జయందున్నలింగమూర్తిని, మూడుమారులు మూలమంత్రోచ్చారముచేత, చూచిపుష్పముసమర్పించవలయును.

శ్లో॥ లింగార్థముద్ధరేత్పీఠం వామహస్తేసుభస్మనా।పంచకోణేషుఃపంచార్ణంతారం మధ్యేన్యసేద్బుధః॥

తా॥ లింగమూర్తికొరకు పీఠమువామహస్తము యందుమంచిగా భస్మముచేత పంచకోణచక్రము వ్రాయవలయు పంచకోణములలోనకారాది యకారాంతము మధ్యమందు ఓంకారము వ్రాయవలసినది.

శ్లో॥ నమాంత్యేపీఠసంయుక్తం శికారంమధ్యమేవచ । వకారంగోముఖంచైవ తత్పరశ్చయకారకం ।౯॥ ఓంకారంలింగమధ్యేచ షడక్షరీషడంగకం ॥౧౦॥

తా॥ లింగాకారమగు పంచకోణచక్రమందు నకారమకారములు పీఠసంజ్ఞగలరెండుకోణములయందు శికారముమధ్యసంజ్ఞయైననడిమికర్ణికయందు వకారముగోముఖ సంజ్ఞయగుభుజమందు యకారము రెండవభుజమందు ఓంకారము లింగసంజ్ఞగలచివరకోణమందు షడంగముల షడక్షరములు వ్రాయవలయు.

శ్లో॥ లింగంవామకరేస్థాప్య గోముఖంవామకంతథా । దక్షిణేగోళకాకారమె తల్లింగస్యపూజనం ॥౧౧॥

తా॥ లింగమునెడమపాణితలమందు గోముఖమును ఎడమభాగము ఆట్లా గగోళాకారము దక్షిణభాగము ననుంచి ఈలింగముయొక్క పూ

జేయును.

శ్లో॥ అనమస్కారపూజాహి వ్యర్థంభవతిపూజకే । ప్రదక్షిణత్రయంకుర్యా న్నమస్కారంచపంచభిః । కరపీఠేసమభ్యర్చ్య శివం సాంబంత్రిలోచనం ॥౧౩॥

తా॥ పూజయందునమస్కారము లేనియెడల పూజనిరర్థకమౌచున్నది కనుక। మూడుమారులు ప్రదక్షిణము ఐదుమారులు నమస్కారముచేయవలయు మంగళకరుడగు త్రిలోచనుండైనటువంటి సాంబమూర్తి స్వరూపంబగులింగమూర్తిని హస్తపీఠమందు తెస్సపూజించవలయు

శ్లో॥ అర్ఘ్యం పాద్యం తథాచమ్యం స్నానం నైవేద్యమేవచ । దర్పణంధూపదీపంచ చామరంచాతపత్రకం । గీతవాద్యంతథానృత్యం నమస్కారోజపస్తథా । ప్రదక్షిణంక్రమేణోక్తం షోడశాఖ్యోపచారకం ॥

తా॥ అర్ఘ్యము, పాద్యము, ఆచమనము, స్నానము నైవేద్యము, దర్పణము, ధూపము, దీపము, చామరము, ఛత్రము, గీతము, వాద్యము, నృత్యము, నమస్కారము, జపము, ప్రదక్షిణము, క్రమముగా షోడశోపచారములు చెప్పబడినవి.

శ్లో॥ విశ్వేశ్వరనమస్తుభ్యం శంభవేసర్వజిష్ణవె । రత్నసింహాసనంచారుదదామిశశిశేఖర ॥

తా॥ అని కరకమలమందు లింగమూర్తిని ప్రవేశింప చేయవలయును.

శ్లో॥ యద్భక్తిలేశసంపర్కాత్ప రమానందసంభవః। తస్మైతెచరణాబ్జాయపాద్యంశుద్ధాయకల్పయె ॥

తా॥ ఈమంత్రముచేత పాద్యమివ్వవలయు.

శ్లో॥ తాపత్రయహరందివ్యంపరమానందలక్షణం। తాపత్రయవినిముక్తైతవాఘ్యంకల్పయామ్యహం॥౧౮॥

తా॥ ఈమంత్రముచేత అర్ఘ్యమివ్వవలయు.



శ్లో॥ వేదానామపివేదాయ దేవానాం దేవతాత్మనె । ఆచమ్యంకల్ప

యామీశశుద్ధానాంశుద్ధి హేతవే ॥౧౯॥

తా॥ ఈమంత్రముచేత ఆచమనమివ్వ వలయును.

శ్లో॥ సర్వకాలుష్య హీనాయపరిపూర్ణసుఖాత్మనే । మధుపర్కంమహాదేవకల్పయామి ప్రసీదమే ॥౨౦॥

తా॥ ఈమంత్రముచేత మధుపర్క మివ్వవలయును.

శ్లో॥ జలంశాంతికరంచైవ గంధమాయుష్య వర్ధనం । అక్షతాశ్శతృనాశంచపుష్పమైశ్వర్యమేవచ । ధూపందహంతి పాపానిదీపంమృత్యువినాశనం । నైవేద్యం లభతేరాజ్యంతాంబూలంపరమోత్తమం ॥ఏవమష్టవిధంజ్ఞాత్వాఇష్టలింగంసమర్చయేత్ ॥

తా॥ ఉదకము శుభములనిచ్చును గంధము ఆయువృద్ధి చేయును అక్షతలు శతృనాశనము పుష్పము ఐశ్వర్యప్రదము, ధూపము పాపములదహించును దీపము మృత్యునాశనము, నైవేద్యము రాజ్యము లభించును తాంబూలము మిక్కిలి శ్రేష్ఠ ము ఇటువలె ఎనమిది విధములతెలిసి ఇష్టలింగమును అర్చించ వలయును.

శ్లో॥ పంచామృతాదిసకలైర్యథావిధిస్తథాస్నపక్ । పంచబ్రహ్మపరైర్మంత్రైరష్టోత్తరశతాఖ్యకైః ॥౩౦॥ యథాశక్తిస్తథాకుర్యాదాత్మశక్తిమువంచయన్ ॥

తా॥ లింగార్చనవిధి యెట్లున్నదో అట్లాగ గోక్షీరగోదధి గోఘృతమధు శర్కరపంచామృత మొదలగుసమస్తముల చేత, అభిషేకము చేయుచుసద్యోజాతాది పంచబ్రహ్మపరమైన మంత్రములచేత అష్టోత్తర శతనామములచేత అధికారప్రకారము తనశక్తి వంచనచేయక చేయవలయును.

శ్లో॥ శుద్ధవస్త్రంసమాదాయ మూలమంత్రంసముచ్చరన్! లింగస్యార్ద్రంహరేత్పున రుపచారవిధింసుధీ॥౩౧॥

తా॥ ఓయిలింగార్చన వశీకృతబుద్ధిగలవాడా. పరిశుద్ధలింగపావడము తీసుకొని । ఓంన్నమశివాయ । అనిచెప్పుచును లింగముమొక్క ద్రవ్యము నుపచారరీతినితియ్యవలయు.

శ్లో॥ భూలోకస్థితపుణ్యాని యానితానిఫలానిచ । తేషాంకోటిగుణం పుణ్యంవిభూత్యాలింగలేపనం ॥౧॥

తా॥ అని త్రియంబక మంత్రము చేత లింగమునకుభస్మ ముధరించ వలయు-

శ్లో॥ మలయాచలసంభూతంసుగంధం శ్రియముత్తమం । కర్పూరాగరుసంయుక్తంచందనంచసమర్పయేత్ ॥౨॥

తా॥ అని మూలమంత్రము చేత గంధముధరించవలయు.

శ్లో॥ అక్షతాన్ ధవళాన్ దేవం తాప సోత్తమపూజితం । ధారయే న్మూలమంత్రేణ లింగమూర్ధ్నా సమాహితః ॥౩॥

తా॥ అని మూలమంత్రము చేత శిరస్సుయందు అక్షతలు ధరించ వలయు.

శ్లో॥ కుందార వింద మందార కుముద ద్రోణమల్లకైః । పున్నాగాశోకవకుళైః పూజయేచ్ఛివలింగకం ॥౪॥

తా॥ అని మూలమంత్రము చేత పుష్పములు ధరించవలెను.

శ్లో॥ త్రిదళంత్రిగుణాకారం త్రినేత్రంచత్రియాయుధం । త్రిజన్మపాపసంహార మేకబిల్వం శివార్పణాత్ ॥౫॥

తా॥ అని మూలమంత్రము చేత బిల్వము ధరించ వలయును.

శ్లో॥ వనస్పతిరసోపేతో గంధాఢ్యో ధూపఉత్తమః । ఆఘ్రేయ స్సర్వదేవానాంధూపోయం ప్రతిగృహ్యతాం ॥౬॥

తా॥ అని మూలమంత్రము చేత ధూపము నర్పించ వలయును

శ్లో॥ సాజ్యంత్రివర్తిసంయుక్తం వహ్నినాయోజితంప్రియం। భక్త్యాదీపంప్రయచ్ఛేత దేవాయపరమాత్మనే ॥౭॥

తా॥ అని మూలమంత్రము చేత దీపము సమర్పించ వలయును

శ్లో॥ వేదాదివర్ణ సంభూతం నాదరూప నిరామయం । అజ్ఞానహరణందేవం ఘంటానాదంసమర్పయేత్ ॥౮॥

తా॥ అని మూలమంత్రము చేత ఘంటానాదము చేయవలెనసి.



శ్లో॥ చిన్మాత్రపంజగదాధారం స్థూలసూక్ష్మాదికారణం । నీరాజనం

సమర్ప్యార్థ మంగళార్థం విధీయతే ॥౯॥

తా॥ అని మూల మంత్రముచే మంగళారతి నివ్వవలయు.

శ్లో॥ దర్పణమ్మాతపత్రంచచామరంగీతవాదనం । ప్రకల్ప్యలింగసాన్నిధ్యే ప్రమోదాన్నటనంతతః ॥౧౦॥

తా॥ దర్పణము, ఛత్రము, చామరము, గీతము, వాద్యము, నాట్యము, సంతోషమువలన లింగ సన్నిధియందు విధిప్రకారము కల్పించవలయు.

శ్లో॥ ద్రాక్షాఖర్జూరసంయుక్తం నారికేళఫలాన్వితం। మధుశర్కరయాయుక్తం నైవేద్యంచప్రకల్పయేత్ ॥౧౧

తా॥ అని మూలమంత్రముచే నైవేద్యము సమర్పించవలయును.

శ్లో॥ క్రముకంచశిలాచూర్ణం నాగవల్లిదళైర్యుతం । జాతీలవంగ సంయుక్తం తాంబూలంచసమర్పయేత్॥౧౨॥

తా॥ అని మూలమంత్రముచేత తాంబూలము సమర్పించవలయు

శ్లో॥ అష్టోత్తరశతంజాప్య మూలమంత్రేణమానసీం । తథాహస్తజపంకుర్యాద్ద్వాదశాక్షరమంత్రకం ॥౧౩॥

తా॥ మానసజపము మూలమంత్రముచేతనూటయెనిమిది జపించి యట్లాగే ద్వాదశాక్షరి మంత్రమును హస్తజపము చేయవలెను.

శ్లో॥ అంగుష్ఠా ద్ద్వాదశగ్రంథీం నవవారప్రదక్షిణం। అష్టోత్తరశతంకుర్యాత్సద్యోముక్తిర్నసంశయః ॥౧౪॥

తా॥ అంగుష్ఠమువలన చతురంగుళములు అడ్డరేఖలు ఓంకారాదియకారాంతము ద్వాదశాక్షరి మంత్రమును తొమ్మిది మారులు ప్రదక్షిణముచే యనూట ఎనిమిదియాను సద్యస్కాలముక్తి సంశయము లేదు.

శ్లో॥ ప్రదక్షిణంకరోమీశ ప్రసన్నార్తిహరప్రభో । సంసారబంధనాత్కాల భీతితఃపాలయాధునా ॥౧౫॥

తా॥ అని మూడుమారులు ప్రదక్షిణచేయ వలయు.

శ్లో॥ నమస్కరోమిదేవేశ నమన్మందారశంకరమిజ । భక్త్యాభవత్పాదభక్తింరక్షమాంకృపయామృడ॥౧౬॥

తా॥ అని అథభక్తోనమస్కారం కంఠోర్ధ్వాంతు విభావయేత్ । ముక్తాంగస్తేనమస్ప్రాశ్యచ) అయిదుమారులు నమస్కారము జేయవలయు.

శ్లో॥ తతఃపరం విశేషేణ వీరశైవార్చనక్రమం । షట్థ్సలాత్మక రూపేణ ప్రవక్ష్యామిసమాసతః ॥౧౭॥ భక్తస్థలేసుఖాసీనో భూతిరుద్రాక్షధారణం । కృత్వాభక్త్యాసుపూతాత్మాతతో మాహేశ్వరస్థలే ॥౧౮॥ షడక్షరంపరంమంత్రమనుష్ఠేయాచ్చనిష్ఠయా । ప్రసాదిస్థల మాలోక్యలింగంహస్తే వధానతః ॥ ౧౯ ॥ ప్రాణలింగిస్థలె పూజాంవిధాయ స్వానుభూతితః । తతస్నివాపణం కృత్వాస్వావనం దాచ్ఛరణస్థలె । ఐక్యస్థలె ప్రసాదోపభోగ తృప్తిముపాశ్యచ । ఏవంసమరసి భావషడంగ స్థలయోగతః ॥ ౨౧ ॥

తా॥ మరియువీరశైవలింగార్చన క్రమమువిశేషముగానుషట్థ్సలాత్మక రూపముచే సంక్షిప్తముగాచెప్పుచున్నాను భక్త స్థలమందు సుఖాసీనుడై భస్మరుద్రాక్షలు ధరించి భక్తిచేతపవిత్రాత్ముడగుట భక్తస్థలము, తరువాత మాహేశ్వరస్థలమందు షడక్షరీమంత్రమునిష్ఠచేత నుష్ఠించుట మాహేశ్వరస్థలము ప్రసాదిస్థలమందు సావధానముపలనహస్తమందు లింగము నిరీక్షించుట ప్రసాదిస్థలము ప్రాణలింగస్థలమందు స్వానుభవముగా లింగార్చన చేయునది ప్రాణలింగ స్థలముశరణస్థలమందు స్వానందము వలన లింగార్పణ చేయునది శరణస్థలము ఐక్యస్థలమందు ప్రసాదోప భోగతృప్తి బొందుటఐక్యస్థలము, నీప్రకారముసమరసభావముగలనషట్స్థలషడంగ భావమే లింగార్చన

—॥ పాకనిరూపణప్రారంభః ॥—

శ్లో॥ విదూరేభవిసంచారె ఏకాంతెశుద్ధిమందిరె । పాకంపూజార్పణాద్యంచకార్యం లైలింగధారిణా॥౧॥

తా॥ భవిసంచార దూరమైనటువంటి, ఏకాంతమైన పరిశుద్ధగృహమందు లింగధారులచేత పాకము పూజార్పణాదులు చేయవలసినది.

శ్లో॥ లింగార్పణాయ సర్వార్థాన్ పాకంకుర్యాత్సమాహితః ।
పదార్థాన్ శోధయేత్పూర్వంతతః పాకోవిధీయతే ॥౨

తా॥ విషయాపేక్ష నివృత్తిమనసున, సమస్త వస్తువులను లింగార్పణకొరకు పాకముచేయ వలయు (అంతకు) పూర్వము పదార్థములను శోధించ వలసినది (తరవాత) పాకము విధింపబడినది.

శ్లో॥ తత్పాకముత్తమంప్రోక్తం భస్మధారణపూర్వకం । భస్మధృతం వినా పాకంశ్వానమాంస సమంభవేత్ ॥౩॥

తా॥ స్నానాది భస్మధారణ పూర్వకముగాచేయు పాకము ఆ పాకము శ్రేష్ఠమని చెప్పబడినది భస్మధారణలేని పాకముకుక్క మాంస సమానమగుచున్నది.

శ్లో॥ స్నాత్వాశుద్ధాంబరంధృత్వాధారయిత్వాత్రిపుండ్రకం । సమాహితమనాఃకుర్యాల్లింగనైవేద్య ముత్తమం ॥౪॥

తా॥ స్నానముచేసి విశుద్ధవస్త్రముధరించి భస్మత్రిపుండ్రము ధరియించి సావధానమనస్సుచేత లింగనైవేద్యము చేయవలెను ముఖ్యము

శ్లో॥ మన్నిమిత్తంకృతంపాకంతత్పాకంముఖ్యమేవహి। వస్త్రపూతాం బునాకార్యంముఖ్యాన్ముఖ్యతరంభవేత్ ॥౫॥

తా॥ నాయొక్క సంబంధమైన లింగముకొరకు చేయబడిన పాకము ఆపాకము ముఖ్యమైనటువంటిది వస్త్రపూతోదకముచే చేయవలెను పాకము ముఖ్యముగూర్చిన ముఖ్యమౌను.

శ్లో॥ లింగార్థం జంగమార్థంచగుర్వర్థంపాకముత్తమం। ఆత్మార్థంతత్కృతం పాకంశ్వానమాంససమంభవేత్ ॥౬॥

తా॥ లింగముకొరకు జంగమకొరకు గురువుకొరకు (చేయబడిన) పాకము శ్రేష్ఠము, ఏదితనకొరకై చేయబడిన పాకము కుక్కమాంసముతో సమానమౌను.

శ్లో॥ సంకల్పితంచలింగార్థం లింగార్థంసుసమాగతం । లింగార్థమితికర్తవ్యంపాకం లింగాంగసంగినః ॥౭॥



తా॥ లింగాంగ సంగులై నటువంటివారు లింగనిమిత్తము సం

కల్పించినటువంటిదీ, లింగనిమిత్తము కేవలము రాబడినటువంటిదీ లింగనిమిత్తమని పాకము చేయవలయును.

శ్లో॥ ఇంద్రియైర్విషయాసక్తో భూతాత్మాపేక్షయాకృతం। యత్పాకంజీవినోచ్ఛిష్టమనర్హంతచ్ఛివార్పణే ॥౮॥

తా॥ ఘ్రాణజిహ్వానేత్రశ్రోత్రత్వగింద్రియములచేత గంధరసరూపశబ్దస్పర్శాసక్తుండగు నటువంటివాడు పంచభూతాత్మాపేక్షకొరకై యేది పాకము చేయబడినదో అనీజీవియొక్క యెంగిలి లింగార్పణమునకు యోగ్యముకాదు.

శ్లో॥ అసంస్కృతాత్మేంద్రియభుక్తకామైరలింగిభిస్స్వార్థపరైస్సకామైః। దృష్టంస్మృతం స్పృష్టమథోపభుక్తం ఘ్రాతాద్యముచ్ఛిష్టమితీహసిద్ధం ॥౯॥

తా॥ అట్టిలింగార్థపాకము దీక్షాగాని జీవేంద్రియ భోగపరులచేతను అలింగులచేతను ఆత్మార్థపరులచేత కామకులచేతను చూచిన దలచిన ముట్టిన భుజించిన వాసనగ్రహించుటాది యుచ్ఛిష్టమని ఇహప్రసిద్ధము చెప్పబడినది,

శ్లో॥ ఆత్మస్థితశ్శివోనిత్యం దేహప్రాణహృదింద్రియైః। తదర్థమితియత్కార్యంతచ్ఛివార్పణమర్హకం ॥౧౦॥

తా॥ శివుడు నెల్లప్పుడు ఆత్మస్థిత । అనగా । ఆత్మాంతర్యామియైయున్నాడు ఆయనకొరకని శరీర ప్రాణమనేంద్రియములతో ఏదీ పాకము చేయబడినదో అదీ లింగార్పణను గూర్చి యోగ్యము.

శ్లో॥ అతీంద్రియై రవిషయైరకామైష్షట్స్థలాత్మభిః। యద్భుక్తంతద్ధినోచ్ఛిష్టం ననిషిద్ధం నదూషితం ॥౧౧॥

తా॥ ఇంద్రియనిగ్రహులచేత విషయాతిక్రములచేత నిష్కాములచేత షట్స్థల షణ్లింగాత్ములచేత భుంజించబడెనేని యదీ నిశ్చయముగా యుచ్ఛిష్టముకాదు నిషిద్ధముకాదు దూష్యముకాదు.

శ్లో॥ యత్సంకల్ప్యాత్మదేవాయ పత్రపుష్పంఫలంజలం। అన్నపానాదికంసర్వం నైవేద్యమితికీర్తితం॥౧౨॥

తా॥ ఏదిలింగమూర్తి కొరకు పత్రిము పుష్పము ఫలము జలము అన్నము పానము మొదలుకొని సంకల్పించ బడినవో అవియన్నియు నైవే ద్యమని కీర్తించబడినది.

శ్లో॥ లింగార్థమితిసంకల్ప్యయత్కృతంలింగసంగిభిః। నదద్యాత్కా పితత్పాకమలింగధారిణాంన్నృణాం॥౧౪॥

తా॥ ఎద్దైతే లింగనిమిత్తమని సంకల్పించి లింగాంగులచేత చే యుబడిన పాకము అపక్వమును లింగధారులుకాని మానవులకు ఎప్పు డైనఇవ్వ వలసినదికాదు.

శ్లో॥ లింగాంగిభిః కృతంపాకం సుదద్యాల్లింగధారిణాం। లింగార్పి తానంతరేపి నదద్యాత్త దలింగీనాం॥౧౫॥

తా॥ లింగాంగులచేత చేయబడినపాకము లింగధారులకు అతి శయముగా ఇవ్వవలసినది లింగార్పితమైన తదనంతరముగూడా అలిం గులకు ఇవ్వతగినదికాదు.

శ్లో॥ హస్తపర్షం మహాశ్రేష్ఠం భక్తానాం పాకముత్తమం। హస్తప ర్షమ విశ్వాసాత్పాకం గోమాంసతత్సమం॥౧౬॥

తా॥ హస్తపరషము అతిశయ శ్రేష్ఠము (అట్టి) పాకము భ క్తులకు ముఖ్యము హస్తపరషమును గూర్చి విశ్వాసములేకపోవడమువ లన ఆపాకము గోమాంసముతో తుల్యము.

శ్లో॥ యద్రూపమర్పితం లింగసర్వేషామపివస్తునాం। తద్రూపమ చనాకాల పర్యంతం ప్రసాదకం॥౧౭॥ పూజాది పూజాం తమేవపదార్థాస్స్యునిరంతరం। పూజాంతేతుచ పూజాదౌ మె సర్వేచ ప్రసాదకాః॥౧౮॥

తా॥ సమస్త పదార్థములు లింగమందు ఏరూపంగా అర్పిం చబడినవో అదేరూపముగా మళ్లీపూజాకాలమువరకుప్రసాదములు పూ జమొదలు పూజాంతమువరకు నిరంతరము పదార్థములు పూజాంత మునందే। పునఃపూజాది వరకు అవియన్నియు ప్రసాదములు.

— నివేదనప్రకారం —

శ్లో॥ భుంజీయాద్రుద్రభుక్తాన్నంరుద్రపీతంజలంపిబేత్ । రుద్రాఘ్రాతం సదాజిఘ్రేదితి జాబాలికశృతిః॥౧॥

తా॥ సదాకాలము శివభుక్తాన్నము భుంజించ వలయు శివపీతోదకము త్రాగవలయును శివాఘ్రాతముఆఘ్రాణించ వలయునని జాబాలికశృతి ప్రమాణము.

శ్లో॥ అర్పయిత్వానిజేలింగే పత్రంపుష్పం ఫలంజలం। అన్నాద్యం సర్వభోజ్యంచస్వీకుర్యాద్భక్తిమాన్నరః॥౨॥

తా॥ శివభక్తిపరుడయి నటువంటి మానవుండు పత్రము పుష్పము ఫలము జలము అన్నము మొదలైనసకల భక్షణయోగ్యములు ఇష్టలింగమందు అర్పించి ( తాను ] అరగించ వలసినది.

శ్లో॥ యేలింగధారిణో లోకే యేశివైకపరాయణాః । తేషాంతుశివనిర్మాల్యముచితంనాన్యజంతుషు ॥౩॥

తా॥ ఎవ్వరు లోకమందు లింగధారులో ఎవ్వరు కేవల శివైకపరాయణులో వారలకు లింగనిర్మాల్యము యోగ్యము ఇతరమనుష్యులందు కాదము.

శ్లో॥ శివభక్తివిహీనానాం జంతూనాంపాపకర్మిణాం । విశుద్ధశివనిర్మాల్యేనాధికారోపి కుత్రచిత్ ॥౪॥

తా॥ శివభక్తి విహీనులై నటువంటి మనుష్యజంతువులకు దురితయుక్తులకు పవిత్రమైన లింగనిర్మాల్యమందు నెందునైనను అధికారము లేదు.

శ్లో॥ నిర్మాల్యంనిర్మలంశుద్ధం శివేనస్వీకృతంయతః । నిర్మలైస్తత్సదైధార్యంనాన్యైః ప్రాకృతజంతుభిః॥౫॥

తా॥ ఏదిలింగముచేత స్వీకరించ బడిన నిర్మలమైనటువంటి పవిత్రమైనటువంటి నిర్మాల్యమును నిర్మలులైన లింగధారులచేతనే భుంజింపవలసినది యన్యులైన నీచప్రాణులచేతకూడదు.



శ్లో॥ పత్రపుష్పంఫలంతోయ మన్నమౌషధమాదికం । లింగేసమర్ప్య

తత్సర్వంస్వీకుర్యా ల్లింగతత్వజ్ఞైః ॥౬॥

తా॥ లింగతత్వ రులచేత పత్రము, పుష్పము, ఫలము, జలము, అన్నము, ఔషధము, మొదలగునవియును, ఇష్టలింగమందు సమర్పించి యవియన్నియు (తాము) అనుభవించతగును.

శ్లో॥ అర్పితానర్పితంచైవయోభుక్తేపాపకృన్నరః। తద్ద్రవ్యంమాంసతుల్యంచతన్నరోభవితాసమః ॥౭॥

తా॥ ఎవడు, ఇష్టలింగముచే నర్పించ బడనటువంటిపదార్థము భుంజించుచున్నాడో, ఆమనుష్యుడు పాపముచేసిన వాడౌను, ఆపదార్థము మాంసముతో సమము, ఆనరుడుభవితోసముడు.

శ్లో॥ భాజనంభస్మసంశుద్ధముపభాజనసంయుతం। శుద్ధతోయేనసంక్షాళ్యశుద్ధవస్త్రే పరిక్షిపేత్ ॥౮॥

తా॥ భాజనం) అనగా తలియను భస్మముచే శుద్ధిచేసి రెండవ గిన్నెతో గూడుకొన్న దాన్ని పూతోదకముతో కడిగి పరిశుద్ధవస్త్రము మీద పెట్టవలయును.

శ్లో॥ గురోరపహారప్రమాణాన్నం పాత్రేశాకసమన్వితం। స్పృష్ట్వాహస్తేనతన్నామ స్వేష్టలింగనివేదయేత్ ॥౯॥

తా॥ గురువుయొక్క యోగ్య ప్రమాణాన్నమును తలియందు కూరతో గూడుకొన్న దానిని దక్షిణహస్తముచే ముట్టిలింగ పదార్థనామస మర్పణముగా తనఇష్టలింగమందు నివేదించవలయును.

శ్లో॥ హస్తపరుషంమహాపరుషం గురుపరుషంవిశేషతః। హస్తపరుషం వినాభుక్తే శ్వానమాంససమంభవేత్ ॥౩॥

తా॥ పరుషమనగా లోహమును బంగారు చేయునది, యట్టిహస్తపరుష మతిశయమైనది, గురువుపరుషము మిక్కిలి విశేషమైనది గురుదేవహస్త పరుషము లేక భుజించుచున్నాడో (ఆపదార్థము) కుక్కమాంస సమమౌను.

శ్లో॥ పంచాంగుళిపంచబీజం మధ్యేప్రణవబీజకం। భస్మనావిన్యసేద్ధృక్త్వా భవరోగనివారిణీం ॥

తా॥ జన్మరోగ నివారణియగు మంత్రమును భక్తిచేత పంచాంగుళములయందు నకారాదియకారాంత మైదువర్ణములు పాణిమధ్యమందు ప్రణవము భస్మముతో విన్యసించ వలయును.

శ్లో॥ అన్నాదికం సర్వపదార్థజాలం క్రమేణ తన్నామ పురస్సరం తేన। స్వస్యేష్టలింగేధిక సావధానాత్ భోక్తవ్యమ్మస్వచ్ఛ మనుస్మృతేన ॥౫॥

తా॥ అన్నము మొదలగు సర్వపదార్థ సమూహము క్రమంగా ముందరనుంచబడిన వాటినామములచే మిక్కిలి సావధానమువలన తన యిష్టలింగమందు [సమర్పించి] నిర్మలమైన మూలపంచాక్షరీ మంత్రముతో భుజించ వలయును.

శ్లో॥ రూపం సమర్ప్యేత్తద్ద్రవ్యం రుచిం సమర్పయేత్తథా। ఉభయార్పణవిహీనం చేత్ప్రసాదం నిష్ఫలం భవేత్ ॥౬॥

తా॥ రూపము [ ఇష్టలింగమందు ] సమర్పించి తదుపరి ఆద్రవ్యముయొక్క రుచి ( ప్రాణలింగమందు ) సమర్పించ వలసినది, ఇష్టప్రాణోభయార్పణ విహీనమయ్యేనేని ఆప్రసాదము నిష్ఫల మాచున్నది.

శ్లో॥ నైవేద్యం పురతోన్యస్తం దర్శనాత్స్వీకృతం మయా। రసాన్భక్తస్య జిహ్వాగ్రే అశ్నామి కలశోద్భవ ॥౭॥

తా॥ ఓయగస్త్యుడా ఎదుటనుంచిన నైవేద్యము నాచేత దర్శనమువలన తీసుకొనబడును ( కాని ) భక్తునియొక్క జిహ్వాగ్రమందు షడ్రసములను భుంజించు చున్నాను.

## —✻ అర్పణయోగ్యం ✻—

శ్లో॥ యద్రూపమర్పితం లింగే తద్రూపం భోక్తుమర్హతి। రూపాంతరం నభోక్తవ్యం విభుక్తం చేదనర్పితం ॥౮॥

తా॥ ఏరూపము [ ప్రథమత ] ఇష్టలింగమందు, అర్పించబడినదో ఆదేరూపము, భుంజించుటకు యోగ్యమగుచున్నది, రూపాంతరము అనగా ఇతరరూపము భుంజించవలదు అధవా భుంజించునేని లింగార్పితముకాదు,

శ్లో॥ పాత్రస్థంశివభక్తోఽసం భుంజీయాత్తదతంద్రితః । భాండస్థంన తుభుంజీయాద్యది భుక్తైనపాపభుక్ ॥౧౬॥

తా॥ లింగోపభోగభోక్తుండగు శివభక్తుండు పాత్రయందున్న ప్రసాదము నాలస్యముచేయక భుంజించవలసినది భాండమందున్న పదార్థము భుంజించవలదు భుజించునేని వాడు పాపముభుంజించిన వాడౌను.

శ్లో॥ బహుర్వాపిస్తోకమేవాపి శిష్టమన్నంవిమిశ్రితం । అనర్పితంచభుంజానాత దేవాన్నం సకిల్బిషం ॥౧౭॥

తా॥ మిక్కిలిగా యినను కొంచమైనను మిగిలినన్నము కలిసినటు వంటి యనర్పితము భుంజించుచున్నాడా ఆయన్నమే పాపరూపము,

—✽ భిక్షార్పణలక్షణం ✽—

శ్లో॥ యద్యదాత్మహితంవస్తు ద్రవ్యాణ్యనిశమేవచ । తత్తద్భాగాన్స మాదాయయథాశాస్త్రోక్తవర్త్మనా ॥౧॥ మధ్యేసంస్థాపయేదన్నం దక్షిణేఘృతపాయసం । వామేభక్ష్యంసుభోజ్యంచశాకాదీన్ పురతస్తథా । పాత్రేసంస్థాప్యతత్సర్వం పదార్థంతుపృథక్పృథక్ ॥ సంస్థాప్యవామహస్తేతుస్వేష్టలింగం శుభంకరం. ॥౩॥ త్రివారంపంచవారం వాసప్తవారమథాపివా । ప్రత్యేకమేకం సంస్పృశ్యపదార్థం పాత్రసంస్థితం ॥౪॥

పతాకముద్రయా వక్ష్యమాణయామూలమంత్రతః । అర్పయేద ప్రమాదేన స్వేష్టలింగస్యచాదరాత్ । పశ్చాదాచమనందద్యాదాచమనాఖ్యముద్రయా। సజ్జీకాదౌనివేశ్యాథస్వేష్టలింగం సుతర్పితం । తచ్ఛేషంభుంజియాత్పశ్చాదుపర్యాపరస్వాన్తనః । యద్యదాపేక్షితంతత్తత్సంబంధమశ్నీయాత్సుధీః । భిక్షాభోజనమాఖ్యాతమేతత్పూర్వపురాతనైః । సామాన్యవీరశైవస్య లక్షణంకథితం త్విదం ॥౮॥

తా॥ లింగార్పితము చేయుపురుషుండు నిత్యముపచేది తనకు ఇష్టమైనటువంటి పదార్థములు దానిదానియందు కొంచముకొంచము

ఆయాయా భాగములను, శివశాస్త్రోక్తమార్గముచే, పాత్రయందు అనగా కంచమునందు. అన్నమునడుమ వడ్డించవలసినది. నెయ్యి, పాయసము, దక్షిణభాగమందు, భక్ష్యభోజ్యము, వామభాగమందును, కూరగాయలు మొదలు ముందరిభాగమందు, సర్వపదార్థములు, వేరువేరుగ నుంచి, వామహస్తమందున్నమంగళకరమైనటువంటి తనయిష్టలింగమూర్తి నిగూర్చి, మూడుమారులైన, ఐదుమారులైన, ఏడుమారులైననుకంచమందున్న పదార్థములు నొక టొకటిని, ముట్టిపతాక ముద్రచేత, మూలమంత్రముయొక్క ఉచ్చారణతో కలిసినోడ ఉదరమువలన తనయిష్టలింగమునకు నైవేద్యము సమర్పించవలయును పిదప ఆచమనమును నిడుముద్రచే ఆచమనము నివ్వవలయును. పంచిగా తర్పించబడిన ఇష్టలింగమును సజ్జికాదియందు ప్రవేశింపజేసి తరువాత అలింగశేష ప్రసాదము భుజించవలసినది తదనంతరము తనకు ఏదేదికోరిక గలిగినటువంటి పదార్థములపైపై తెప్పించుకొని ఆయాయాలింగనివేదన సంబంధమైనపదార్థములు భుజించవలసినది ఇదిపూర్వము పురాతనులచేత భిన్నభోజనమని ఖ్యాతింపబడినది ఇదిసామాన్య వీరశైవ లక్షణము చెప్పబడినది.

శ్లో॥ భిన్నత్వాచ్చమతింతత్రకథ్యతేభిన్నభోజనే । అనర్పణత్వంభిన్నత్వం తస్మిన్నేవతుభవేత్కిల ॥౯॥

తా॥ భిన్నత్వమనెడి పేరు ఎట్లంటె ఆచట భిన్నభోజనమందు చెప్పబడ్డది లింగార్పితమైన భాండస్థపదార్థము ఆహారపూరణము నకు మళ్లీవడ్డించుకొనునది భిన్నత్వము అనర్పితము కలియుచున్నదిగదా.

—☀ సహభోజనము ☀—

శ్లో॥ సహభోజనత్వంతత్రకింనామసహభోజనే । సమానభోజనత్వా దోదనయోర్లింగలింగినోః ॥౧॥

తా॥ సహభోజన మనియెడి పేరు ఆచట సహభోజన మందెట్లంటె లింగమునకు లింగాంగునకు ఇద్దరికి ఏదిసమాన భోజనమో అనగా నోగదర్పించబడినది యోగరర్పించబడినది ఉభయులకు సమానభోక్తమో అదిసహభోజనత్వము.

శ్లో॥ మధుపర్కేఽపృథక్పాత్రం యథానాస్తి వివాహకే । తథైవ వీరశైవానాం తల్లింగస్య న తత్ఖలు ॥౨॥

తా॥ వివాహమున మధుపర్కమందు యట్లు రెండవ పాత్ర లేదో అట్లు గానె వీరశైవులకు లింగమునకు రెండో పాత్ర లేదు కదా ॥

శ్లో॥ ఏకగ్రాసమేకపాత్రమేకభావేన భోజయేత్ । తద్విధానమహం వక్ష్యే యథాశాస్త్రానుసారతః ॥౩॥

తా॥ ఒక్క పాత్రను, ఒక్క కబళమును, ఒక్క భావముతో, భుజింపచేయవలసినది నేనావిధానము శాస్త్రానుసారముగా చెప్పుచున్నాను.

శ్లో॥ పాత్రస్థశుద్ధమన్నాది పదార్థం సకలం సకృత్ । స్వేష్టలింగస్య తృప్త్యర్థం కరపీఠస్థితస్య చ । అధారయిత్వా తల్లింగం మస్తకాదిస్థలేషు చ । తదన్నగ్రాసమేకైకమాదాయ దాయమంత్రతః । యద్యదాత్మహితం వస్తు హ్యపర్యవరిస్యాగతం । అవంచయిత్వా తద్ద్యాత్పూర్వవత్సు విచారతః ॥౪॥ ఏవమాతృప్తిపర్యంతమాచరేల్లైక్యబుద్ధిమాన్ । తత్పాత్రే జలమాదాయ దత్వా లింగస్య తజ్జలం ॥౫॥ తజ్జలేనైవ హస్తం చ పాత్రం ప్రక్షాల్య పాశయేత్ । ఏవం వారత్రియం కృత్వా పరితః స్వస్య పాణినా ॥ ౬॥ తత్పాత్రం ప్రొంఛనం కార్యం న కార్యం త్వన్యథా సుధీః । సహభోజనమాఖ్యాతం నిరాధారి సుధీమతః ॥౭॥

తా॥ లింగైక్యబుద్ధిగలసహభోజనపరుండు తన ఇష్టలింగము యొక్క తృప్తి కొరకు పరిశుద్ధాన్నము మొదలగు సకల పదార్థములు గూడ భోజన పాత్రయందున్నటువంటివి- ఇష్టలింగము మస్తకాదిస్థానములయందు ధరించక హస్తపీఠమందున్న లింగమునకు నొక్కొక్క కబళము పంచాక్షరి మంత్రయుక్తము గాతీసుకొని భుజించుచు నేదేదియాత్మకు విహితమైనపదార్థము వెంట వెంట రాబడినది వంచించక పూర్వమువలె పడ్డించుక తృప్తిపర్యంతరము పెట్టించి పాత్రయందుదకము దీసుకొని లింగమునకర్పించి యాభోజనపాత్రయందు హస్తములుకడిగి యాజలము పుచ్చుకొనవలసినది. ఈ ప్రకారము మూడుసార్లు పుచ్చుకొని తరువాత తన హస్తముచేత భోజనస్థాలి తేమతీయ్యవలసినది మరేమి చేయకూడదు. ఇ

ఇరాఖాత సహభోజనమునిచేయఁబడినది,

శ్లో॥ సర్వేంద్రియగత ప్రాణీభాజన భోజనః తథా। పునఃపునశ్చ లింగ సమర్పణ నరకం వ్రజేత్. ౹౧౦॥

తా॥ సహభోజనము చేసినతే పక స్వభావముగలవాడు సర్వేంద్రియముల వ్యాపించబడిన ప్రాణిపాత్రమే స్థాలియందు భుంజించుచు మాటిమాటికి లింగమందు సమర్పించుచునని నరకముబొందుచున్నాడు.

శ్లో॥ ఇష్టలింగార్పితం శుద్ధం ప్రాణలింగముఖార్పితం। సిద్ధంతతః ప్రసిద్ధంచ భావలింగార్పితం విదుః. ౹౧౧॥

తా॥ ఇష్టలింగార్పితమైన పదార్థము రూపగ్రహణము చేత శుద్ధప్రసాదము ప్రాణలింగార్పిత పదార్థము రుచిగ్రహణముచే సిద్ధప్రసాదము భావలింగార్పిత మగుపదార్థము తృప్తిగ్రహణము చేప్రసిద్ధప్రసాదమని తెలియవలయు,

—✻ లింగప్రసాదము ✻—

శ్లో॥ అణుమాత్రం ప్రసాదన్నో నిత్యాభుక్తే సకిల్బిషం। సపాపీనరకం యాతిశద్గృహం నరకాలయం. ౹౧॥

తా॥ ఎవ్వడు, అణుమాత్రము, లింగప్రసాదాన్నమును విడిచిభుంజించుచున్నాడో వాడు పాపాత్ముండు ఆపాపిష్టినరకము జేరుచున్నాడు అయిల్లునరకగృహము,

శ్లో॥ ప్రసాదం పతితే భూమౌ మాకల్పకోటిశతైరపి। శ్వానయోనిశతంగత్వా చండాలగృహమావిశేత్. ౹౨॥

తా॥ ప్రసాదము భూమియందు పడుచున్నదేని నూరుకోట్లబ్రహ్మకల్పములు నూరుమారులు కుక్కయోనిజన్మించి చండాలగృహముప్రవేశించును,

శ్లో॥ తిలషోడశభాగంచ తృణాగ్రాంబుకణోపమా। తీర్థః ప్రసాదయోస్త్యాజ్య సేవయా మోక్షమాప్నుయాత్ ॥౩॥

తా॥ నువ్వునందు పదియారవభాగముల్లము, ప్రసాదము, గడ్డిపుల్లాగ్రముందుండు దకబిందువు సమానము తీర్థము అట్టిపరిమాణ తీర్థ

ప్రసాదములయొక్క సేవచేతను ముక్తినిపొందుచున్నాడు,

శ్లో॥ సుప్రతిష్ఠితలింగేతుయథాపూర్వభావనా। తథాశివప్రసాదేచ పూర్వనామనసంస్మరేత్. ॥౪॥

తా॥ మంత్రసంస్కారముచేత స్థాపనచేసినలింగమందు నెట్లాగు శిలాదులని పూర్వభావము లేకో అట్లాగె లింగప్రసాదమందుపదార్థ పూర్వనామము స్మరించవలసినదికాదు,

శ్లో॥ లింగస్యావసరేదత్తం తద్ద్రవ్యంతుశుభంభవేత్। అన్యేనావసరేదత్తమశుభంతదనర్పితం. ॥౫॥

తా॥ ఏపదార్థము లింగముయొక్క అర్పితసమయమందు ఇవ్వబడుచున్నదో ఆపదార్థము లింగానందమౌచున్నది తనయొక్కఇష్టసమయమందు ఇవ్వబడునో నిరానందము అదియనర్పితము,

శ్లో॥ నిర్మాల్యధారణేనైవ సాలోక్యంలభతేనరః। పాదోదకస్యపానేన సామీప్యంలభతేసదా ॥౬॥ ప్రసాదసేవనేనైవ సారూప్యం ప్రతిగచ్ఛతి। పాదోదకప్రసాదేన మత్సాయుజ్యమవాప్నుయాత్ ॥౭॥

తా॥ ఓపార్వతినరుండు లింగనిర్మాల్యధారణముచేత సాలోక్యపదము పొందుచున్నాడు పాదోదకముయొక్క పానముచేతను సదా సామీప్య పదవిపొందుచున్నాడు ప్రసాదసేవనముచేత సారూప్యపదవి పొందుచున్నాడు పాదోదక ప్రసాదముచేత నాయొక్క సాయుజ్యమునుపొందుచున్నాడు,

శ్లో॥ లింగార్పితోదకేనైవభాజనంక్షాళయేత్సుధీః। తత్ప్రసాదోదకం పీత్వాభాజనార్ద్రత్వమాహరేత్. ॥౯॥

తా॥ లింగప్రసాదాసక్తమానసుండగు భక్తుండు లింగార్పితోదకముచేతనే భాజనపాత్రను కడగవలయును అతడు ప్రసాదోదకము త్రాగిపాత్రయొక్క ద్రవము (శరీరలేపనముచే) నాపహరవలయును,

శ్లో॥ భోజనానంతరేదేవి భాజనంలేహ్య... క్షాళనం కృత్వాపునర్లేహ్యం నభావయేత్. ॥౧౦॥

తా॥ ఓపార్వతి యర్పణా నంతరమందు తలియకహామే చేయ వలయును (క్రియోదకముచే) మూడుమారులు క్షాళనము చేసిమరలితే ప్రము చేయవలసినది (కాని) అర్పణచేయకూడదు,

శ్లో॥ లింగార్చనంచకాలేతు ప్రమాణంషోడశాంగుళం।లింగాపీఠం చసమయేసమీపం చతురంగులం॥౧౧॥ మధ్యమానామికాంగుష్ఠం ముద్రినామకురంగకం । ఇష్టలింగస్యనైవేద్యం మమతృప్తికరంభవేత్. ॥౧౨॥

తా॥ ఓపార్వతీ లింగార్చన కాలమందు లింగము ముఖమునకు పదియారంగుళముల దూరమునుండవలయు లింగాపీఠసమయమందునై వేద్యహస్తము లింగమునకు నాలుగంగుళముల దూరము నుండవలయున మిత్రవేలు దర్భవ్రేలుబొట్టన వ్రేలుమూడు గూడినకురంగముద్రచేతను లింగముయొక్కనైవేద్యము నాకుతృప్తియాచున్నది,

—※ ప్రసాదాయోగ్యవస్తుత్యాగః ※—

శ్లో॥ మక్షికంమశకం కేశం ద్విజబీజంతుశాలయః । మృత్తికాకాష్ఠపాషాణంప్రసాదేపిచవర్జయేత్ ॥౧॥

తా॥ ఈగె- దోమ- వెంట్రుక- ఘుట్టివిత్తు- ధాన్యములు- మన్ను- కట్టె- రాతు ప్రసాదమందు పడెనేని । తీసివేయవలసినది,

శ్లో॥ ప్రసాదేకఠినంత్యాజ్య మగ్నిదగ్ధంనకారయేత్ । త్యక్త్వాన్యోత్తా నిసర్వాణిత్యక్తకాఠిన్యవస్తవః ॥౨॥ అర్పణానంతరంసర్వంత ద్భూమౌనిక్షిపేత్సుధీః॥

తా॥ ప్రసాదమందు కఠినమైన వస్తువుతీసి అగ్నిచేత దహించవలదు. ఇట్లాటి తీసేటటువంటి సర్వవస్తువులు కఠినవస్తువులుతీసియర్పణానంతరము అచేభూమియందు నన్నిపాతిపెట్టవలయును.

శ్లో॥ పాషాణంతృణకాష్ఠంచసర్వంకఫంచసర్వంపరిత్యజ్యమహా నికేశానిమశకాదంశ సంతతిః । పిపీలికాదీనిసర్వంపరిత్యజ్యమహా

అచంలిజగతాంపూజ్యంప్రసాదం యోగినస్సదా ॥౭॥

తా॥ ఓపార్వతి మహేశ్వరులైనటువంటి శివయోగీశ్వరులు రాతు- గడ్డి- పత్తి-బురద-ధాన్యము-కత్తితుకుడలు- వెంట్రుకలు-దోమలు-ఈగెలు, సమూహముచీమలు మొదలగునన్నియు తీసివేసి భస్మముచే పాదోదకము చేశుద్ధి పరచి జగత్పూజ్యమైనప్రసాదమును సదాభుంజించుచున్నారు,

శ్లో॥ లింగస్యార్పణకాలేవ సరేజ్ఞాతమజ్ఞాతమేవవా । అర్పితద్రవ్యమేవాహార్యమనర్హాణాం నార్పణంభవేత్ ॥౭॥

తా॥ లింగమున కర్పించే సమయమందు తెలిసిననైనను తెలియనట్లయినను అర్పించదగిన ద్రవ్యమే అర్పణయోగ్యము యోగ్యము కానిది అర్పణచేయతగదు.

శ్లో॥ ద్రాక్షాఖర్జూరచూతానీ న్యఖండానిని వేదయేత్ । ఇక్షురంభాఫలాదీనిసఖండానిని వేదయేత్ ॥౮॥

తా॥ ద్రాక్షాఖర్జూర మామిడిపండ్లు మొదలగునవి ఛేదించక నివే[?]చవలసినది. చేరుకుఅరిటిపండ్లు మొదలైనవి త్వక్ఖండించి నివేదించవలయును.

శ్లో॥ యద్యదాత్మహితంలోకేతత్తద్ద్రవ్యమవంచయన్ । స్వేష్టలింగార్పితంకృత్వాసుభోగిసప్రసాదవాన్ ॥౯॥

తా॥ ఎదేదియాత్మకు లోకమందుఇష్టమైన పదార్థములుగలవో ఆయాయద్రవ్యములు వంచనచేయక [ఇంద్రియాదాగతంకించిద్ద్రవ్యంస్వంతచ్ఛివార్పితం । తత్ప్రసాదంతు భోక్తవ్యం తదింద్రియముఖేనచ] తన ఇష్టలింగార్పణము చేసి మంచిగా భుంజించుచువాడేప్రసాదవంతుండు.

శ్లో॥ ఆత్మప్రియంక్రియాదూష్యం యత్సద్ద్రవ్యమపిత్యజేత్ । ఆత్మానర్హాంక్రియాయోగ్యం యత్సద్ద్రవ్యమపిత్యజేత్ ॥౧౦॥

తా॥ ఏదియాత్మకు,ప్రియమైు,అదియాచారదూష్యమౌ, ఆద్రవ్యమును విడువవల[?] ఏదియాత్మ కయోగ్యమైయున్నా ఆచారయోగ్యమోయదివిడువవలసినది.

శ్లో॥ క్రియాత్మాశివయోగత్వా దుభయోర్యోగ్యమర్హకం । ఆ త్మప్రియంక్రియాయోగ్యంలింగేతద్ద్రవ్యమర్పయేత్. ॥౧౧॥

తా॥ క్రియయు నాత్మయు లింగసంయోగము కాబట్టి యుభయమునకు యోగ్యమైనదే యుచితము ఆత్మప్రియమైనటువంటి క్రియాయోగ్యమైనటువంటి ద్రవ్యమును లింగమందు సమర్పించ వలసినది.

—✻ ఆచారకాండగురుపూజాప్రకరణ ✻—

శ్లో॥ యథాదేవజగన్నాథేభక్తింకుర్యాన్నిరంతరం । తథాగురువరేకుర్యాదుపచారందినేదినే ॥౧॥

తా॥ ఎటువలె సదాకాలము జగన్నాయకుడగు శివునియందుభక్తిని చేయవలెనో అటువలెనే ప్రతిదినము గురుశ్రేష్ఠునియందును పచారము (అనగా) సేవయు చేయవలయు,

శ్లో॥ స్వగ్రామసంస్థితం నిత్యంత్రికాలంగురుమర్చయేత్ । క్రోశమాత్రస్థమాచార్య మేకవారందినేర్చయేత్. ॥౨॥

తా॥ తన గ్రామమందున్నటువంటి గురువును నిత్యము త్రికాలము పూజించవలయును క్రోశదూరమునను౦డు గురువును నొకపారి పగలు పూజించవలయును,

శ్లో॥ ఏకయోజనదూరస్థం వారనేమంగురుంయజేత్। పక్షేమాసేథవానేమంతత్తత్కాలంనలంఘయేత్. ॥౩॥

తా॥ ఒక యొజన దూరమందున్న (అనగా) ఆమడదూరమందున్న గురువును ప్రతివారము సేవించి పూజించవలయు అథవా పదిహేనుదినములందు నెలయందైన సేవను చేయవలయు నంత్తకంటెకాలమున తిక్రమించవలదు,

శ్లో॥ యోజనాద్యోజనేమాసేమాసక్రమమనువ్రజేత్ । యోజనేద్వాదశేప్యస్థంప్రత్యబ్దంగురుమర్చయేత్, ॥౪॥

తా॥ యొజనముకంటె యొజనదూరమందున్న గురువును ప్రతిమాసము పూజించవలసినది పన్నెండుయొజనముల దూరమందున్నగురువును ప్రతిసంవత్సరము పూజించవలసినది,



శ్లో॥ గురుభక్తిరతోభక్తొవర్షాత్కాలంనలంఘయేత్ । తతోదూరత

రేస్థాతుంనయోగ్యం గురుశిష్యయోః ॥౫॥

తా॥ గురుభక్త్యా సక్తుండైనభక్తుండు గురుపూజవినా । ఒకసం త్సరము కంటెకాలము దాటతగదు అంతకంటె దూరతరమందుండుట ఈ గురుశిష్యోభయులకు తగినదికాదు,

శ్లో॥ గోవత్సన్యాయమాఖ్యాతం కారుణ్యాత్మమముక్షువః। వ్యవహారికయుక్తానాంవీరశైవాన్వవర్తినాం ।౬॥ లౌకికాచారభక్తానాంత తోక్తాపారమార్థికా ॥౭॥

తా॥ కారుణ్యాత్ములగు మోక్షాపేక్షులైనటువంటి గురు శిష్యుల గోవత్సన్యాయమని బొగుడబడినది వ్యవహారముతో గూడుకొన్నటువం టి వీరశైవ మతప్రవర్తులగువారికి ప్రపంచ గురుభక్తులగు వారికిపైచెప్పి న ప్రకారము । పిమ్మటపారమార్థికము చెప్పబడినది,

—* పారమార్థికధర్మః *—

శ్లో॥ గురుమారాధయేన్నిత్యం గురుపాదోదకంపిబేత్। గురోఃప్రసాదంభుంజీయాద్గురుభక్తస్యలక్షణం. ॥౧॥

తా॥ అనుదినము గురువును పూజించవలసినది గురుపాదోదకము పుచ్చుకొనవలసినది గురువుయొక్క ప్రసాదముభుంజించవలసినది గురుభక్తి యొక్క లక్షణము,

శ్లో॥ శక్తోగురుంచశిష్యోసౌఆత్మాలయేసుపూజయేత్। అశక్తశ్చేత్స్వయంగత్వాగురుస్థానేసమర్చయేత్. ॥౨॥

తా॥ శిష్యుండుసమర్థుడా యెనేనిగురువును తనగృహమందుయుంచి గా పూజించవలసినది - అసమర్థుడాయె నేని తానేబోయిగురువు యొక్క స్థలమందు పూజించవలసినది.

శ్లో॥ కర్మణామనసావాచానిత్యమారాధయేద్గురుం । శరీరప్రాణమర్థంచసద్గురుభ్యోని వేదయేత్ - ॥౩॥

తా॥ నిత్యము గురువునుగూర్చిశరీరముచేత మనస్సుచేతవాక్కు చేత సేవించ వలసినది తనువు మనము ధనమున్ను ముఖ్యగురువులకొర

శ్లో॥ గురుసంస్మరణం నిత్యందర్శనం వందనంతథా । సేవనంపూజ నంసంఖ్యాందాస్య మాజ్ఞప్రవర్తనం ॥౪॥నిష్కాపట్యంసత్యవాక్యం సద్గుణానాంప్రకాశనం । గోపనందుర్గుణానాంచ గురోస్సర్వా న్నతిప్రియం. ॥౫॥

తా॥ అనుదినము సర్వాధి కుడయినటువంటి ప్రియుడయినటువం టిగురుమూర్తినిగూర్చిన సంస్మరించుట, దర్శించుట, నమస్కరించుట సే వించుట, పూజించుట, స్తుతించుట, పరిచరించుట, ఆజ్ఞప్రవర్తించుట కపటములేకుండుట, యథార్థము బలుకుట, సద్గుణముల ప్రకాశించుట దుర్గుణముల రక్షించుట, । దాచకోవడము । శిష్యునికి ముఖ్యధర్మములు

శ్లో॥ బహుజన్మకృతైఃపుణ్యై ర్గురుభక్తిలభేద్భువి । గురుభక్త్యాల భేజ్ఞానంజ్ఞానాన్మోక్షంలభేన్నర ॥౬॥

తా॥ ఓయిపురుషుడా అనేకజన్మములచేత చేయబడి నటువంటి పుణ్యములచేత భూమియందు గురుభక్తి గలుగుచున్నది (అట్టి) గురు భక్తిచే జ్ఞానముగలుగుచున్నది జ్ఞానమువలన మోక్షములభించుచున్నది.

## —✻ జంగమ గౌరవం ✻—

శ్లో॥ యథాగురౌ యథాలింగే భక్తిమార్గే పరివర్తతే । జంగమేచ తథానిత్యం భక్తింకుర్యాద్విచక్షణః ॥౭॥

తా॥ శివాచార ధురీణుడై నటువంటి పండితుండగు భక్తిమంతుం డు ఎట్లాగుగురువుయందు లింగమందు పరివర్తించుచున్నాడో అట్లాగె సదాజంగమమందున్ను భక్తిచేయ వలయును.

శ్లో॥ లింగంచద్వివిధం ప్రోక్తం జంగమాజంగమాత్మకం । అజంగమె యథాభక్తిర్జంగమేచతథాస్మృతః ॥౮॥

తా॥ లింగము (అనగా) రెండువిధములు చెప్పబడినది, చైత న్యాత్మకమగు జంగమము, అచైతన్యాత్మమగు, స్థావరము, ఎట్లాగ చై తన్యమగు ఇష్టలింగమందు భక్తిగలదో అట్లాగె జంగమమందని తెలి యవలెను.

శ్లో॥ అజంగమంతుయల్లింగంమృచ్ఛిలాదివినిర్మితం । తత్పరంజంగంమం లింగంశివయోగీతివిశ్రుతం. ॥౩॥

తా॥ ఏలింగము మృత్తికశిలామొదలగు వాటిచే నిర్మించబడినలింగము స్థిరలింగము దానికంటె చైతన్యాత్మక మగుజంగమ లింగముత్కృష్టము. శివయోగీశ్వరుడని ప్రసిద్ధమైనది,

శ్లో॥అచరేమంత్రసంస్కారా ల్లింగేవసతిశంకరః। సదాకాలంవసత్యేవచరలింగమహేశ్వరః. ॥౪॥

తా॥ శివుడు మంత్రసంస్కారము వల్లనుస్థావరమైన ఇష్టలింగమందునుంచున్నాడంతమేకాని. చరమగుజంగమ లింగమందు సదాకాలము ఆత్మాంతర్యామియై యుంటున్నాడు,

శ్లో॥ శివయోగిశివస్సాక్షాచ్ఛిత్రైంకర్యభక్తితః । పూజయేదాదరేణైవయథాలింగంయథాగురుః ॥౫॥

తా॥ శివయోగియైన జంగమము ప్రత్యక్షము శివుడని యాదరణచేత భృత్యాచార భక్తికలన- ఎట్లు లింగమునుగురువు. నారాధించబడునో. అట్లు జంగమమునుపూజించవలసినది,

శ్లో॥ పాదోదకంయథాభక్త్యాస్వీకరోతి మహేశితుః । తథాశివాత్మకోనిత్యంగురుజంగమయోరపి. ॥౬॥

తా॥ భక్తిమంతుడగు పురుషుండు ఇష్టలింగముయొక్క పాదోదకము నెట్లు భక్తిచేతస్వీకరించుచున్నాడో-అట్లాగలింగప్రాణియైనవాడు నిత్యముగురు జంగములయొక్క పాదోదకముస్వీకరించవలసినది,

శ్లో॥ లింగార్చనం నకర్తవ్యం కేవలం జంగమంవినా । లింగజంగమయోర్మధ్యే జంగమస్తు విశేష్యతే ॥౭॥ కనిష్ఠా మయిదృప్తాపూజామధ్యమం గురుపూజనం । ఉత్తమం జంగమేపూజా విశేషం సమయాగతం ॥౮॥

తా॥ జంగమ పూజావినాకేవలములింగపూజ చేయతగదు లింగజంగములయొక్కమధ్యమందు జంగమలింగము విశేషమైయున్నదిలింగముదుచేయబడుపూజకనిష్ఠముగురుపూజ మధ్యమము జంగమమందుపూజ శ్రేష్ఠముసమయమైజంగమ పూజవిశేషము.

శ్లో॥ స్థావరార్పిత నైవేద్యం నతృప్తిర్నమపార్వతి । జంగమార్పిత నైవేద్యం మమతృప్తి ర్భవేత్సదా ॥౯॥

తా॥ ఓపార్వతీ, స్థావరలింగమున కర్పించిన నైవేద్యము నాకుతృప్తికానేరదు జంగమకర్పించిన నైవేద్యము నాకునిరంతరము తృప్తియాచున్నది.

శ్లో॥ వృక్షస్యవదనం భూమిస్థావరస్యచ జంగమః । భూమౌవృక్షశ్చరే లింగంసౌఖ్యమాప్నోతి శాంకరి ॥౧౦॥

తా॥ ఓపార్వతీ వృక్షమునకు ముఖముభూమి, స్థావరమునకుముఖముజంగమము భూమియందు వృక్షము జంగమమందు లింగము సౌఖ్యము పొందును.

శ్లో॥ వర్తినాదీపికాతైలం భూమ్యావారీణిపాదపః । తథాచరాస్యా న్నైవేద్యం సభాగ్యశ్నామిశాంకరి ॥౧౧॥

తా॥ ఓపార్వతీ యట్లాగు దీపమునొత్తిచేత తైలము తీసుకొనుచున్నదో వృక్షము భూమిచేతను దకములను తీసుకొనుచున్నదో, అట్లాగెలింగస్వరూపు డనైన నేనూజంగమ ముఖమునుంచి నైవేద్యము నేల్లప్పుడుతీసుకొనుచున్నాను.

శ్లో॥ యథాభేరుండపక్షీతుద్వి ముఖాభ్యాం ప్రభుంజతే । తథామేద్వి ముఖందేవిఉభయేలింగజంగమౌ ॥౧౨॥

తా॥ ఓపార్వతీ యెటువలె భేరుండ పక్షి రెండు ముఖములచే భుజించుచున్నదో అట్లాగనాకు లింగజంగములు రెండుముఖములు

శ్లో॥ మద్దేహంలింగమాఖ్యాతంమత్ప్రాణంజంగమస్స్మృతః । దేహేంద్రియాదయస్సర్వేజీవాధారప్రవర్తినః ॥౧౩॥ప్రాణోపచారరాహిత్యంకిందేహస్యోపచారకైః । జంగమోపచారరాహిత్యం మమకిం లింగపూజయా. ॥౧౪॥

తా॥ లింగము నాయొక్క దేహమని ప్రసిద్ధమైనది జంగమమునాయొక్క ప్రాణమని చెప్పబడ్డది, దేహేంద్రియాదులన్నియు జీవాధారమునను సరించి యున్నవి యట్టి జీవోప చారము విడిచి దేహమున కుపచా

రములచేత నేమిఫలము, (అట్లా గె)నాయొక్క ప్రాణసంబంధమైనజం గమార్చన విడిచి నాయొక్క దేహసంబంధమగు లింగపూజతో నేమికా రణము.

శ్లో॥ గురుజంగమయోర్యత్ర సాన్నిధ్యే సతిభక్తిమాన్। జంగమస్యైవ పాదాంబు ప్రసాదం గ్రహణంవిధిః ॥౫౫॥

తా॥ ఎక్కడ భక్తుడగువానికి గురుజంగములయొక్క సాన్నిధ్యము గలుగుచున్నదో అక్కడ జంగమ పాదోదక ప్రసాదమే ముఖ్యమని విధిచెప్పు చున్నది.

—✻ పాదపూజా ✻—

శ్లో॥ ధృతశ్రీభూతి రుద్రాక్షోజప్త్వా పంచాక్షరీంశుభాం । నిత్యలింగార్చనం కృత్వా సునైవేద్యార్పణంవినా ॥౧॥ శుద్ధవస్త్రాసనం కృత్వా పూజాద్రవ్యాణి శోధయేత్। సమాహిత మనాభూత్వా ప్రణమ్య గురుపుంగవం ॥౨॥ శ్రద్ధాభక్త్యా సమానీయ దేశికస్య పదాంబుజే । ప్రక్షాళ్యాత్మ హితస్వస్య అభ్యుక్షేన్మూర్ధ్ని భక్తిమాన్ ॥౩॥

తా॥ శ్రీమద్విభూతి రుద్రాక్షధరించి మంగళప్రదమైన టువంటి పంచాక్షరి మంత్రమును । జపించినిత్య లింగార్చనముచేసి నైవేద్యార్పణముచేయక పరిశుద్ధవస్త్రాసనము వేసిపూజద్రవ్యములు శోధించవల యును, మరియు వధానమనస్కుడయిగురు వర్యునిగూర్చి నమస్కరించి విశ్వాసభక్తి చేరప్పించిగురువుయొక్కపాదపద్మములను ప్రక్షాళించియా త్మహితమైన పాదోదకము భక్తిగలవాడగుచు తనయొక్కశిరమంద భిషే చనము చేసుకొనవలయును,

శ్లో॥ విశుద్ధమానసం ప్రాప్య శుద్ధ వస్త్రేణసాదరం । తదాశిష్యోత్తమస్సమ్యక్పాదయోద్వయం సమాహరేత్ ॥౪॥

తా॥ శిష్యోత్తముండు- అపుడు పరిశుద్ధ మనమొంది యాదరణ పూర్వకముగా ధౌతవస్త్రముచే నతనిపాదములయొక్క ద్రవము తియ్యవలయును,

శ్లో॥ గురోరాజ్ఞాం సమాసాద్య పద్మాసన సమన్వితః। పూజాద్రవ్యం పురస్థాప్య పాత్రమేకం పరిగ్రహేత్ ॥౫॥ కలశోదకమధ్యే తు మంత్రం మూలాక్షరం శుభం। భస్మనావిన్య సేదస్మిన్పూజయేత్కలశం సుధీః ॥౬॥

తా॥ పాదపూజ వివేకమానసుండైన శిష్యుండు గురువుయొక్క యాజ్ఞ సుపొందిపద్మాసన యుక్తుండగుచు పూజద్రవ్యము ముందరనునిచియొకపాత్రను తీసుకొనుచు పాత్రోదక మధ్యమందు మంగళకరమైన మంత్ర మూలాక్షరము ( ఓం ) అనిభస్మముచే పాత్రయందు వ్రాయవలయు పాత్రను పూజించవలసినది,

శ్లో॥ దేశికస్య పదాంగుష్ఠే లిఖిత్వా ప్రణవం తథా । ఇష్టపూజావిధిం కృత్వా పాదపూజామనంతరం ॥౭॥

తా॥ గురుమూర్తి పాదాంగుష్ఠమందు ప్రణవము వ్రాసియట్లాగె ) ప్రథమం భస్మసంస్పృత్య ద్వితీయం మంత్రసంయుతం । తృతీయం పాద స్పర్శనంచ త్రిధోదకమితిస్మృతః, అనిపాతోదకమును పాదస్పర్శచేసి విధి ప్రకారము గురుమూర్తి యిష్టలింగము పూజించి యనంతరము పాదపూజ చేయదగును,

శ్లో॥ మనోవాక్కాయశుద్ధైశ్చ భక్తిశ్రద్ధసమాయుతః । లింగావలోకనం కృత్వా బ్రహ్మజ్ఞానసమన్వితః ॥౮॥ బ్రహ్మచక్రే శిఖాచక్రే ధ్యాత్వా పశ్చిమచక్రకే । తచ్ఛిఖాగ్రస్థితంవత్సచరంస్మరణపూర్వకం। అంగుష్ఠే భావయేద్రుద్రం తర్జన్యాంశంకరంస్మరేత్ । మధ్యమే చమహాదేవానామికాయాంత్రియంబకం ॥౯॥ కనిష్ఠే కామనాశం తు పాదోపరికపర్దినం । పాదాధఃపంచవదనం గుల్ఫయోర్భీమ భర్గకా ॥౧౦॥ సర్వంలింగమయంధ్యాత్వాపాదంజంగమలింగినః॥

తా॥ ఓయికుమారుడా మనోవాక్కాయములచేత భక్తిశ్రద్ధల తోగూడుకొన్నవాడై యిష్టలింగావలోకనముచేసి యంతస్స్ఫురిత చిత్ప్రకాశాన్వితుడగుచు బ్రహ్మచక్ర [illegible] పైనున్న పశ్చిమచక్ర శిఖాగ్రమందున్నజంగమస్మరణ పూర్వకముగా చరలింగముయొక్కపా

దమునంగుష్ఠమునరుద్రుండు, తర్జనిశంకరుండు, మధ్యముమహాదేవుండు, నరామికత్ర్యంబకుండు, కనిష్ఠమువామహాదుండు, పాదోర్ధ్వముకపర్ది పాదాధము పంచముఖుండు, గుల్ఫముల భీమభగుడులు, గాభావించవల యు, సర్వములింగమయము నిధ్యానించియు

శ్లో॥ హకారమాతృకాజలి వామహస్తేన ముత్తతా ॥౧౧॥ పాదద్వయం సమాగృహ్య నిక్షిప్తం వామపాణినా । అంఘ్రిద్వయాంగుళీష్వేవం లిఖేత్పంచాక్షరాణిచ । అంగుష్ఠద్వయమధ్యే తు ప్రణవా బసవాక్షరాః । శ్రీగురోః పాదపద్మాభ్యాం గంధపుష్పాక్షతాదిభిః । పూజయుక్త్వోపచారాద్యైః పూనఃపున్యః ప్రణామకైః ।౧౨॥ ఓంకారాదియకారాంత ద్వాదశాక్షరసంయుతం । అడమాక్షరత్రయం చైబసవేత్యక్షరాన్వితం। రేఖాగర్భైః కృతంజాప్యం గ్రామసంఖ్యా పరాననేఃగర

తా॥ ఓపార్వతీ వామహస్తమందు హకార, ప్రణవమునిర్మించి రెండుపాదములు తీసుకొనియడమ పాణిచేధరియించి పాదద్వయాంగుళీనులయందు పంచాక్షరములను. అంగుష్ఠద్వయమధ్యమందు ప్రణవము బసవనామము వ్రాయవలయు శ్రీగురుమూర్తియొక్క పాదపద్మములకై గంధపుష్పాక్షతాదులచేతను పచారాదులతోడపూజించిపునఃపునను సాష్టాంగములచే. ఓంకారాదియకారాంతము షడక్షరి త్రియాక్షరములు బసవాక్షరముల ద్వాదశాక్షరములు గూడుకొన్నమంత్రము రేఖగర్భములతోతొమ్మిది మారులుజపముచేయుచు,

శ్లో॥ పునఃపునఃప్రణామంతు నిర్మాల్యగ్రహణంకరె । లిఖిత్వాపాత్రగర్భేచ ప్రణవంప్రణవాంతరం ॥ ధ్యానామృతంచ యద్భావంతద్భావంభావితంకరె । గృహీత్వాకలశంచైవ చ్ఛరస్మరణపూర్వకం ॥౧౪॥

తా॥ నిర్మాల్య శ్రీపుష్పములు కరమందుతీసుకపునః పునసమస్కారము చేసి శ్రీ ... గర్భమందు షడక్షరవ్రాసి ... ధ్యానామృతమునుపొందబడినపూ- ఆ దేభావమును భావించియాత్రవి ధోదకపాత్రను

హస్తమందు తీసుకజంగమస్మరణపూర్వకముగా.

శ్లో॥ కలశోదకధారాయాం దక్షిణాంగుష్ఠమజ్జనం । తదంగమిష్టలింగంచబుధుసంఖ్యా షడక్షరం॥౨౦॥కలశోదకధారాయాంవామాంగుష్ఠేచమజ్జనం । తదంగంప్రాణలింగంచ పంచపంచాక్షరంస్మరేత్ ॥౨౧॥కలశోదక ధారాయామంఘ్రిమధ్యేచమజ్జనం॥ తదంగం భావలింగంచబసవేత్యక్షరత్రయం ॥౨౨॥పరేచ్చరణపద్మేచదేవితత్తీర్థలక్షణం ॥

తా॥ ఓపార్వతి. జంగమపాద దక్షిణాంగుష్ఠాభిషేకము చేయు నదియది యిష్టలింగస్థలము పాత్రోదకధారయందు షడక్షరియారుమారులు. వామాంగుష్ఠమజ్జనచేయుతరి యది ప్రాణలింగస్థలము పంచాక్షరి యైదుమారులు- పాదద్వయము మధ్యమందునది భావలింగస్థలము త్రయాక్షరి మూడుమారులు పఠించవలయు నదే పాదతీర్థ లక్షణము,

శ్లో॥ పతంతిబిందవఃపాదాద్ద్రవమంగవిలేపనం । పునఃపాదార్చనం కృత్వాలిఖేన్నిర్ణరంజనం । చుళుకోదకభూత్యాచ పుష్పమేకం సమర్పయేత్ ॥౨౪॥ పునఃపునఃప్రణామంతు నిర్మాల్యంచపరిత్యజేత్॥

తా॥ పాదములవల్లతీర్థబిందువులు జారుచున్న వేనియాద్రవము శరీరలేపనచేసి తిరిగిపాదార్చనచేసి నిరంజన ప్రణవము । హ్రాం । వ్రాయవలయు. చుళుకోదకభస్మము చేత నొకపుష్పము నర్పించవలసినది మళ్లీ మళ్లీ నమస్కారము చేయుచు నిర్మాల్యము తియ్యవలయును,

శ్లో॥ చరపాదాబ్జతీర్థంచ లింగమజ్జనముత్తమం॥౨౫॥అంగుళీభ్యాంపంచధారానామికాగ్రగతాతథా। ప్రాణేష్టభావలింగంహిసంస్నాప్యశివమంత్రతః। పంచాంగుళిశిఖాగ్రైశ్చస్నాపయేద్యప్రమాదతః । గురుపాదోదకందేవి లింగతీర్థమథత్రయం॥వామహస్తే స్థితంలింగంస్నాప్యంచరపదాంభసా । లింగస్నానోదకంపీత్వా లింగపాదోదకంభవేత్॥పాదాంబుపాత్రముధృత్వాపీత్వాతత్రివినిక్షిపేత్ లింగానసంతపాదస్పృష్ట్వా చరపాదోదకంభవేత్॥౨౯॥



తా॥ ఓపార్వతిజంగమపాదతీర్థమునుశు. లింగాభిషేకము శ్రేష్ఠ

ము- పంచాంగుళీముల కలనపంచధార యను నామికాగ్రమునుండి శివమం త్రమువలన- ఇష్టప్రాణభావలింగములను మూడు మారులభిషేకము చేసి జాగ్రతగా పంచాంగుళాగ్రములచే జిహ్వస్వీకారము చేయవలయును గురుపాదోదకము మరియు లింగతీర్థము వినిమా వామహస్తమందు న్న లింగమునువర పాదోదకముచేత స్నానము చేసి స్నానోదకము పుచ్చు కొనునది లింగపాదోదకము- పాదోదక పాత్ర వెత్తి పుచ్చుకొని యుంచవలయు చి యపుడు లింగముఖము వీక్షించుట యుచర పాదోదకము.

శ్లో॥ పూజ్యపూజక యోరస్మిన్నేకత్వ ప్రతిపాదతః । పూజ్యోప్యూర్వే విస్వీకృత్య పూజకోపితతః పరం ॥

తా॥ దీనియందు పూజ్యపూజకులకే కత్వము ప్రతిపాదింపబడిన గాని పూజ్యుడగున గురుమూర్తిముందు స్వీకరించి తరువాత పూజకు డయిన శిష్యుడు స్వీకరించ వలయును.

శ్లో॥ చరస్య పాదతీర్థంచ స్వలింగస్య సమర్పణం । దక్షిణాహస్త సూత్రేణ స్వీకుర్యాత్సావధానతః । పాదాంబుపాత్రము ధృ త్వాపి త్వాతత్ర వినిక్షిపేత్॥

తా॥ జంగముయొక్క పాదతీర్థమును తనలింగమున కర్పించి ద క్షిణహస్త సూత్రముచేత సావధానము వలన తాను స్వీకరించవలయు పిమ్మ ట పాత్రవెత్తిపుచ్చుకొని యుంచవలయును-

శ్లో॥ పాదోదకం వినాతీర్థం యః కరోతి సరాధమః॥౩౭॥ సోయందో షేణ మూర్ఖశ్చ సభవబ్రహ్మఘాతకః । పాదప్రక్షాళోదకేన గృహశుద్ధిం సమాచరేత్ । గురుపాదోదకంచైవ సామాన్యాఅపి మానవాః । లింగాభిషేకస్వీకార యోగ్యం చేతివినిశ్చితం । మంత్ర పూతక్రియాతీర్థం క్రిముస్తో యోగ్యతీత్యః॥

తా॥ ఎవరాధముండు పాదోదకము వినాతీర్థము చేయుచున్నా డో వాడిదోషముచేత మూర్ఖుండు బ్రహ్మఘాతకుండనబడును పాదప్ర క్షాళోదకముచే గృహశుద్ధి చేయవలయు. గురుపాదోదకమున్ను సామాన్యు మానవుల లింగాభిషేక స్వీకారయోగ్యమని నిశ్చయమైనది మంత్రపూత

యాతీర్థ ముగ్ను క్రియస్థునికియోగ్యమనిన్ని [గురువద్దగురు పుత్రేపివర్తిత స్యమితిన్పుటం] అనిప్రమాణము.

శ్లో॥ పాదోదక ద్వయంచైవ క్రమేణపరికీర్తితం । క్రియాపాదోదకం చైకంసాధారణమితక్రమాత్ । గురుపాదోద్భవంతీర్థంగురులింగెసమర్పితం। గురుజిహ్వాస్వాదనేనక్రియా తీర్థమితిస్మృతం । భక్త్యాగురుపదాంగుష్ఠౌ సమభ్యర్చ యథావిధి । తదంగుష్ఠోద్భవంతీర్థం సాధారణమితిస్మృతం । సర్వేషాం వీరశైవానాం క్రియామార్గ ప్రవర్తినాం । క్రియాతీర్థం పరిగ్రాహ్యం క్రియాపూర్ణమితిస్మృతం । శైవానామితరే షాంతులౌకికానుప్రవర్తినాం । గురుపాదోద్భవంతీర్థం సర్వేషాం సమ్మతంభవేత్॥

తా॥ పాదోదకము రెండువిధములని క్రమంగా కీర్తించబడినది క్రియాపాదోదకమనిన్ని సాధారణమనిన్ని- గురుపాదోద్భవ [illegible]తీర్థముగురువిష్టలింగమందు సమర్పించ బడినటువంటి గురుజిహ్వాస్వాదనముచే క్రియాతీర్థమని తెలియువలయు భక్తి చేతగురు పాదాంగుష్ఠములను విధిప్రకారము పూజించినటువంటి యాఅంగుష్ఠతీర్థము సాధారణమని తెలియవలయు సమస్తవీరశైవ క్రియామార్గ ప్రవర్తకులైన వారికి క్రియాతీర్థముతీసుకొదగును క్రియాపూర్ణమని దలసబడినది శివభక్తులైన నితరలౌకికాను ప్రవర్తకులగువారికిగురుపాదోద్భవతీర్థము సర్వజనులకుసమ్మతమాచున్నది.

శ్లో॥ చరపాదోద్భవం తీర్థం గురులింగచరాస్వితం॥౩౯॥ త్రిధోదకమితిప్రోక్తం పంచాంగుళిపరిగ్రహం । స్పర్శోదకం చతుర్థంచస్వేష్టలింగేసమర్పణం ॥౪౦॥ పంచమం అవధానంచజిహ్వాస్వీకారమేవచ । షష్ఠమాప్యాయనం చైవలింగము ధృత్యపియ్యతె । హస్తోదకమితిజ్ఞేయం సప్తమఃపరికీర్తితః । పరిణామోష్టమాఖ్యాతం స్పర్శమాత్రసమర్పితం । నవమంపాత్రము ధృత్యానిర్నామమితిగీయతే దశమంఖండితం చైవసత్యోదక మితిస్మృతం । ఏవందశవిధం జ్ఞేయంపాదోదక సలక్షణం ॥౪౧॥

తా॥ జంగమపాదస్థానత్రయంబునోత్పన్నంబైన తీర్థముగురులింగజంగమ త్రివిధోదకమని చెప్పబడినది, పంచాంగుళముల స్పర్శించునునాలగవస్పర్శనోదకము తనయిష్టలింగమందు మూడుమారులువడ్డించునదిమైదవయవధానోదకము- పంచాంగుళములు జిహ్వాస్వీకారముచేయునది యారవయాప్యాయనోదకము- లింగమెత్తిపుచ్చుకొనునది యేడవహస్తోదకము- తీర్థముస్పర్శమాత్రముచేయునది యెనమిదవ పరిణామోకము- పాత్రమెత్తిపుచ్చుకొనునది తొమ్మిదవనిర్నామోదకము-తీర్థముమ్రింగునది పదియవసత్యోదకము ఈప్రకారము దశవిధపాదోదకలక్షణము తెలియవలయు నవలింగార్పితమనియూహించవలసినది.

శ్లో॥ ఉచ్ఛిష్టంకల్పయేత్తస్మిన్ సోయాతినరకార్ణవం। గంగాఇవపవిత్రంతు నిత్యకైవల్యనాయకం ॥

తా॥ ఎవ్వడి తీర్థమందు చ్ఛిష్టమకల్పించుచున్నాడో వాడునరకార్ణవము బొందుచున్నాడు గంగవలె పవిత్రమైనదిశాశ్వతకైవల్యమిచ్చునది.

## —॥ ప్రసాదవిధిః ॥—

శ్లో॥ పూతోదకేనసంక్షాళ్య భాజనేపంచబీజకం। మూలాక్షరసమాయుక్తంవిన్యసేద్ద్రవ్యశుద్ధయే ॥౧॥

తా॥ క్రిమోదకముచే కడిగినటువంటి భోజనపాత్రయందుపంచాక్షరములు మూలప్రణవముతో గూడద్రవ్య శుద్ధికొరకు వ్రాయవలయును

శ్లో॥ ప్రథమంగురుపాత్రేచ యథాధర్మానుసారతః। పదార్థానిసమాక్షిప్యతథైవశిష్యభాజనే ॥౨॥

తా॥ మొదలుగురుపాత్రయందుక్రియానుసారముగాపదార్థములువడ్డించినట్లాగశిష్యునియొక్క పాత్రయందువడ్డించవలయు-

శ్లో॥ హస్తేనభస్మలేపేనచరపాదస్యవందనం। తత్ప్రాణంసంగృహీత్వాతుస్వస్యహస్తేచశాగ్రణికి॥౩॥అంగుళీషుపంచబీజం మధ్యేప్రణవబీజకం। భస్మనాప్రతిశాఖాయాం సంస్థాప్యాత్థసముద్రయా ॥౪॥ప్రసాదప్రచవర్ణం చదశబీజసమన్వితం। హస్తపరుషంప్రదద్యా

త్వాణిమధ్యేప్రసాదినః ॥౫॥

తా॥ శిష్యుండు భస్మలేపన మైనటువంటిదక్షిణ హస్తముచేత సాష్టాంగనమస్కారము చేయను, గురువరుండు నాహస్తము తీసుకొని తనకరమందు పంచాంగుళములయందు పంచవర్ణములు మధ్యమందు ప్రణవము భస్మముచె ప్రతిప్రేలు యందు సంస్కరించి తరువాత గోదోహన ముద్రతో ప్రసాద పంచాక్షరి దశబీజములు గూడుకొన్న దానిని ప్రసాదియొక్క పాణిమధ్యమందు పరుషము నివ్వవలయును.

శ్లో॥ పరుషంచ పరిగృహ్యాంచర లింగేసమర్పయేత్ । పతాకముద్రయాసర్వాంస్స్పృశన్ప్రతిపదార్థకం । షడ్రసాన్ లింగషట్కానాంత్రివిధార్పణరూపకః॥

తా॥ శిష్యుండు హస్తపరుషము తీసుకొని పతాకముద్ర చేతసమస్త పదార్థములుస్స్పృశించుచు షడ్లింగ ములకు షడ్రసములను ఇష్టప్రాణ భావత్రివిధార్పణ రూపముగా జంగమ లింగమందు సమర్పించవలయు

శ్లో॥ గురుశేషప్రసాదార్థం దృష్ట్వామంత్రస్సమన్వితః ॥౬॥ త్రిధార్పణం సమాకృత్వాప్రదేయంతుకణత్రయం ॥

తా॥ గురుమూర్తి యైయునటువంటివాడు ప్రసాదార్థి నిజాచి మంత్రయుతముగా ఇష్టప్రాణభావ త్రివిధార్పణము చేసికణత్రయప్రసాదము నివ్వవలసినది.

శ్లో॥ గురోశ్శేషంకృపాదత్తం ప్రసాదంచ కణత్రయం ॥౭॥ తంగృహ్ణీయాత్స్వయంశిష్యోఘోరసంసారతారకం । స్వేష్టలింగార్పితం కృత్వానుభుంజీయాన్నసంశయః ॥౮॥

తా॥ నిజశిష్యుండైన వాడుభయంకరమగునట్టి సంసారము నుతరింపజేయు నటువంటి గురువుయొక్క కృపవలన నివ్వబడిన శేషప్రసాదకణత్రయమును తీసుకొనవలయును సందేహములేక తనఇష్టలింగార్పితము జేసిసుఖంగ భుంజించవలయును.

శ్లో॥ గురుభుక్తశేషం గురుదత్తం గురుపాదజలేష ॥ త్రివిధంత్రిమేణ ।గురుప్రసాదంచపరమంతద్దైవముముక్షూణాం గేయమధోహార్ద

పూర్వకం ॥౯॥

తా॥ గురుభుక్తశేషము, గురుపాణిదత్తము, గురుభాండశేషము క్రమంగా మూడువిధములు పరమప్రసాదమును, అట్లాగె యోగ్యతపూర్వకము మోక్షార్థులకు నివ్వవలసినది.

శ్లో॥ కీటకభ్రమరన్యాయాద్గురోర్గౌరత్వ మాప్తవాన్ । తస్యైవ భుక్తశేషంతు ప్రసాదం దాతుమర్హకం ॥౧౦॥

తా॥ కీటకము భ్రమరధర్మము వలనభ్రమరత్వ మొందునా ( అట్లాగె) గురువుయొక్క గౌరత్వముపొందినవాడయినవానికిభుక్తశేష ప్రసాదమునివ్వుటకుయోగ్యమైనది.

శ్లో॥ లింగమంత్రోపదేశాభ్యాం యోగురౌభక్తితత్పరః । గురుహస్తార్పితం తస్య ప్రసాదం దాతుమర్హకం ॥౧౧॥

తా॥ ఎవ్వడులింగమంత్రోపదేశములవలనగురువుయందుభక్తితత్పరుడైయున్నవాడోవానికిగురుహస్తార్పితప్రసాదమునివ్వుటకుయోగ్యము.

శ్లో॥ లింగమంత్రోపదేశాభ్యాం శిష్యత్వేనైకవర్తినః। గురుభాండప్రసాదంతుతస్యైవదాతుమర్హకం ॥౧౨॥

తా॥ లింగమంత్రోపదేశములచేత ( గురువుయందు) నొకశిష్యత్వముచేవర్తించుచున్నట్టువంటి వానికి గురు భాండప్రసాదమునివ్వుటకుయోగ్యము.

శ్లో॥ గురోశ్శేషంప్రభుంజీయాత్సామరస్యక్రియాత్మనః । గురౌభక్తిరతస్యైవగురుహస్తార్పితంశుభం ॥౧౩॥ శిష్యత్వేసుస్థిరస్యైవభాండస్థం దాతుమర్హకం । ఏషుత్రివిధశిష్యేషుప్రదేయంత్రివిధంక్రమాత్ । నిష్ఫలంప్రత్యవాయశ్చ తేషాంవిసీతివర్తినాం । తారతమ్యవిరోధేనప్రసాదముభయోరపి ॥౧౪॥

తా॥ గురువుయొక్క సామరస్యాత్మకుండగుశిష్యునికి గురువుభుజించగామిగిలిన ప్రసాదము భుంజించతగును, గురువుయందు భక్త్యాసక్తుడైన శిష్యునికి గురుహస్తము నుండియివ్వబడినశుభ ప్రసాదము భుంజించతగును, శిష్యత్వమందు స్థిరుడయిన శిష్యునికి గురుభాండ స్థమునివ్వ

నుయోగ్యము నీతివిధులయందు క్రమముగా త్రివిధప్రసాదము నివ్వవ
యును విపరీత వర్తులైనటువంటి వారికి యుభయులయొక్క తారతమ్య
బోధముతో ప్రసాద మివ్వడము నిష్ఫలము ప్రత్యవాయమునన్ను.

శ్లో॥ భుంజీయాత్పర్గురోః పఙ్త్యాంనభుంజీయాత్సమానతః । ప్రమా
దాద్యదివాభుఙ్క్తేసఏవగురుపాతకీ ॥౧౬॥ గురుభుక్తోత్తరంభోక్తుంశి
ష్యస్యశ్రేష్ఠమంభవేత్ । గురుసింహాసనోపాంతేనైకకాలేతుమధ్య
మం ॥౧౭॥ గురోస్సామ్యంతుయద్భుక్తమధమంపాతకంభవేత్ ।
గురుభుక్తేశిష్యాశిష్యా భుక్తిఃక్రాపినశ్రుతం ॥౧౮॥

తా॥ గురువుపఙ్త్తియందు భుజించ వలసినది గురువుతో సమానము
భుజించకూడదు, మరుపు వలనభుజించెనేని వాడుగురు పాతకుండు, గురు
భుజించిన తరువాత భుజించుట శిష్యునికి ముఖ్యమౌను, గురుసింహాసన
సమీపముతో నొక సమయమే భుజించుట మధ్యమము, గురువుయొక్క
సమానము భుజించుట యధమము పాతకమౌను గురుభుక్తికంటెముం
దుశిష్యుండు భుజించునా యెక్కడనైన వినలేదు.

శ్లో॥ ప్రథమంహస్తపరుషం శుద్ధంగురుప్రసాదకం । ద్వితీయమిష్టనై
వేద్యంసిద్ధంలింగప్రసాదకం ॥౧౯॥ తృతీయంజిహ్వాసుస్వీకృత్యప్రసిద్ధం
చరముచ్యతే। చతుర్థంగురుణాదాన మాప్యాయనమితిస్మృతం
పంచమంనిక్షేపేత్వా త్రేప్రసాదంసమయంవిదుః । షష్ఠంచరసనా
స్వాదంత్విండ్రియాణాంవిహీనకం । సప్తమంసహభుక్తంచ అంతఃక
రణహీనకం। అష్టమంభక్షణంచైవప్రసాదిశ్చప్రసాదకం । నవమం
భోజ్యవిజ్ఞేయం సద్భావమితిగీయతే । దశమంతేహ్యాతత్వాత్రం
చిత్కళేతివిధీయతే ॥౨౩॥ ఏకాదశమితిప్రోక్తం తృప్తిర్జ్ఞానంసము
చ్యతే । ఏతానిచప్రసాదానిజ్ఞాత్వాలింగేసమర్పయేత్ ॥౨౪॥

తా॥ మొదలు హస్తపరుషమైన శుద్ధము గురుప్రసాదము, రెండ
వదిఇష్టలింగ నివేదనమైన సిద్ధము లింగప్రసాదము,మూడవదిజిహ్వాస్వీకా
రమైనప్రసిద్ధము చరప్రసాదము, నాలగవదిగురువుచే ననుగ్రహింపబ
డినయాప్యాయన ప్రసాదము, ఐదవ పాత్రయందు డినసమయ ప్రసాదము

ఆరవజిహ్వా స్వాదనమైన ఇంద్రియ విహీన ప్రసాదము, ఏడవసపర్య
జనమగు అంతఃకరణ విహీనప్రసాదము, ఎనిమిదవ భక్షించిన ప్రసా
ప్రసాదము, తొమ్మిదవ చోష్యమయిన సద్భావ ప్రసాదము, పదియవ
పాత్రిలేహ్యమైనచిత్కళల ప్రసాదము పదకొండవతృప్తియైనజ్ఞానప్రసా
దము నీయేకాదశ ప్రసాదముల నెరింగి లింగమందు సమర్పించవలయు
నునవలింగాను భవసంజ్ఞ.

—※ మిశ్రార్పణః ※—

శ్లో॥ ఆచారస్యముఖంఘ్రాణం ముఖంజిహ్వాగురోస్తథా । శివలింగము
ఖంనేత్రంజంగమస్యత్వగాననం ॥౧॥ శ్రోత్రంముఖం ప్రసాదస్యమ
హాదాస్యంహృదిస్మృతః ॥

తా॥ ఆచార లింగముఖము నాసికము, గురులింగ ముఖముజిహ్వ
శివలింగ ముఖము నేత్రము, చరలింగ ముఖముత్వక్, ప్రసాదలింగ ము
ఖము శ్రోత్రము, మహాలింగ ముఖము హృదయమని తెలియవలయు.

శ్లో॥ గంధమాచారలింగస్యగురులింగేతథారసం ॥౨॥ శివలింగార్పితం
రూపంస్పర్శంతుచరలింగకే । శబ్దంప్రసాదలింగస్యతృప్తిర్లిం
గంమహాత్తథా ॥౩॥ ఏవంలింగార్పితం జ్ఞాత్వాతత్ప్రసాదభవే
త్తతః ॥

తా॥ ఆచారలింగమునకు గంధము, గురులింగమందు రసము,శివ
లింగార్పితము రూపము, చరలింగమందు స్పర్శ, ప్రసాద లింగమునకు
శబ్దము, మహాలింగమునకు తృప్తియీప్రకారము లింగార్పితము నెరుగు
నేనియుదేభావము ప్రసాదియౌను.

శ్లో॥ అథవక్ష్యేసంగ్రహేణమిశ్రార్పణవిధింక్రమాత్ । భోజ్యమా
చారలింగస్యపానీయం గురులింగకే। భక్షణంశివలింగస్యచోష్యం
జంగమలింగకే ॥౪॥లేహ్యంప్రసాదలింగేచ సర్వంతృప్తిమహాత్మని।

తా॥ మరియు మిశ్రార్పణ విధినిసంక్షిప్తముచే క్రమముగలనె
ప్పెదను నమలదగిన పదార్థమా చారలింగమునకు త్రాగేపదా
ర్థము గురులింగ మందు కొరికెడుపదార్థము శివలింగమునకు, జుర్రెడు

ర్ధాఘ్రాణము చరలింగమందు, నాకెపదార్థఘ్రాణము ప్రసాదలింగమందుసర్వ తృప్తిమహాలింగమని తెలియువలయును.

శ్లో॥ అథ వక్ష్యే మిశ్రభేద మాచారాదిష్వనుక్రమాత్ ॥ ౬ ॥
ఆచారలింగేహ్యాచారప్రభృతీనివ దామ్యహం । మూలకందాదిగం ధస్యహ్యాచారేచసమర్పణం ॥౭॥ వృక్షత్వచాదిగం ధస్యవిషయం గురులింగకే। పల్లవాదిసుగం ధస్యజ్ఞానంశైవలింగకే ॥౮॥ కుట్మలాదిపుష్పగంధం చరలింగేసమన్వితం । ఫలప్రభృతిగం ధస్యప్రసాదాభిధలింగకే ॥౯॥ సర్వగంధసమాగ్రాహీ మహాలింగేతివిశ్రుతం॥

తా॥ ఇంకామిశ్రభేద మాచారాది లింగముల యందను క్రమంగాచారలింగ మందాచార లింగము మొదలైనవిచెప్పుచున్నాను వేరుగడ్డ మొదలగు గంధముయొక్క సమర్పణ మాచారలింగమందు, చక్కమొదలగుగంధముయొక్క విషయము గురులింగమందు, చిగురుమొదలగుగంధముయొక్క తెలివిశివలింగ మందు, మొగ్గమొదలగు పుష్పగంధముచర లింగమందు, సర్వగంధములు మహాలింగము గ్రహించునని ప్రసిద్ధము॥

శ్లో॥ ఆచారలింగంజానాతిమధురం తుకషాయకం । గురులింగంకటుం వేత్తిశివలింగంతథామ్లకం ॥ ౹జానాతిజంగమంలింగం తిక్తంవేత్తి ప్రసాదకం ॥౧౧॥లవణంహివిజానాతి మహాలింగమితిశ్రుతిః ॥

తా॥ గురులింగమిశ్రమందు మధురమాచార లింగమె రుంగుచున్న, దివగరు గురులింగము, కారముశివలింగము పులుసుజంగమలింగను చేదుప్రసాదలింగము. లవణము మహ లింగమెరుంగుచున్న దనిశ్రుతిప్రమాణము.

శ్లో॥ అథసంప్రోచ్యతే సమ్యక్ శివలింగస్యమిశ్రణం ॥౧౨॥ ఆచారలింగేసుజ్ఞానిపీతరూపం సమర్పయేత్ । గురులింగేశ్వేతరూపం హరిమూర్తింశివాత్మకే । రక్తరూపం జంగమేథకపోతాఖ్యం ప్రసాదకే । తత్సర్వంమహతీప్రోక్తం సర్వవేదాంతసమ్మతం ॥౧౪॥

తా॥ ఇకశివ లింగమిశ్రము లెస్సచెప్ప బడుచున్నదియాచారలింగమందు పీతరూపము- గురులింగమందు శ్వేతరూపము, శివలింగమందు

అనుపచ్చరూపము- చరలింగమందు రక్తరూపము, ప్రసాదలింగమందుశ్వేతరూపము, మహాలింగమందు నవియన్నిరూపములని వేదాంతసమ్మతము చేప్పబడినది.

శ్లో॥ అతఃపరంప్రవక్ష్యామి చరలింగస్యమిశ్రణం । అచారంకఠినంవేత్తిమృదుస్పర్శనం గురుస్తథా। ఉష్ణస్పర్శంశివావేత్తిశీతస్పర్శనం చరస్తథా । మిశ్రస్పర్శనం ప్రసాదస్తుసర్వజ్ఞానంమహాత్మని ॥౧౬॥

తా॥ ఇంకాచరలింగమిశ్రమము చేప్పచున్నాను ఆచారలింగముకఠినస్పర్శ మెరుంగుచున్నది, గురులింగమువృదుస్పర్శ- శివలింగమూష్ణస్పర్శ- చరలింగముశీతస్పర్శ- ప్రసాదలింగము మిశ్రస్పర్శ- మహాలింగముసర్వస్పర్శ లెరుంగును.

శ్లో॥ తదేవక్రమశోవచ్మి ప్రసాదస్యవిమిశ్రణం । ఆచారలింగేలతాదిజన్యవాదంసమర్పయేత్ ॥౧౭॥ తంత్రీజన్యంగురౌలింగె శివెలగుడిసంభవం । చరెవంశాదిసంభూతం ప్రసాదెగీతజాదికం ॥౧౮॥ తత్సర్వంతుమహాలింగె యోజయేత్సంవిదాబుధః ॥

తా॥ అట్లాగె ప్రసాదలింగమిశ్రమముక్రమములుగాచెప్పచున్నానులతాదిజన్యవాదమాచార లింగమందు, వీణాతంత్రినాదము గురులింగమందు, దండజన్య నాదము శివలింగమందు,పిల్లంగ్రోవినాదము చరలింగమందు గీతాదినాదము ప్రసాదలింగమందు నవియన్నియు మహాలింగమందు

## —❋ త్రివిధార్చనం ❋—

శ్లో॥ ఏకఏవశివస్సాక్షాత్సర్వానుగ్రహకారకః । గురుజంగమలింగాత్మావర్తతేభుక్తిముక్తిదః ॥౧॥

తా॥ సాక్షాదాకార్యైనటువంటి పరశివుండు సమస్తులకనుగ్రహము చేయువాడు భోగమోక్షము (లిచ్చుటకు) గురులింగజంగములయొకట-యాత్మయందుండియున్నాడు.

శ్లో॥ లలాటలోచనంచాంద్రీ కళామపిచదోర్ద్వయం । అంతర్నిధాయవ లైకహాంగు[illegible] వ్వార ॥౨॥

తా॥ ఓపార్వతి నేనునిటల నేత్రమును చంద్రకళను భుజద్వయము ను లోనుంచి గురురూపము వహించియున్నాను.

శ్లో॥ సర్వేషామపిలోకానాం భోగమోక్షాయ కేవలం। పూజితంసర్వకాలంతు లింగరూపోస్మిశాంకరి ॥౩॥

తా॥ ఓపార్వతి కేవలము సమస్తలోకములయొక్క భోగమోక్షము కొరకు యావన్నాళ్లను పూజింపబడిన లింగరూపమాయున్నాను.

శ్లో॥ దేహజీవేశతత్వార్థ బోధాయైముక్తిరిచ్ఛతి। స్వస్వరూపోపదేశార్థం జంగమోస్మిమహేశ్వరి ॥౪॥

తా॥ ఓపార్వతీయెవ్వడు దేహజీవేశ్వరతత్వార్థబోధయనేముక్తికోరుచున్నాడో తనస్వరూపోపదేశముకొరకుజంగమరూపమాయున్నాను.

శ్లో॥ గురుమారాధయేన్నిత్యం గురుపాదోదకంపిబేత్। గురుప్రసాదం భుంజీయాద్గురుభక్తస్యలక్షణం ॥౫॥

తా॥ నిత్యముగురువును పూజించవలయును గురుపాదోదకముపుచ్చుకొనవలయు గురుప్రసాదము భుంజించవలయు గురుభక్తునియొక్క లక్షణము.

శ్లో॥ లింగమారాధయేన్నిత్యం లింగపాదోదకంపిబేత్। లింగప్రసాదం భుంజీయాల్లింగభక్తస్యలక్షణం ॥౬॥

తా॥ అనుదినము లింగమునుపూజించవలయును లింగపాదోదకముపుచ్చుకొనవలయు లింగప్రసాదము భుంజించవలయు లింగభక్తునియొక్క లక్షణము.

శ్లో॥ చరమారాధయేన్నిత్యం చరపాదోదకంపిబేత్। చరప్రసాదం భుంజీయాచ్చరభక్తస్యలక్షణం ॥౭॥

తా॥ ప్రతిదినముజంగమును పూజించవలయును జంగమపాదోదకముపుచ్చుకొవలయు జంగమప్రసాదము భుజించవలయు జంగమభక్తునియొక్క లక్షణము.

శ్లో॥ అష్టవిధార్చనంకుర్యాదిష్టలింగస్య పూజనం। తల్లింగమనుతే

యస్తు ప్రాణలింగస్య పూజనం ॥౮॥ మనోలయం నిరంజన్యే భావలింగస్య పూజనం । ఏవం లింగార్చనాభేదం త్రివిధం శృణు పార్వతీ ॥ ౯ ॥

తా॥ ఓపార్వతి యెవ్వడిష్టలింగము నష్టవిధముల నర్చించునో (అది) ఇష్టలింగము యొక్క పూజయు, అయిష్టలింగార్చన మనమున తెలియుచున్నాడో (అది) ప్రాణలింగము యొక్క పూజయు, నిరంజన వస్తువుయందు మనస్సు నశించునో (అది) భావలింగము యొక్క పూజయు నీరీతి లింగార్చన భేదము మూడువిధములు వినుము.

శ్లో॥ అర్చయేద్గంధపుష్పాద్యైః కరపీఠే సమాహితః। నిత్యాని కర్మబృందాని తథా నైమిత్తికానిచ ॥౧౦॥ శివార్పణధియా కుర్యాత్స్వజ్ఞానాభివృద్ధయే॥

తా॥ ఇష్టలింగము సావధానము వలన కరపీఠమందు గంధపుష్పాదుల చే పూజించుచు లెస్సజ్ఞానవృద్ధికొరకు శివార్పణ బుద్ధితో నిత్యక్రియలు నైమిత్తికక్రియలు చేయవలయును.

శ్లో॥ ఆధారే కనకప్రఖ్యం హృదయే విద్రుమప్రభం । భ్రూమధ్యే స్ఫటికచ్ఛాయం లింగం యోగీ విభావయేత్ । మూలాధారేథవా హృది భ్రూమధ్యే వాసునిర్మలం ॥౧౧॥ దివ్యాకాశే యజేల్లింగం భావద్రవ్యైస్స యోగవాన్॥

తా॥ లింగాంగ సామరస్యుండగు వాడు నాధార చక్రమందు బంగారువర్ణము గాను హృదయమందు పగడము కాంతియుగాను భ్రూమధ్యమందు స్ఫటికవర్ణము గాను లింగమును భావించవలయు (చూడవలయు) విషయరహిత సద్భావ పదార్థములచేత నాధారమందైన హృదయమందైన భ్రూమధ్యమందైన ప్రాణలింగమును పూజించవలయువారే సామరస్యుండు.

సమాధినిష్ఠా.

శ్లో॥ నాసికాగ్రానుసంధానలింగన్యస్తనిరీక్షణాత్। యస్సర్వం విస్మరేత్ యాతి ఇష్టలింగ సమాధిమాన్ ॥౧౨॥

తా॥ ఎవ్వనిదృష్టి ముకురము తుదజేరిన లింగమందుంచిన చూపువలన సమస్తమును మఱుపుజెందుచున్నాఁడో వాఁడే యిష్టలింగనిష్ఠవంతుఁడు.

శ్లో॥ దేహప్రాణేంద్రియాదీనాం వ్యాపారైవిస్మృతింగతః। లింగాయ స్యమనోలీనం ఇష్టలింగసమాధిమాక్ ॥౩॥.

తా॥ ఎవ్వనియొక్క మనుస్సు దేహప్రాణేంద్రియాదులయొక్క చర్యయందు మఱుపుజెంది లింగమందైక్యమాచున్నదో వాఁడే యిష్టలింగనిష్ఠవంతుఁడు.

శ్లో॥ అంతష్షడ్చక్రరూఢాని పంకజాని విభావయేత్ । బ్రహ్మాదిస్థానభూతాని భ్రూమధ్యాంతాని మూలతః ॥౯॥ భ్రూమధ్యాదూర్ధ్వభాగేతు సహస్రదళమంబుజం। భావయేత్తత్ర విమలం చంద్రబింబాంతదంతరే ॥౧౦॥ సూక్ష్మరంధ్రం విజానీ యాత్తత్కైలాసపదంవిదుః । తత్రస్థం భావయేచ్ఛంభుం సర్వకారణకారణం ॥౧౧॥.

తా॥ దేహాంతరము నాధారాది మొదలుకొని భ్రూమధ్యాంతము వరకు షడ్చక్రములగలిగినటువంటి కమలముల తెలియవలయు భ్రూమధ్యముకంటె పైభాగమందు సహస్రదళకమలము నెరుంగవలయు నచటచంద్రబింబము దానిలో సూక్ష్మరంధ్రమును తెలియవలయునదే కైలాసపదమనియందురు యక్కడ నున్నటువంటి (స్వరూపము) సమస్తకారణములకు కారణుఁడైన శివుఁడని భావించవలయును.

శ్లో॥ జ్ఞానినాంయోగయుక్తానాం తస్ఫురతిదీపవత్ । చిదాకారంపరబ్రహ్మలింగమంగేనభావ్యతే ॥౧౨॥

తా॥ జ్ఞానులైనటువంటి యొగయుక్తులకంతరంగమందు దీపమువలె ప్రకాశించుచున్నది చిదాకారమైన పరబ్రహ్మలింగము నాత్మతో తెలియఁబడుచున్నది.

శ్లో॥ నీలతోయదమధ్యస్థం విద్యుల్లేఖేవభాస్వరం । నివారశూకవద్రూపంపీతంభాస్వదణూపమా। తస్యాశ్శిఖాయాః మధ్యేతుపరమాత్మావ్యవస్థితః ।

తా॥ నీలమేఘ మధ్యమందుండు నటువంటి మెరుపుదీగవలెప్రకా

శంబైవళిముల్లుసమాన మణూపమానపచ్చకాంతి గలిగినటువంటి దా
శిఖాయొకట మధ్యమందు పరమాత్మునండుండియున్నా౨డతనినేసదాశివు
డనియందురు,

క్రియాజ్ఞానలక్షణం.

శ్లో॥ క్రియాజ్ఞానద్వయోర్వ్యక్తం విశేషంవీరశైవినాం । అంతర్జ్ఞానం
బహిః కర్మసార్వకాలం సమాచరేత్ ॥౧॥

తా॥ క్రియాజ్ఞానముల రెంటియొకట గూడియుండుట వీరశైవులకు
ముఖ్యముక్రనక। అంతరంగమందుజ్ఞానముబహిరంగమందుక్రియాలనగా
ఆచారము సదాకాలముచేయవలయును.

శ్లో॥ నక్రియారహితం జ్ఞానంనజ్ఞానరహితాక్రియా । అపశ్యన్నంధ
కోదగ్ధః పశ్యన్ పంగుశ్చదహ్యతే ॥౨॥

తా॥ క్రియాలేనిజ్ఞానముకూడదు జ్ఞానములేనిక్రియాకూడదు ।ఎ
ట్లంటె । మెందేనియగ్ని దవిలినచోగుడ్డివాడు జ్ఞానమను కండ్లచెయ్యగ్ని
నిచూడకదహించును కుంటివాడు క్రియాయనెకాళ్లచే దాటకనగ్నిచూ
చుచుదహించును.

శ్లో॥ జ్ఞానంప్రధానం నతుకర్మహీనంకర్మప్రధానంనతుబుద్ధిహీనం।
తస్మాద్ద్వయోరేవభవేత్ప్రసిద్ధిర్నహ్యేకపక్షోవిహగఃప్రయాతి॥౩॥

తా॥ జ్ఞానము శ్రేష్ఠమని క్రియవిడువ కూడదు కర్మము శ్రేష్ఠమ
ని జ్ఞానము విడువకూడదు క్రియాచారముల రెంటికిసమర్థకాము గలిగియు
న్నది యెందువలన పక్షియొక రెక్కతో యెగయ జాలదో అట్లాగె మా
నవుండు నొకదానితో విముక్తుండు కానేరడు.

శ్లో॥ జ్ఞానాచార విహీనేషు సర్వవిద్యా సమన్వితం ॥ దుష్టచండాల
భాండేషు భాగీరథీజలంయథా॥

తా॥ జ్ఞానచార విహీనులయందు సమస్త విద్యలు గలిగియున్నను
దుష్టచండాల భాండములయందున్న భాగీరథి తీర్థము వలెనింద్యము.

శ్లో॥ యథాకుంభజలందేవి తస్యతేవహీనయోగతః । జ్ఞానంబాహ్య
క్రియావేద్యం తత్ప్రాణలింగవేదితం ॥౫॥

తా॥ ఓపార్వతీ యెట్లాగుకడనయుందున్నయుదకము వెలుపలి యగ్నిసంయోగమువలననుష్ణమౌచున్నదో అట్లాగజ్ఞానము వెలుపలియాచారమువలన వేద్యమై యదిప్రాణలింగవేద్యమౌను.

శ్లో॥ బాహ్యక్రియాం తరజ్ఞానం సంయోగంతుభవేద్యది । లింగాంగసామరస్యంచ భవేన్ముక్తిః కరస్థితా ॥౬॥

తా॥ వెలుపలక్రియాలోపలి జ్ఞానము సంయోగమాయెనేనిలింగాంగ సామరస్యమున్ను ముక్తికరస్థితమై యుంటూవున్నవి.

శ్లో॥ క్రియాజ్ఞానవిహీనస్య జంగమాంఘ్రిజలంజడం । తత్ప్రసాదం తదుచ్ఛిష్టం నసేవ్యంతన్ముముక్షుభిః ॥౭॥

తా॥ క్రియాజ్ఞానవిహీనుడైనటువంటి జంగమయొక్క పాదోదకముజడము-అప్రసాద మెంగిలియట్టిది మొక్షార్థులచేత సేవింపబడదు.

శ్లో॥ క్రియాజ్ఞానయుతంచైవ జంగమాంఘ్రిజలంపిబేత్ ।తత్ప్రసాదం ప్రభుంజీయా జ్జీవన్ముక్తిర్లభేన్నరః ॥౮॥

తా॥ మోక్షార్థియయిన పురుషుండు క్రియాజ్ఞాన యుతుడైనటువంటిజంగమ పాదోదకము పుచ్చుకొనవలయును (అట్టి) ప్రసాదము భుజించవలయును జీవన్ముక్తిబొందు చున్నాడు.

సంస్కారప్రకరణ ప్రారంభః.

శ్లో॥ విశుద్ధాః ప్రాకృతాశ్చేతిద్వివిధామాను షాస్మృతాః । శివసంస్కారిణః శుద్ధాః ప్రాకృతాఇతరేమతాః ॥౧॥ వర్ణాశ్రమాదిధర్మాణాం వ్యవస్థాహిద్విధామతా । ఏకాశివేనవిహితా ప్రాబ్రహ్మణాకథితాపరా ॥౨॥ శివధర్మోహికథితః శివాశ్రమ నిషేవిణాం । శివసంస్కారహీనానాం ధర్మఃపైతామహాస్స్మృతః ॥౩॥ అప్రాకృతసదాచారా నుపాదిశదథప్రభుః॥

తా॥ విశుద్ధులు ప్రాకృతులని మానవులు రెండువిధముల దలపబడుచున్నారు శివసంస్కారులు విశుద్ధులు- ఇతరులుప్రాకృతులని చేప్పబడుదురు వర్ణాశ్రమాదిధర్మములల్లో రెండువిధములు వ్యవస్థ లున్నవి

యొకటిశివునిచేతను పదేశింపబడినది రెండవదిబ్రహ్మచే ప్రకటింపబడి నది శివాశ్రములకు శివధర్మము ప్రకటింపబడినది శివసంస్కారహీనుల కు బ్రహ్మధర్మము చెప్పబడినది యనంతరమునిత్యానందస్వరూపుడైన శివుడున ప్రాకృతాచారములను పదేశించెను.

శ్లో॥ వీరశైవస్యగర్భాదిసంస్కారవిధయఃక్రమాత్ ॥౪॥ సమాద్యం తాః ప్రవక్ష్యంతే జ్ఞానయోగానుసారతః॥

తా॥ వీరశైవముయొక్క గర్భాధానాది సంస్కారవిధులు వరు సగాజ్ఞానయోగానుసారముగా నాద్యంతములుచెప్పబడుచున్నవి.

శ్లో॥ సంస్కారదశకం ప్రోక్తాస్సర్వతంత్రేషుగోపితాః ॥౫॥ యాః కృత్వాసం ప్రదాయేన ప్రీణువాంఛితమశ్నుతే॥

తా॥ సమస్తశాస్త్రములయందు పోషింపబడినటువంటి పదిసం స్కారములు చెప్పబడుచున్నవి పరంపరాను క్రమముచేయేవి వారా చరించిన నిష్టకోరికగలుగుచున్నది.

గర్భాధానం

సూ॥ మిశ్రాణాంవర్ణా శ్రమధర్మవతాంనైతానుహాపురాణాద్య దీరితవ్రతనియమోపవాస కామ్యకర్మాణినిత్యకర్మాణిచ । శి వాశ్రమిణాం తుకామ్యఫలాభిసంధిరహితవేదాగమోదితపర మేశ్వరారాధనరూపాణి కర్మాణి ॥౬॥

తా॥ వ్రతనియమోపవాస కామ్యకర్మనిత్య కర్మములు బ్రహ్మ పురాణాదులచేత చెప్పబడిన కర్మములు వర్ణాశ్రమధర్మవంతులైన మిశ్రశైవాదులకుకర్తవ్యము నిగమాగములచేత చెప్పబడిన కామ్యఫ లసంధిరహితమైనశివారాధన రూపమగు జంగమార్చనక్రియ శివా శ్రమనిషేవితులకు కర్తవ్యము.

శ్లో॥ ప్రథమార్తవాత్ప్రభృత్యూర్ధ్వం మాషోడశదినావధిః । యు గ్మస్వోత్తిశ్వాస్త్ర సిద్ధేశోభనేదివసే బుధః ॥౭॥ కుర్వీతగర్భా ధానాఖ్యం సంస్కారమిత్తితద్విదః ॥౮॥ చతుర్దశదివసాదూర్ధ్వం మఘమూలాదివర్జితే ॥౯॥ స్వగృహం ఉపసంలిప్యరంగవల్లింప్రి

ల్పయేక్ । స్వస్తివాచనపూర్వేద్యు స్తథా నాందిసమర్చనం॥౧॥

తా॥ వివాహానంతరమున స్త్రీలు ప్రథమ ఋతువందు ఋతువు మొదలు పదియారు దినముల పర్యంతమవధి- ఋతుమతియైనమూ సమునకైన పురుషసంతాన కారణమగు సరిదినముల జ్యో శాస్త్రప్రసిద్ధిమైనటువంటి దివసమందు గర్భాధానము చేయవలయును గర్భాధానమని యెడు సంస్కారమని యెరుంగుచున్నారు। విశేషవిధి యుక్తమైన నాలుగోదినము పైచమఘమూలాది నక్షత్రములు లేన వంటి శుభదినమందు తనగృహము మిక్కిలి యలంకారముగా యలికి ముగ్గు కల్పించి పూర్వదినము స్వస్తివాచకమనియెడు మాహేశ్వరాశీ ర్వచనము గ్రహించి యట్లాగె నాందియనియెడు మాహేశ్వరారాధన చే సి యుక్తప్రకారము గర్భాధానకార్యము చేయవలయును.

—※ పుంసవనః ※—

మా తృతీయేగర్భమాసే పుంసవనంకార్యం । తృతీయేమాసిగర్భే విజ్ఞాతేచతుర్థేమాసికార్యం । పూర్వేద్యుర్నిత్యకర్మానంతర రంశుద్ధదేశేను ఆసనేపత్న్యాసహప్రాఙ్ముఖము పవిశ్యప్రా ణాయామ్య దేశకాలావనుకీర్త్య స్వస్తివాచనపత్యమాణానాం దీక్షకుర్యాత్ ॥౧॥

తా॥ గర్భమైనమూడవమాసమందు పిండశుద్ధ్యర్థము పుంసవన మాచేయవగ్గు మూడవ మాసమందు తెలియనట్లైతే నాలగవమాసమం దుచేయవలయు పూర్వదినము నిత్యాచారానంతరము పరిశుద్ధప్రదేశము సనాసనమందు భార్యతోకూడ పూర్వముఖముగాకూరుచుండి ప్రాణయా మము చేసి దేశకాలములు కీర్తించి మాహేశ్వరాశీర్వాదానంతరము మాహేశ్వరారాధన చేయవలయునువిహ్మృతి విస్మృతనిత్యాకార్యముచే యవలసినది.

—※ సీమంతం ※—

మా॥ చతుర్థేవామాసిసీమంతోన్నయనం తత్రగర్భేవిజ్ఞాతే షష్ఠాష్టమే వాకార్యం। శుక్లపక్షే ప్రసన్నగ్రహకార్యం । పూర్వస్మిన్ప్రదేశే ప్రవ

హస్తపునర్వసూఅభిజిచ్ఛ్రోప్రోష్ఠపాదేచ అనూరాధాతథాఽశ్వినీ। ఏషునక్షత్రేషుమధ్యపాదద్వయేషుకర్మకుర్యాత్ । గృహం పూర్వవదలంకృత్యస్వస్తివాచనం నాందీవక్ష్యమాణప్రకారేణకుర్యాత్

తా॥ నాలగవమాసమందు (అభివ్యక్తిశ్చ జీవస్య చతుర్థేమాసి జాయతే, అనిచేతనసిద్ధ్యర్థము) సీమంతసంస్కారము చేయదగును. గర్భనిశ్చయము తెలియనట్టయితే ఆరవనెల యెనిమిదవ నెలనైన చేయవలయును శుక్లపక్షము పుంనక్షత్రమందు చేయవలసినది, శ్రవణ, హస్త, పునర్వసూ, అభిజిత్, పూర్వాభాద్రా సర్వపాదములయందు అనూరాధ, అశ్విని యీనక్షత్రములయందు నడిమిరెండుపాదముయందు పూర్వవతేగృహమలంకరించి స్వస్తివాచననాంది యుక్తప్రకారము చేసిన ప్రకారము సీమంతము చేయవలయును.

## —※ జన్మలింగధారణ ※—

శ్లో॥ స్వగృహేగర్భిణీజాతాభార్యా పుత్రీతథానుజా । తాసామాచార్యముఖ్యశ్చమంత్రోక్త విధినాతతః ॥౧౩॥ కుక్షౌభస్మాంచితంకృత్వారేఖాత్రితయసంయుతం । త్రిమాసేపిచషణ్మాసేనవమాసేతథైవచ ॥౧౪॥ శిశోఽదయేతథాలింగం బధ్వానాళంసుఛేదయేత్

తా॥ లింగాంగుండు తనయొక్క గృహమందుభార్యాకూతురులు గర్భవతియైనా గురువరుండుమంత్రోక్తవిధిచేత మూడవనెలనైన ఆరవనెలయందైనతొమ్మిదవనెలయందైన గర్భిణులయొక్క కడుపుయందుభస్మముచే మూడురేఖలుగూడినదానిగా చేసి పూజించి యట్లాగె శిశోదయమందు లింగము కట్టినాళముల (నగాబొడ్డు) ఛేదించవలసినది.

శ్లో॥ వీరశైవస్థితానాంచ స్త్రీణాంగర్భాష్టమేగురుః ।౧౫॥ పంచమాసే కృతంలింగంధారయేద్విధివచ్ఛుభం । అథోఽదయేవాప్యేస్యాత్పతనే చైవదేశికః ॥౧౬॥ పూర్వసంస్కారితంలింగం శిశోశ్చేచధారయేత్॥

తా॥ [కించ గురువు వీరశైవ మతస్థులయిన స్త్రీలకు గర్భాష్టక మందు (అనగా గర్భమైన యెనమిదవ నెలయందు) లింగవృత్త సమంపీఠం దీర్ఘతం విస్తారమేవచ । తదర్ధం గోముఖం చైవపంచ సూత్ర మాహా హృతం ఇట్టిపంచసూత్రము చేసినలింగము విధిపూర్వకముగా ధరించల యునుంగళకరము, ప్రసవకాలమందు దేశికుడు నర్ధపీఠోదయమం బైనఅథవా భూపతనమంబైన పూర్వముగర్భాష్టకమున సంస్కరించి నలింగముశిశుపుయొక్క కంఠమందు ధరించవలసినది లింగధారణ విధ్యు క్తప్రకారము స్వస్తివాచన నాందీకలశస్థాపనాదులు చేయదగును.

## —✻ నామకరణము ✻—

సూ॥ జాతేక్రియానంతరంశుభదివసె । పితాద్వాదశాహని,నామకర ణంకుర్యాత్।పూర్వేద్యుః నాందీసమారాధనం విశిష్టాన్ మాహేశ్వ రాన్భోజయిత్వాశిశుః వ్యవహారార్థంనామకరణంకరిష్యేఇతి సం కల్ప్య దేవతాదినామ త్రయంకుర్యాత్ । విశిష్టేభ్యః ప్రకాశయే త్తస్మై త్రివారం బ్రూయాః మాతాపితరౌతన్నామశిశోర్దక్షి ణేకర్ణేవదేత్ కులదేవతేభ్యోనమస్కుర్యాత్ తన్నామదీక్షా పర్యంతంగోపయేత్ ॥

తా॥ లింగధారణానంతరముశుభదివసమందు తండ్రిపూర్వదిన మునాందిసమారాధనమువిశిష్టమాహేశ్వరులను భోజనముచేయించిపం న్నెండవదినము నామకరణముపెట్టవలయు. శిశువునుపిలుచుటకొరకుపే రుపెట్టుచున్నానని సంకల్పించి కులదైవతనామమునామనక్షత్రనామము తనతండ్రినామము మూడుపేర్లు పెట్టవలయు గురువుమొదలగు వారికి తెలుపవలయు నట్లాగె మూడుమార్లు ప్రకాశముగా పలుకవలయు తల్లిదండ్రులానామము శిశుయొక్క కుడికర్ణమందు చెప్పవలయును భక్త మాహేశ్వరుల కొరకు నమస్కారము చేయవలయును ఆపేరు దీక్షాప ర్యంతము గుప్తముంచవలయును.

## —✻ నిష్క్రమణం ✻—

సూ॥ తదేవంచతుర్థే మాసేశుభదినేపుణ్యాహానాం దీకార్యంమా

హేశ్వరాన్ భోజనమేత్ । శిశుంశివోపాసకాన్ శివయోగీశ్వ లింగందర్శయేత్ ॥

తా॥ అచేరీతి నామకరణమాసము శుభదినము ప్రాప్తదివసమందు నాందికార్యము మాహేశ్వరులను భోజనము చేయించి యాశిశువును గూర్చి శివోపాసకులగు భక్తమాహేశ్వరుల శివలింగమును దర్శనము చేయించ వలయును.

అన్నప్రాశనం-

సూ॥ షష్ఠేమాసేవాష్టమాసేవాథవం తెజా [illegible] ప్రాక్పే ద్యుర్గృహామలంకృత్య స్వస్తివాచన నాందీసమారాధనం అస్య కుమారస్యాయురారోగ్యసిద్ధ్యర్థం అన్నప్రాశనసంస్కారంక రిష్యే ఇతిసంకల్ప్య శిశుంప్రాఙ్ముఖముపవిశ్య దధిమధుఘృతక్షీరశ ర్కరామిశ్రితమన్నంచరపాదోదక పూర్వకంలింగ నివేదనానంతరం ప్రాశయేత్ ॥

తా॥ ఆరవ నెలయందయిన యెనిమిదవ నెలయందయిన అథవాను శ్లవచ్చి నపిదప పూర్వదినము గృహమలంకరించి స్వస్తి వాచన నాందీసమారాధనముచేసి మాయొక్కకుమారునికి యాయురారోగ్యసిద్ధిగా రకు నన్నప్రాశనసంస్కారము చేయుచున్నానని సంకల్పించి శిశువును పూర్వాముఖము నివసింపజేసి- పెరుగు తేనె నెయ్యి పాలుశకరకలిపిన యన్నము గురుపాదోదక పూర్వకము ఇష్టలింగ నివేదనమైన తరువాత భుజింపచేయవలసినది.

—✻ చౌలం ✻—

సూ॥ జన్మతృతీయవర్షే పూర్వపక్షేపుణ్యాహేషుస్వస్తివాచనమా హేశ్వరారాధనంకుర్యాత్, అస్యకుమారాయుష్యాభివృద్ధ్యర్థం క్షౌరసంస్కారం కరిష్యేఇతిసంకల్ప్య, విధ్యుక్తప్రకారంగణాధి పపూజానంతరేవీరమాహేశ్వరహస్తస్పర్శపూర్వకంవపనంకు ర్యాత్॥

తా॥ జన్మించిన మూడవ సంవత్సరమున పుణ్యదివసములయం

యస్య శ్రీ బాచన మాహేశ్వర సమారాధన చేయునట్లు ఈకుమారునియా యుష్యాభివృద్ధికొరకు క్షౌరసంస్కారము చేయుచున్నానని సంకల్పించి శాస్త్రోక్త ప్రకారముగ నారాధనపూజానంతరము వీరమాహేశ్వరహస్త స్పర్శపూర్వకము క్షౌరము చేయించవలయును.

—✽ దీక్షా. ✽—

శ్లో॥ పంచవర్షేతథాకుర్యాత్ దీక్షాం శాస్త్రోక్తమార్గతః । నమకే చమకే పంచ బ్రహ్మమంత్రేచవైదికే । తేషామేవాధికారోస్తి శివదీక్షా ప్రభావతః॥

తా॥ అట్లాగె యయిదవ సంవత్సరమందు శాస్త్రోక్తమార్గము గాదీక్ష చేయవలయును దీక్షాప్రభావమువలన వారికి రుద్రాంతరగతమగునమకమందు చమకమందు పంచబ్రహ్మ మంత్రమందధికారముగ లుగుచున్నది (పంచవర్షేవాసప్తవర్షేవాపద్యారంభమితి) అట్లులనేవి ద్యారంభము చేయవలయును.

శ్లో॥ ఉపదేశం వినాలింగం పూజయేద్యోనరాధమః ॥౨౨॥ సచేవిన రకంయాతియావచ్చంద్రదివాకరౌ ॥

తా॥ ఓ పార్వతి యేనరాధముడు గురూపదేశము వినాలింగమును పూజించుచున్నాడో వాడు చంద్రసూర్యులుండువరకునరకముపొందుచున్నాడు.

శ్లో॥ గర్భాష్టమేకృతా దీక్షాసాముఖ్యాషోడశావధిః ॥౨౩॥ గౌణం తగూర్ధ్వమధమం వీరశైవాన్వవాయినాం॥

తా॥ వీరశైవగోత్రజాతులైనటువంటి వారికిజన్మాద్యష్టవర్షమందు దీక్షచేయుటయిది ముఖ్యము పదియారు సంవత్సరములవరకు చేయునదిగౌణము అనగామధ్యమము దానికిపైన చేయునది యధమము.

శ్లో॥ శుభమాసే శుభతిథౌ శుభకాలేశుభేహని । విభూతింశివభక్తేభ్యోద త్వాతాం బూలపూర్వకం॥

తా॥ శుభమాసము శుభతిథి శుభదినము సుముహూర్తమందు శివభక్తులకొరకు ప్రసన్నభక్తమహేశ్వరులను తాంబూలపూర్వ

కముగా విభూతియిచ్చి.

శ్లో॥ శిష్యస్యప్రాణమాదాయ లింగేతత్రనిధాపయేత్ । తల్లింగంత స్యప్రాణేతుస్థాపయేదేకభావతః । ఏవంకృత్వాగురుర్లింగం శిష్యహస్తేనిధాపయేత్ ॥

తా॥ గురుమూర్తి శిష్యునియొక్క ప్రాణతత్వము (అనగాచిత్క శను) తీసికొనిష్ట లింగమందుస్థాపించవలయును నాలింగమా శిష్యునియొక్క ప్రాణమందేక భావముగా స్థాపించవలయుననీ ప్రకారము గావించిలిం గమును శిష్యునిహస్తమందు ధరించవలసినది.

శ్లో॥ తత్సలింగార్చనం నిత్యంత్రికాలంకురుభక్తితః । పూజాద్రవ్యా ణిసంశోధ్యశుచీతద్గతమానసః । హస్తసింహాసనేలింగమప్రమా దేనధారయ । ప్రమాదాత్పతితేలింగే సహప్రాణాన్పరిత్యజ । ప్రాణవద్ధారణీయంతత్ప్రాణలింగమిదంతవ । కదాచిత్కుత్ర చిద్వాపి వియోజయేన్నదేహతః ॥౨౯॥

తా॥ ఓకుమారుడా (పూజయప్రాణలింగంత్వం) యావజ్జీవం (ప్ర జ్ఞయా) అనే ప్రమాణము ప్రతిదినము త్రికాలములందు పూజాద్రవ్యము శోధించిపరిశుద్ధాంతర్గతమాన సుడవై భక్తివలన లింగార్చన చేయుము లింగమునుపదిలముగా వామహస్తపీఠమందు ధరించుము ప్రమాదమువ లన లింగముపడిపోయెనేని దానితోడనే ప్రాణములను వదులుము ప్రా ణమువలె ధరించవలయునది నీయొక్క ప్రాణలింగమిది యొకానొకప్పు డు నొకానొక దిక్కైననను దేహమునుండి వియోగము చేయవలదు.

శ్లో॥ యదాదీక్షాప్రవేశస్స్యాల్లింగ ధారణపూర్వకం । తదాప్రభృ తిభక్తోసౌ పూజయేత్స్వగమస్థితాన్ ॥౩౦॥

తా॥ ఎప్పుడులింగధారణ పూర్వకముగాదీక్షాబాంధవము చేయుచున్నా డో అదివరకునుండి యాభక్తుడు వీరమాహేశ్వరులను పూజించవలెను.

వివాహం.

శ్లో॥ స్వమార్గాచార వర్తిభ్యస్సజాతిభ్యస్సదావ్రతీ । దద్యాత్తే భ్యస్సమాదద్యాత్కన్యాం... తేషుద్భవాం ॥౩౧॥

తా॥ సదాచారవ్రతుడగు భక్తుండు తనయొక్క వంశోద్భవమైన కన్యను స్వకీయ మార్గాచారప్రవర్తకులైనటువంటి స్వజాతీయులకొరకు నివ్వవలయును అట్టివారలనుండి కన్యను తీసుకొనవలయును.

శ్లో॥ అన్యగోత్రాము పయతలక్షణాఢ్యాం యువీయసీం। రూపలక్షణసంపన్నాం సుశీలాంస్వకులోద్భవాం ॥౩౨॥ బుధస్సముద్వహేత్కన్యాందీక్షితాం ధర్మచారిణీం। అనన్యపూర్వికాంకాంతాం ప్రశస్తగుణభూషితాం ॥౩౩॥ అరోగిణీం భ్రాతృమతీంస్వేతరాచార్య గోత్రజాం॥

తా॥ వివేకశీలుడైన భక్తుండు ఇతరగోత్రమందు గలిగినశుభలక్షణాఢ్యయైనటువంటి. తనకంటె తక్కువ వయసు గలిగిరూపలక్షణసంపన్నయైనటువంటి సుశీలయైనతనసమానజాతి యందు పుట్టినటువంటిదీక్షితయును ధర్మప్రవర్తయైనట్టి పూర్వము నితరులు గ్రహించనటువంటి మనోహరమైన ప్రశస్తగుణభూషితమైనటువంటి రోగపీడితగాకసోదరులు గలిగినటువంటి యితరాచార్య గోత్రజమైనటువంటికన్యను వివాహము చేసుకొనవలయును.

శ్లో॥ దంపత్యోరేకనిష్ఠత్వమేకదేవార్చనంతథా ॥౩౪॥ ఉభయోరేకకర్మత్వమేకధర్మవ్రతాదికం। ఉభయోరేకవర్ణత్వమేకమంత్రేసునిశ్చితాం ॥౩౫॥ భవిభక్తేషుభిన్నత్వం తేష్వసంపర్కమాచరేత్। పతింపత్నీగురుంలింగ మేకభావానపశ్యతి॥ ౩౬॥ అష్టవింశతికోట్యాంచనరకే కాలమక్షయం॥

తా॥ సతిపతులకొకటేనైష్ఠిక మొకటేలింగార్చన మటువలెనె యిద్దరికొకటె కాయక మొకటేధర్మవ్రతాదికము నిద్దరికొక టెవర్ణత్వముకొక మంత్రమంచెని శ్చయముభవిభక్తులయందు భేదముచేయుటయు నభవులయందు సంపర్కము చేయకూడదు- భార్యామొగణ్నిగురువులింగము నేకభావము చూడకుండునా యదియిరువయి యెనమిదికోట్లనరకమందక్షయకాల ముండును.



— ✻ మాహేశ్వరదీక్షా ✻ —

శ్లో॥ ఉపదేశస్స్వగోత్రాణాం కర్తవ్యో గురుసత్తమైః । ఉపసూత్రాణాంచకర్తవ్యామహాసూత్రావలంబకైః ॥౧॥

తా॥ గురువరుల చేతతమగోత్రీయులకు దీక్షోపదేశముచేయవలయు మహాసూత్రావలంబులైన పీఠాధికారులచేత నుపసూత్రులకు చేయవలసినవి.

శ్లో॥ అథవక్ష్యేయథాయోగం సమ్యక్ శిష్యస్యలక్షణం । అయంపరంపరంప్రాప్తః పక్వచిత్త ఇతిద్విధా॥ ౨॥ పరంపరాగతంశిష్యం లక్షణైర పరీక్షయేత్। నూతనాశ్శైవదీక్షాతుసంస్కృతోనాభిజాయతే ॥౩॥ చిత్తస్యపరిపాకేననశైవ దీక్షాంచికీర్షతు । పరీక్షయేల్లక్షణైస్తం తత్ప్రకారోధునోచ్యతే ॥౪॥

తా॥ ఇకవిధిప్రకారము శిష్యునియొక్క లక్షణము లెస్సగాచెప్పుచున్నాను. పరంపర ప్రాప్తుడుపక్వచిత్తుడని రెండువిధములు పరంపరాగత శిష్యున్నిపరిక్షచేయవలదు నూతనుడైన శివసంస్కారము పొందకున్నవాడు బుద్ధియొక్క పరిపాకముచేత శివదీక్షనుపొందుటకు వచ్చినపక్వచిత్తుని లక్షణములచేత పరిక్షించవలయు నాప్రకారమిపుడుచెప్పబడుచున్నది.

శ్లో॥ పుష్పాక్షికర్ణఛిద్రంతుబధిరం కలహప్రియం । వ్యాధిగ్రస్తం గహీనం తస్యాచారం వివర్జయేత్॥ ౫॥ అమృతెజారజంకుండం మృతేభర్తరిగోళకం॥

తా॥ కంటిలోపువ్వుపడిన వాన్ని- చెవులుకుట్టుకున్నవాన్ని చెవిటివాన్నిపోరుకోరుచు రోగపీడితున్ని యువయములలో నేదైన నొకటిలేనివాన్ని తండ్రియుండి జారునికిపుట్టినవాన్నికుండ కుపుట్టినవాన్ని దీక్షచేయకవర్జించవలయును.

శ్లో॥ ఆశ్రమాణాంసమస్తానాం గృహస్థోయత్తమోగురుః ॥౬॥ యథాహం సర్వలోకానాం గురురంబికయాసహ । స్వాయమేవయతీనాంతు యతిర్గురురథాపినా ॥౭॥



తా॥ ఎట్లాగునేను పార్వతితో గూడుకొని సమస్తలోకములకును

రుపులో అట్లాగనమస్తాశ్రమములకు గృహస్థుడు ఉత్తమగురువుగు టలనతడు తామేగురువులు లేనియెడల యతియేగురువు.

శ్లో॥ బ్రహ్మచారీద్విధాప్రోక్తో నైష్ఠికో భౌతికస్స్మృతః। నైష్ఠికోమధ్యమో జ్ఞేయో భౌతికస్తు తతోధమః ॥౯॥ ఆకౌమారాద్బ్రహ్మచారీ యావజ్జీవంతు నైష్ఠికః। స్వాశ్రమస్థకృత కాలాంతే బ్రహ్మచారీ పునర్గృహీ। సభౌతిక ఇతిజ్ఞేయ స్తౌగురూమధ్యమాధమౌ। వానప్రస్థ యతీనాంతు గురుత్వం నైవ కేశ్వచిత్ ॥౧౦॥

తా॥ బ్రహ్మచారీ రెండువిధములు నైష్ఠికుండు భౌతికుండని చెప్పబడినవి నైష్ఠికుండు మధ్యముడని తెలియనగు భౌతికుండునధముడనియు-కౌమారము వరకు బ్రహ్మచారియాను। అట్లాగె। యావజ్జీవము నుండునేని నైష్ఠికుండు- బ్రహ్మచారికౌమారాతీతుడై కాలాంతరము గృహస్థవ్యవస్థ జెందెనేని యతడుభౌతికుండని తేలియదగును వీరిద్దరుమధ్యమాధములు వానప్రస్థ సంన్యాసులకు నొకప్పటికైనగురుత్వము నుండనేరదు.

శ్లో॥ పంచైవకలశాంస్తత్ర నిక్షిప్తః పరిపూజితాః। కిమర్థం దశధా తేషామర్హణాదీని నిక్షిపేత్ ॥౧౧॥

తా॥ దీక్షాయందైదు కలశములచట పెట్టిపూజింపబడు చున్నను వాటికిపదివిధము లాహార్ణములు (అనగా ఫలపుష్పదక్షిణ తాంబూల తండులములు) ఎందుకొరకు పెట్టవలయును.

(ఈశ్వరోవాచ)

శ్లో॥ పంచప్రాణామహాచార్యా ఉపాచార్యాశ్చ పంచధా। ఏవం దశవిధా నాంతుభాగాశ్చ పరికల్పితాః ॥౧౨॥ తస్మాద్దశవిధం తత్ర ఫల నైవేద్యకం న్యసేత్। పంచప్రాణాని నిక్షిప్య తదర్ధం పంచధా క్షిపేత్ ॥౧౩॥

తా॥ ఐదుప్రాణకాభాగములు మహాచార్యులు- ఐదర్ధభాగములు ఉపాచార్యులీప్రకారము పదివిధములు భాగములు కల్పింపడినవి యందు వలన నచటపదివిధము లు ఫలనైవేద్యములు పెట్టవలయును ఐదుప్రాణభాగము లు పెట్టియందులో సగమైదు భాగములు పెట్టవలయును.

శ్లో॥ పూర్వభాగంమహాచార్యా శ్చహరేయుర్యథాక్రమం। ఉపసూత్రైస్సమాయుక్తాశ్శైవమేవవినిర్ణయః॥౨౧॥తదర్థంచైవగృహ్ణీయాదుపాచార్యాస్తతఃపరం।ఏకస్యభాగమేకశ్చగృహీతుంనైవచార్హతి॥ ౨౧॥బలాదపిచగృహ్ణీయాత్సమాన స్కందతాభవేత్।తేనదోషఫలంభు క్త్వానరకానేవవిందతి॥ ౨౨॥ఉపాచార్యపదార్థంతుమహాచార్యాయదాహరేత్।తదా తేషాంచమహాత్మాంన్యూనతా భవతిధ్రువం ॥౨౩॥

తా॥ మొదటిపూర్ణభాగములు క్రమముగా మహాచార్యులును కొందురు పిమ్మటఅర్ధభాగములు ఉపసూత్రులతో గూడియుపాచార్యులు తీసుకొనవలయునను నిర్ణయమందాకని యొకరిభాగ మొకడు తీసుకొనడము యోగ్యము కాదు బలతాత్కారము వల్లతీసుకొనెనేని సమానత్వము గలుగును అదోషఫలమును భవించినరకములను బొందుచున్నాడు ఎప్పుడు పాచార్యులపదార్థము మహాచార్యుడు తీసుకొనునో అప్పుడె మహాచార్యులకు నిశ్చయంగా గొప్పతరమైనటువంటి న్యూనతకలుగను.

పట్టాభిషేకం

శ్లో॥ పట్టాభిషేచనవిధింవక్ష్యామిసాంప్రతం ।సింహాసనాధిపతేమశ్శికాముద్రాదిసంయుతా॥౧॥పంచముద్రాన్వితోభూత్వాగురుపట్టాభిషేచనం । పూర్వోక్తవిధినాసమ్యగుపదిష్టంస్వగోత్రజా ॥౨॥ స్వశాఖాచస్వగోత్రం చస్వదండకలశాన్వితం । సంవిదిత్వా యథా శాస్త్రం కుర్యాత్పట్టాభిషేచనం ॥౩॥

తా॥ ఓపార్వతీయిపుడుపట్టాభిషేకవిధిని జెప్పుటకు ఇచ్ఛయించుచున్నాను సింహాసనాధిపతులు శికాముద్రాదులతో గూడుకొన్నవారైగురుపంచముద్రలుగలవాడగుచు పట్టాభిషేకము పూర్వముచెప్పబడినదట్టి విధిప్రకారముతెన్నగా నుపదేశించి స్వగోత్రుని । అనగా తనవంశోద్భవుని తనశాఖాతను గోత్రముతనదండ కలశములతో గూడుకొన్నవానిగాం చిగా తెలుసుకొని శాస్త్రప్రకారము పట్టాభిషేకము చేయవలయును



శ్లో॥ స్వశాఖాంచస్వగోత్రంచ స్వసూత్రం కలశానిచ ।। జటాకా

పాయవద : దేషుపైకహీనోనపూజ్యతే ॥౧॥ తస్మాతశల్లక్షణాని పూజ్యాని వపరాననే ! బహుభిస్సమ్మతో యః స్యాత్సురుక్త్వే నిహితః పుమాన్ । పట్టాభిషిక్తో బహుభిస్సపూజ్యో న్యూనకో పరః ॥

తా॥ ఓ పార్వతి పట్టాధికారము పొందినవాడు తనశాఖయున్న తనగోత్రమున్ను తనసూత్రకలశమున్ను జడలుక పాయగుడ్డ దండములయందు నొకటైన లేనివాడు పూజింపబడడు. అందుకొరకీలక్షణము లుండవలయునుపూజ్యయోగ్యములు । అనేకులచేతసమ్మతించబడిన పురుషుడు గురుత్వము నుంచబడి యనేకులచేత పట్టాభిషిక్తుడయినవాడు భువియందు పూజ్యుడు. అన్యుడన్యాడు. (కాబట్టి) అట్టిస్వకీయలాంఛనుడయియుండవలెను లేకపోయితే పూజింపబడడు.

శ్లో॥ పార్వత్యువాచ॥ పట్టోపదేశయోర్మధ్యే ప్రబలో దుర్బలశ్చకః ॥౨॥ ఎతద్విస్తార్యభగవన్వక్తుమర్హసి సాంప్రదం ॥

తా॥ పార్వతి పలికెను షడ్గుణైశ్వర్య సంపన్నుడయిన పరమాత్ముడా- పట్టాభిషిక్త యుపదేశములలో- ఎవ్వడుబలీయ్యుడు నెవ్వడుదుర్బలుడునిపు మావిస్తరించి చెప్పుటకు సమర్థులౌచున్నారు.

శ్లో॥ ఈశ్వరోవాచ ।ఉత్తమో పట్టబద్ధస్యాదుపదిష్టస్తథోధమః ॥౭॥ ఉపదేశః పరోనాథాద్భువి పట్టాభిషేకతః । తస్మాద్దీక్షాపట్టబద్ధో గురు రేవనసంశయః ॥౮॥

తా॥ ఈశ్వరోవాచ ! ఓపార్వతి పట్టబద్ధుండు శ్రేష్ఠుడౌచున్నాడు యుపదేశుండు వానికంటెనికృష్టుడౌచున్నాడు జగత్తులో పట్టాభిషిక్తునికంటెనుపదేశమునుత్కృష్టము గానేరదు నందువలనదీక్షాపట్టబద్ధుడయినవాడే గురువు సంశయములేదు - జీవనోపాధి

శ్లో॥ సదాలింగాంగిసంయోగః క్రియాజ్ఞానాదిసంయుతాః । రసాయనాదికరణంతథా వైక్రయవిక్రయమ్ ॥౧॥ వైద్యవైశ్యంచజ్యోతిష్యంచవ్యవహారాంకృషించవై ।చతుర్ణామపివర్ణానాం మేషధర్మస్సనాతనః ॥౨॥

తా॥ ఎల్లప్పుడు లింగాంగసామరస్యులైనక్రియాజ్ఞానాదిసహితులైన వారురసాయనమనగా ఔషధార్థము రసమాత్రికతామ్రాదులు

పక్వముచేయుడము- కొనడము, అమ్మడము- శైద్యము- వైశ్యవృత్తి ఋ
తిష్యాను,వ్యవహారము- వ్యవసాయమను నాలుగువర్ణములకిప్పు రా
నధర్మములు-

శ్లో॥ విరాగీకృతవాణిజ్యవ్యవహారేషుసర్వదా । ద్రవ్యాశయాహీనజా
తౌజాతిభ్రష్టకులేషుచ ॥౩॥అగృహీతాన్నపానాది దీక్షాకర్మసు
స్థితః ॥

తా॥ ఎల్లప్పుడును రాగములేనివాడై వర్తకము చేయుచు వ్యవ
హారములయందు ద్రవ్యాశచే జాతిహీన కులభ్రష్టకులము లందన్నపా
నాదులు తీసుకొనక దీక్షాచారములయందు నిష్ఠుడైయుండవలయు.

శ్లో॥ ఆఢ్యోవాథదరిద్రోవాస్వకాంశక్తిమవంచయన్ ॥౪॥ ద్రవ్యైర్న్యా
యార్జితైరేవభక్త్యాదేవం సమర్చయేత్ । భక్త్యావిత్తానుసా
రేణశివముద్దిశ్యయత్కృతం ॥౫॥అల్పేమహతివాసామ్యం ఫలమా
ఢ్యదరిద్రయోః । భక్త్యాప్రచోదితః కుర్యాదల్పవిత్తోపిమానవః
సర్వస్వమపియోదద్యాచ్ఛివభక్తివివర్జితః । సతేనఫలభాక్‌నస్యా
ద్భక్తిరేవాత్రకారణం ॥

తా॥ ధనికుడైనను అథవా బీదవాడైనను తనశక్తి వంచన చేయని
వాడై న్యాయముగ సంపాదించిన ద్రవ్యముల చేత భక్తితో చదుని పూజిం
చవలయును నేదైతేశివోద్దేశ్యము భక్తిచేత విత్తానుకూలముగా చేయబడు
నో యదికొంచమైనను గొప్పదియై ధనిక దరిద్రులకు ఫలముసమానము
మానవుండల్ప విత్తుండైననప్పటికి భక్తిచేత పూర్వప్రేరేపణ వలన
చేయవలయును నెవ్వడు శివభక్తి వర్జితుండై సమస్తము పంచిపెట్టిన
నప్పటికి వాడట్లుపంచిపెట్టుటచేత ఫలానుభవుడు గానేరడు అందుకు భక్తి
యేకారణము.

(భక్తివిషయం)

శ్లో॥ అహంకర్తాఽసమస్తస్య ధర్మాధర్మస్యకర్మణః । ఇత్యేనేనాభి
మానేనకర్మకాండోయముచ్యతే ॥౧॥ నాహంకర్తాస్యకర్మణోం
నైవసాక్షిస్వభావతః । ఇత్యేనేనాభిమానేన జ్ఞానకాండోయము

త్యతే ॥ ఽనకర్తాహంనసాక్షీచ శివఏవేతికర్మణి । ద్వంద్వాభిమా
నరాహిత్యాద్భక్తి కాండః ప్రయుచ్యతే ॥౩॥

తా॥ నేనుసమస్త ధర్మాధర్మ కర్మమునకు కర్తను నీయభిమాన
ము చేత వీడుకర్మ కాండుడని చెప్పబడుచున్నది నేనుకర్తనుగాను కర్మ
ము గాను స్వభావము వలన సాక్షిని గాననేయాయభిమానము చేతవీడు
జ్ఞానకాండు డని చెప్పబడుచున్నది నేనుకర్తనుగాను సాక్షియుగానుకర్మ
మునకు శివుడేకర్త పూర్వోక్తద్వంద్వాభిమానరాహిత్యమువలన భక్తికాం
డుడని చెప్పబడుచున్నది.

శ్లో॥ భక్తిః కర్మసదం సరోరుహదళం జ్ఞానం పదం భాక్తికం । తస్మా
దోఘనమేషు సంసృతిపయోబిందుస్తు తస్త్రమాత్ ॥౪॥ సాఫ
ల్యం విఫలత్వమాకృతిత యాప్రాప్తే మేణవాశంగతా । నామ్నా
ప్యే కశివాత్మకాంపరతరాంభక్తింశివాచక్ష్మహే ॥౫॥

తా॥ ముత్యమువిప్పకర్మస్థానము కమలపత్రము జ్ఞానస్థానము
కాగిననిను పముద్ర భక్తిస్థానములగుచు దకబిందువు వీనిసఫలవిఫల స్వ
రూపనాశనం బొందునోయట్లాగె సంసారముకర్మకాండియందు సఫ
లము జ్ఞానకాండయందు విఫలముభక్తికాండయందు స్వరూపనాశనమ
గునట్టియేకప్రసిద్ధియను శివాత్మకమగు పరతరంబైన భక్తినిగూర్చి..
చెప్పుదును.

శ్లో॥ రౌప్యం తామ్రమయోఘనం త్రితయమేవం సాత్వికంరాజసం ।
ప్రోక్తం తామసమేషు చత్రిషుపిలేపం సంశ్రితాపిస్వయం । ద
ర్యాప్తిస్ఫవసస్వనిర్మలత యాలోహత్రయాణ తద్యథా । స్వర్ణకం
షోడశవర్ణకా పూర్ణకామకరోద్భక్తిస్తథాత్రీన్గుణాన్ ॥౬॥

తా॥ ఎట్లాగుసిద్ధరసము వెండిరాగియినుప ముద్దలమూటియం
దుపొంది తననిర్మలత్వముతో తనవలెలోహత్రయమును షోడశవర్ణకాపూ
ర్ణకానువర్ణకాముగు చేయుచున్నదో యట్లాగభక్తిరాజసతామస సాత్వి
క త్రిగుణంబుల బొందితనరూపము చేయుచున్నది.

శ్లో॥ తపఃకర్మజపోధ్యానం జ్ఞానం చేత్యనుపూర్వకం । పంచధాశ

ధ్యతే సద్భిస్తదేవ భజనంపునః ॥౯॥

తా॥ తపము- కర్మము- జపము- ధ్యానము- జ్ఞానము- క్రియము లైదువిధములు నిగమాగమ వేత్తలచేత నడమే భజన మని చెప్పబడు చున్నది.

శ్లో॥ శివార్థే దేహసం శోషస్తపః కృచ్ఛ్రాదినో మతం । శివార్చాకర్మనిర్దేయం బాహ్యంయాగాది నోచ్యతే ॥౯॥ జపః పంచాక్షరాభ్యాసః ప్రణవాభ్యాసఏవవా । రుద్రాధ్యాయాది కాభ్యాసోన వేదాధ్యాయనాదికం ॥౧౦॥ ధ్యానంశివస్వ రూపాది చింతానాత్మాదిచింతనం । శివాగమార్థ విజ్ఞానంజ్ఞానం నాన్యార్థ వేదనం ॥౧౧॥ ఇతిపంచప్రకారోయం శివయజ్ఞః ప్రకీర్తితః । అనేన పంచయజ్ఞేనయః పూజయతిశంకరం । భక్త్యాపరమయాయుక్త స్సవైభక్త ఇతీరితః ॥౧౨॥

తా॥ లింగార్చనార్థము పూజోపకరణ సంపాద్యమందు శరీరముశోషించడమే- తపము- కాని కృచ్ఛ్రచాంద్రాయణాది దేహశోషణ మ్మాత్రముకాదు- లింగార్చనమే కర్మమని యేరుంగవలయును గాని బాహ్య యజ్ఞయాగాదులు చెప్పబడలేదు- పంచాక్షరాభ్యాసమైన ప్రణవాభ్యాసమైన రుద్రాధ్యాయాదికమే- జపము- కాని వేదాధ్యాయనాదికము కూడదు శివరూపాదిచింతనమే- ధ్యానము కాని- యాత్మాదిచింతనము కూడదు శివాగమార్థము తెలియుటె- జ్ఞానము- కాని ఇతరార్థము తెలియుట డు ఈ యైదుప్రకారములు శివపూజయని చెప్పబడినది యెవ్వడునుత్కృష్టభక్తితో కూడుకొన్నవాడై యీపంచవిధ పూజచే శంకరుని పూజించుచున్నాడో వాడె భక్తుండని చెప్పబడుచున్నది.

శ్లో॥ సాపునర్భిద్యతే త్రేధా మనోవాక్కాయసాధనైః । శివరూపాదిచింతాయా సాసేవామానసీస్మృతా ॥౧౩॥ జపాదివాచకీసేవా కర్మపూజాచకాయకీః

తా॥ అదిమరలమనో వాక్కాయ సాధనములచేత మూడువిధములు భేదింపబడుచున్నది శివస్వరూపాది చింతయుక్తసేవయదిమా

ననియును- శివమంత్రజపాది సేవయదివాచకియనియు లింగార్చన సేవయది కాయికియని తెలియాతగ్గది.

శ్లో॥ యేభజంతిమహాదేవం పరమాత్మానమవ్యయం । కర్మణామనసావాచా తే భక్తాఇతికీర్తితాః॥

తా॥ ఎవ్వరుపరమాత్ముండైన నాశనరహితుండగు మహాదేవుస్ని కాయముచేమనుస్సుచే వాక్కుచేభజించుచున్నారో వారుభక్తులనికీర్తింపబడుచున్నారు.

శ్లో॥ శ్రవణంకీర్తనంశంభోస్స్మరణం పాదసేవనం ॥౧౫॥ అర్చనంవందనం దాస్యంసఖ్యమాత్మనివేదనం । ఏవంనవవిధాభక్తిః ప్రోక్తందేవేనశంభునా ॥౧౬॥

తా॥ నిగమాగమధర్మములువినుట. శివునిమహిమలు చెప్పుట. స్మరించుట. పాదసేవచేయుట. పూజించుట. నమస్కరించు. దాస్యముచేయుట స్నేహించుట. ఆత్మనివేదించుట. నీతొమ్మిదివిధములు భక్తి శివునిచేత చెప్పబడినది.

శ్లో॥ కామంభక్తిరతౌకుర్యాత్క్రోధంచాధర్మకర్మణి। లోభంశివార్చనేకుర్యాన్మోహం భక్తజనేప్రియే ॥౧౭॥ మాత్సర్యంకరణేష్వేవం మదంమాయాపరాభవేత్ ॥

తా॥ ఓపార్వతి శివభక్తుండు భక్తిరతియందు కామమనాచారకార్యమందు క్రోధములింగార్చన యందులోభము భక్తజనులయందు మోహము నంతఃకరణ చతుష్టయమందు మాత్సర్యము మాయాప్రకృతియందుమదముంచవలయు.

శ్లో॥ అద్వైతంత్రిషులోకేషు నాద్వైతంగురుసన్నిధౌ ॥౧౮॥ దీర్ఘదండనమః కుర్యాన్నిర్లజ్జో గురుసన్నిధౌ । తస్మాత్సంకల్పశ్చప్రణమనస్సతతంగురుదేవయోః ॥౧౯॥ దండప్రణామయోః కుర్యాద్భక్త్యాశివపుతం వ్రజేత్॥

తా॥ అద్వైతము మూడులోకములయందుగానిగురుసన్నిధియందద్వైతముదలపవలదు గురుసన్నిధి నిర్లజ్జవలన దీర్ఘదండనమస్కా

రము చేయవలయు నట్లాగ నెవ్వడు భక్తిచేత నిరంతరము గురుజంగము లకు నమస్కారము సంకల్పించి దండప్రణామము చేయునో వాడు కైలా సము పొందును.

శ్లో॥ ప్రత్యుత్థానాభిగమనం వందనం ప్రియభాషణం ॥౨౦॥ ఆసనమన్న పానంచ ముక్తేస్సోపానసప్తకం॥

తా॥ జంగమను గూర్చి- లేవడము- ఎదురేగుట- వందనము చేయు ట- ప్రియవాక్యములాడుట- పీఠమిచ్చుట- అన్నమిడుట- జలమోసంగు నీ యేడు మోక్షమునకు సోపానములు.

[వీరశైవలక్షణం]

శ్లో॥ అష్టావరణః ప్రభావః పంచాచార ప్రవర్తనం। యోఽనిశం సదా దే వి మోక్షమాప్నోతి తచ్ఛృణు ॥౧॥

తా॥ ఓపార్వతీ ఎవ్వడష్టావరణము లస్వభావము పంచాచార ములవర్తనము నిరంతరము చేయుచున్నాడో [వాడు] ముక్తి బొందు చున్నాడునది వినుమూ.

శ్లో॥ భూతిరుద్రాక్షమంత్రాంచ గురులింగంతు జంగమః। పాదతీర్థః ప్రసాదంచాష్టావరణాః ప్రకీర్తితాః॥౨॥

తా॥ భస్మము. రుద్రాక్ష- మంత్రము- గురువు. లింగము. జంగ ము. పాదతీర్థము. ప్రసాదమున ష్టావరణములు చెప్పబడినవి.

శ్లో॥ సంసారదుఃఖతరణం సర్వమంగళదాయకం। ధారయామాసు మునయో భస్మ త్రైలోక్యపావనం ॥౩॥

తా॥ సంసారదుఃఖమును తరించునదియు సమస్త శుభములనిచ్చు దియు ముల్లోకముల పవిత్రము చేయునటువంటి భస్మమును ఋషీశ్వ రులు ధరియించుచున్నారు.

శ్లో॥ రుద్రాక్షంతు విరూపాక్షం భోగమోక్షప్రదాయకం। పరమా త్మస్వరూపం చ ధార్యం తే మునిపుంగవాః ॥౪॥

తా॥ రుద్రాక్ష శివనేత్ర సంబంధము భోగమోక్ష మిచ్చునటువం టి పరమాత్మ స్వరూపమును మునిసత్తములు ధరియించు చున్నారు.

శ్లో॥ ఓమిత్యేకాక్షరంబ్రహ్మతనుఃపంచాక్షరస్మృతః । ఓంకారాది యకారాంతంయఃపఠేత్సరమంపదం ॥౬॥

తా॥ ఓమనేయొక యక్షరము పరబ్రహ్మస్వరూపమైనచైతన్యమునకారాది యకారాంత పంచాక్షరములు శరీరమని తెలియదగు నెవ్వడు ఓంకారాది యకారాంతషడక్షరములు పఠించుచున్నాడో అదే మోక్షపదము.

శ్లో॥ గువర్ణం స్యాదంధకారం రువర్ణంతన్నివర్తకం । అంధకారనిరోధిత్వాద్గురురిత్యభిధీయతే ॥౮॥

తా॥ గుకారవర్ణము మాయంధకారము రుకారవర్ణము దానినివారించు సూర్యస్వరూపము (అందుచే) మాయంధకారనిరోధమువలన గురువని చెప్పబడుచున్నది.

శ్లో॥ లింగమధ్యేజగత్సర్వం త్రైలోక్యంసచరాచరం । లింగబాహ్యాత్పరం నాస్తి తల్లింగం బ్రహ్మఉచ్యతే ॥౯॥

తా॥ సమస్తజగచ్చరాచర త్రిలోకములు లింగమధ్యమందు కాక లింగబాహ్యమితర మేమిలేదు [అట్టి]లింగముబ్రహ్మమని చెప్పబడుచున్నది.

శ్లో॥ జకారంజననం నాస్తి గకారంగతివర్జితం । మకారంమరణం నాస్తిత్రివిధం జంగమాకృతిః ॥౩౦॥

తా॥జకారభావము పుట్టుకలేని దీగకారభావముగమనము లేని దీమకారభావము చావులేని దిత్రివిధస్వభావము జంగమస్వరూపము.

శ్లో॥ పాదోదకం పరబ్రహ్మపరం జ్యోతిస్వరూపకం। తృణాగ్రబిందుమాత్రేణజీవన్ముక్తిర్నసంశయః ॥౩౧॥

తా॥ పాదోదకము పరబ్రహ్మసంబంధము జ్యోతిర్మయస్థానసోమమండలాగ తామృతధారయు తృణాగ్రబిందుమాత్రముచేజీవన్ముక్తి గలుగునదియు సంశయములేదు.

శ్లో॥ చరప్రసాదసిక్థంచకోట్యంశంప్రాప్తవాన్భవేత్ ॥౧౧॥ఇదమాశ్చర్యమేవోక్తంశివసాయుజ్యమవ్యయం ॥౧౧॥

తా॥ ఎవ్వడుజంగమ ప్రసాదకణ మందు కోటిభాగము పొంద

బడిన వాడౌచున్నాడో యట్టియతఁడయమగు శివసాయుజ్యము చెప్పనా శ్చర్యమైనది.

(పంచాచారాః)

శ్లో॥ లింగాచారస్సదాచారశ్శివాచారస్తథైవచ। గణాచారఃభృత్యా చారఃపంచాచారాఃప్రకీర్తితాః॥

తా॥ లింగాచారము. సదాచారము. శివాచారము.గణాచారము భృత్యాచారము పంచాచారములని చెప్పబడినవి.

శ్లో॥ గురుణాదత్తలింగాద్వైనాస్తిదైవంమహీతలే। ఇతిభావానుసం ధానంలింగాచారస్సఉచ్యతే॥౧౩॥

తా॥ ఎవ్వఁడుగురువుచేత నివ్వబడినటువంటిలింగము (కంటె,భూ తలమందు దైవము లేదని నిశ్చయము బొంది యున్నాఁడో నదీలింగాచార మని చెప్పబడుచున్నది.

శ్లో॥ ధర్మాదార్జితద్రవ్యేణ తృప్తిశ్చకురుతేసదా। గురుజంగమలిం గానాంసదాచారఃప్రకీర్తితః॥౧౪॥

తా॥ ఎవ్వఁడు న్యాయమువలన సంపాదించిన ద్రవ్యముచేత గురు లింగజంగముల యొక్క తృప్తిసదాకాలము చేయుచున్నాఁడో [అదిస దాచారమనికీర్తింపబడినది.

శ్లో॥ శివఏకఃపరబ్రహ్మాసర్వలోకైకకారణః। అన్యథాశరణంనాస్తి శివాచారస్య లక్షణం॥౧౫॥

తా॥ సమస్తలోకైక కారణుఁడు పరబ్రహ్మయు శివుండు నను నొకఁడేకాక రెండవవాఁడు లేడనేభావమె శివాచారముయొక్క లక్షణము.

శ్లో॥ నశృణోతిసదాచారశ్శివ నిందాంసదాభువి। గణాచారోయ మాఖ్యాతశ్శివవ్రతపరాయణైః॥౧౬॥

తా॥ సదాచారుం డయినవాఁడు శివనింద నెప్పటికీ వినకుండయు న్నాఁడో [అది] గణాచారమని శివవ్రతపరాయణులచేత శ్లాఘింపబడినది

శ్లో॥ శివభక్తజనాస్సర్వేవరిష్ఠాఃపృథివీతలే। తేషాంభృత్యోహమిత్యే వద్భృత్యాచారసఉచ్యతే॥౧౭॥

తా॥ ఎవ్వడుభూతలమందు శివభక్తజనులు యావత్ శ్రేష్ఠులువారికి నేను భృత్యుడనని భావించుచున్నాడో అది భృత్యాచారమని చెప్పబడుచున్నది.

—✻ షట్స్థలప్రకరణంప్రారంభః ✻—

శ్లో॥ షట్స్థలాత్మకమేతచ్చ శ్రూయతాం సావధానతః॥౩॥ ప్రథమం గురులింగం స్యాత్తత ఆచారలింగకం॥౧॥ తతః ప్రసాదలింగం తు చరలింగమతఃపరం। శివలింగమథో జ్ఞేయం మహాలింగమతఃపరం॥౨॥ ఏవం షడ్విధలింగానాం స్వరూపం శృణు శాంకరి॥

తా॥ ఓపార్వతీ యీషట్స్థలస్వభావము సావధానముగా మొదలుగురులింగము- పిమ్మటాచారలింగము. ప్రసాదలింగము. చరలింగము. శివలింగము మహాలింగము నీప్రకారము షడ్విధలింగములయొక్క స్వరూపమువినుదువుగాక.

—✻ గురులింగస్థలం ✻—

శ్లో॥ దీక్షాశిక్షానుభావశ్చ గురులింగం త్రిధా భవేత్। కుండమంటపహోమాద్యైర్బాహ్యైరధ్వకలాదిభిః। మంత్రోపదేశసహితా క్రియాదీక్షేతిగీయతే॥ ౪॥ దీయతే లింగసంబంధః క్షీయతే కర్మసంచయః। దీయతే క్షీయతే యస్మాద్దీక్షేతి పరిగీయతే॥౫॥

తా॥ దీక్షా, శిక్షా. అనుభవమని గురులింగము మూడువిధము లౌచున్నది. కుండమంటపహోమాదులచేత షడధ్వకలాదులచేత మంత్రోపదేశసహితముక్రియాదీక్షయని చెప్పబడుచున్నది దీక్షయనగా దీయన్నమాత్రములింగసంబంధజ్ఞానము నివ్వబడుచున్నదో క్షీయన్నమాత్రము కర్మసంచయమునశించుచున్నదో యది దీక్షాలింగమని చెప్పబడుచున్నది.

శ్లో॥ గురులింగచరాఖ్యానాం లింగానామేకరూపకం। యజ్ఞానంబోధితం సద్భిస్సా శిక్షేతి నిగద్యతే॥౬॥

తా॥ ఎజ్ఞానముగురులింగ జంగములైనలింగములయొక్క స్వరూపమొక్కటె యనిబోధింపబడునో యదిపండితులచేత శిక్షాలింగమని చెప్పబడుచున్నది.

శ్లో॥ సంస్కారైః ప్రాక్తనైర్దేవి స్వకీయసుకృతార్జితైః। భక్తిశ్రద్ధార్చనాద్యైర్యద్దనుభావస్సఉచ్యతే ॥౭॥

తా॥ ఓపార్వతి యెవ్వడు ప్రాక్తన సంస్కారములచేత స్వకీయ పుణ్యార్జిత ములచేత భక్తిశ్రద్ధార్చనాదులచేత నుండియున్నాడో యతడను భవలింగమని చెప్పబడుచున్నది.

—* ఆచారలింగస్థలం *—

శ్లో॥ స్థలమాచారలింగస్యత్రివిధం శ్రూయతాంక్రమాత్। సదాచారస్తునియతోగణాచారస్తతఃపరం ॥౮॥

తా॥ ఓపార్వతి యాచార లింగము యొక్కస్థలము మూడువిధములుక్రమముగా వినుమీ సదాచారము నియతాచారము. గణాచారము నియు-

శ్లో॥ సజ్జనశ్శివభక్తశ్చ యేన మార్గేణ సర్వదా। తుష్టస్తోషయతే దేవిసదాచారస్సవైస్మృతః ॥౯॥

తా॥ ఓపార్వతి సజ్జనుడైన శివభక్తుడు నేమార్గముచేత నైన సదాకాలను తృప్తిబొంది సంతోషించ జేయుచున్నాడో వాడు సదాచారియనిదలపబడినది.

శ్లో॥ యస్తుస్వస్వీకృతాచార లోపేశపథయత్యహం। త్యజామ్యసూనీతి సవైనియతాచార ఈరితః ॥౧౦॥

తా॥ ఎవ్వడు తానుపరిగ్రహించి నటువంటి యాచార లోపము దు ప్రాణములు విడుతునని ప్రతిజ్ఞచేయుచున్నాడో వాడునియతాచారుడనిపలుకబడుచున్నది.

శ్లో॥ గురులింగాదివిషయాం తచ్ఛ్రాప్యందూషితంయది। శృతవాక్ శిక్షయామీతిగణాచారస్సహిస్మృతః ॥౧౧॥

తా॥ ఎవ్వడుగురులింగాది విషయదూషణ మాయెనేని యదివిని శిక్షించుచున్నానని యుద్యమించు చున్నాడో వాడు గణాచారియనితలపబడినది-

## ❁ ప్రసాదలింగ స్థలము. ❁

శ్లో॥ ప్రసాదలింగ త్రైవిధ్యమపిశృణువరాననే । శుద్ధసిద్ధః ప్రసిద్ధశ్చ భేదస్త్రైచ్చపాహమథోచ్యతే ॥౧౨॥

తా॥ ఓ పార్వతీ ప్రసాదలింగము మూడువిధము లైనను శుద్ధ.సిద్ధ.ప్రసిద్ధము వీనియొక్క భేదమనంతరము చెప్పబడుచున్నది.

శ్లో॥ అదౌగురువరాజ్ఞాత్వాత తస్యాత్యర్థాసభావతః । తద్భుక్తశేషభోగోయ స్సశుద్ధఃపరికీర్తితః ॥౧౩॥

తా॥ ఎవ్వడు మొదలుగురు వరునివల్ల తృప్తితెలిసిపిమ్మటభృత్యభావమువలన గురుభక్త శేషము భుజించునోవాడుశుద్ధ ప్రసాదియని కీర్తించబడినది.

శ్లో॥ జ్ఞాత్వాలింగత్రియం సమ్యక్ తత్తైక్యంచవరాననే । లింగార్పిత ప్రసాదోయం సిద్ధఇత్యాహురాస్తికాః ॥౧౪॥

తా॥ ఓ పార్వతి యిష్టలింగార్పితమైన ప్రసాదమఃఇష్టప్రాణభావలింగముల రూపురుచితృప్తిలైస్యైక్యము నెరిగిభుంజించుచున్నాడోయదియాస్తికులు సిద్ధప్రసాదమని చెప్పుచున్నారు.

శ్లో॥ గురులింగచరాణాంచాప్యభేదాద్భక్తిమానపి । యఃపరిత్యక్తవిషయః ప్రసిద్ధస్సఉదాహృతః ॥౧౫॥

తా॥ ఎవ్వడుగురులింగ జంగములయొక్క యభేదమువలన భక్తివంతుడైవిషయము పెకువిడిచి భుజించుచున్నాడో వాడుప్రసిద్ధప్రసాదియనియు దాహరింపబడినది.

## — ❁ జంగమలింగస్థలం. ❁ —

శ్లో॥ చరలింగస్థల స్యాస్యస్వరూపంకథయామితే । స్వయంచరంపరం చేతిత్రైవిధ్యం సముపాగతం ॥౧౬॥

తా॥ ఓ పార్వతీయీజంగమ లింగముయొక్క స్థలస్వరూపమునీకు చెప్పుచున్నాను- స్వయము- చరము- పరమనిమూడు విధములరాబడినది.

శ్లో॥ లింగలాంఛనసంయుక్తం మహోచ్ఛ్వత్యవివర్జితం । కేవలానందరూపం యస్సస్వయంలింగమీరితం ॥౧౭॥

తా॥ ఎవ్వడు వెలుపలి కృత్యమువిడిచినవాఁడై యంతరంగలింగధ్యానములలోఁ గూడుకొనిన్ని కేవలానందరూపుఁడైయున్నాఁడో వాఁడుస్వయ లింగమని చెప్పబడుచున్నది.

శ్లో॥ స్వచ్ఛందచారీస్వాభిన్న లింగరూపోని రాకులః । లింగన్యస్తకలాశుద్ధిస్సచరం లింగముచ్యతే ॥౧౮॥

తా॥ ఎవఁడుస్వతంత్రముగా దిరుగుచునభిన్నలింగరూపుఁడై చరక లింగమందు కలాశుద్ధుఁడౌచున్నాఁడో అతఁడుచరలింగమని చెప్పఁడినది.

శ్లో॥ నిర్ద్వంద్వోవిహీనసదాస్థాణుగతాగత వివర్జితః। జ్యోతిర్లింగస్వరూపోయః పరలింగముదాహృతం ॥౧౯॥

తా॥ ఎవ్వఁడు సుఖదుఃఖములు రెండులేక నెప్పుడు మోటువనెసునాగమన వర్జితుఁడై జ్యోతిర్లింగరూపుఁడగుచున్నాఁడో అతఁడుపరలిగమనియు డాహరింపబడినది.

— ❋ లింగ స్థలం ❋ —

శ్లో॥ శివలింగస్వరూపం తేవక్ష్యామిశృణుపార్వతి । ఇష్టలింగంప్రాణలింగం భావలింగమితిత్రిధా ॥౨౦॥

తా॥ ఓపార్వతి శివలింగస్వరూపము నీకొఱకు చెప్పుచున్నాను వినుము- ఇష్టలింగము- ప్రాణలింగము- భావలింగమని మూఁడువిధములు

శ్లో॥ దీక్షాంవిధాయసగురు ర్నాయల్లింగం ప్రతిపాదితం । మంత్రోపదేశసహితమిష్టలింగముదాహృతం ॥౨౧॥

తా॥ ఏలింగము గురువుచేత దీక్షయుచేసి మంత్రోపదేశ సహితముబోధింపబడినదో యదిఇష్టలింగమనియు దాహరింపబడినది.

శ్లో॥ త్యక్త్వదేహేంద్రియగుణం శివార్పితనిజాంతరం । శివఏవమనోలీనం ప్రాణలింగంతదుచ్యతే ॥౨౨॥

తా॥ దేహేంద్రియగుణములవిసర్జించి తన యంతఃకరణమును వాపడాలను వేకశివుపటమునెదైస్థైర్యము చేయుచున్నాన్ని ప్రాణలింగమని చెప్పబడినది.

శ్లో॥ జాగ్రదాదిష్వవస్థాసు జ్యోతిర్లింగైక మానసం । అజ్ఞానవినివృత్తంతద్భావలింగం తదుచ్యతే ॥౨౩॥

తా॥ జాగ్రస్స్వప్నసుషుప్త్యవస్థలయందు జ్యోతిర్లింగైక మానసమైయజ్ఞానినివృత్తి గలుగునది యేభావలింగమని చెప్పబడినది.

— ❀. మహాలింగస్థలం. ❀ —

శ్లో॥ మహాలింగస్థలం చాపిత్రిధాభిన్నం శృణుప్రియే । పిండజంప్రథమంప్రోక్తమండజంచతతఃపరం ॥౨౪॥ బిందుర్వాకాశంతతో జ్ఞేయమేషాంలక్షణముచ్యతే॥

తా॥ ఓపార్వతి మహాలింగస్థలము మూడువిధములు వినుము- మొదలుపిండజము- అండజము- బింద్వాకాశము విటియొక్క లక్షణముచెప్పబడుచున్నది.

శ్లో॥ దేహోదేవాలయః ప్రోక్తోజీవోదేవస్సదాశివః ॥౨౫॥ ఇతినిశ్చితసద్భావఃపిండజంలింగముచ్యతే ॥

తా॥ దేహముదేవాలయము జీవుడు దేవుడైన సదాశివుడని నిశ్చయించి నటువంటి సద్భావమేపిండజ లింగమని చెప్పబడు చున్నది.

శ్లో॥ పీఠికాపృథివీలింగమాకాశం సృష్టికారణం ॥౨౬॥ నిస్సందేహమిదంజ్ఞానమండజం లింగమీరితం॥

తా॥ భూమియేపీఠము సృష్టికారణమైనాకాశమేలింగముసందేహములేదనె జ్ఞానమండజ లింగమని చెప్పబడుచున్నది.

శ్లో॥ ధ్యాత్వాత్మానమథాకాశేధ్యాత్వాకాశం తథాత్మని ॥౨౭॥ ఆత్మాకాశమయంలింగంబింద్వాకాశముదాహృతం॥

తా॥ ఆత్మయందు నాకాశమునుధ్యానించియాకాశమందాత్మని చింతుంచునదియే యాత్మాకాశమయు బింద్వాకాశలింగమని యుదాహరించబడినది.

— ❀ లింగాంగ లక్షణం ❀ —

శ్లో॥ లింగస్థలం శివస్సాక్షాజ్జీవోహ్యంగస్థలంభవేత్ । లింగాంగస్థలయోరైక్యం శివజీవైక్యమేవహి ॥౪॥

తా॥ శివుడులింగస్థము ప్రత్యక్షము జీవుడంగస్థల మాచున్నాడు లింగాంగ స్థలములయొక్క- ఏక్యమే శివజీవైక్యమని తెలియవలసినది.

శ్లో॥ లింగస్థలంత్రిధాజ్ఞేయం తద్భేదంవర్ణ్యతేక్రమాత్ । ప్రథమం భావలింగం తుద్వితీయం ప్రాణలింగకం ॥౨॥ తృతీయమిష్టలింగ స్యాదిత్యేతే త్రివిధస్మృతం॥

తా॥ శివస్వరూపమైన లింగస్థలము మూడువిధములని తెలియవలయునట్టి భేదముక్రమముగా వర్ణింపబడినది మొదటిది భావలింగము రెండవదీ ప్రాణలింగము మూడవదిష్టలింగ మాచున్నది యివిమూడువిధములు నేరుంగవలయు.

శ్లో॥ అంగస్థలం త్రిధాజ్ఞేయం తద్భేదం వర్ణ్యతేక్రమాత్ ॥౩॥ యోగాంగం ప్రథమం ప్రోక్తం భోగాంగం తుద్వితీయకం । త్యాగాంగంతుతృతీయం స్యాదిత్యేతేత్రివిధాస్మృతాః ॥౪॥

తా॥ జీవస్వరూపమైన- అంగస్థలము మూడువిధములని తెలియవలయునట్టి భేదమువరుసగా వర్ణింపబడినది మొదటిదియోగాంగము రెండవదిభోగాంగము మూడవది త్యాగాంగమాచున్నది యివిమూడు విధములు నెరుంగవలయు.

శ్లో॥ భావలింగం పరంతత్వం ప్రాణలింగం తుసూక్ష్మకం । ఇష్టలింగం భవేత్థూలమితితత్వవిదోవిదుః ॥౫॥

తా॥ భావలింగము- పర తత్వము అనగా కారణము) ప్రాణలింగము- సూక్ష్మము-ఇష్టలింగము స్థూలమాచున్నదని తత్వవేత్తలు నేరుంగుచున్నారు.

శ్లో॥ త్యాగాంగం విశ్వఏవస్యాద్భోగాంగం తైజసోభవేత్। యోగాంగంప్రాజ్ఞఏవస్యాదితితత్వవిదోవిదుః ॥౬॥

తా॥ త్యాగాంగము విశ్వుడాచున్నాడు- భోగాంగము తైజసుడగును యోగాంగము ప్రాజ్ఞుడాచున్నాడని తత్వవేత్తలు నెరుంగుచున్నారు.

శ్లో॥ యోగాం[illegible]త్మనో[illegible]గస్య కారణాంగమితీరితం । భోగాం

గమంతరం గత్వాసూత్మ్నాంగమితిసుస్మృతం ॥౧౦॥ త్యాగాం

గం బాహ్యకం గత్వాస్థూలాంగమితిలక్ష్యతే॥

తా॥ ఆత్మమదు[అనగా ఆత్మ] యోగాంగము నేనుషుప్తినిబొం

దికారణాంగమనిచెప్పబడినది భోగాంగమనేస్వప్నముబొందిసూత్మ్నాం

గమని చెప్పబడినది- త్యాగాంగమనేజాగ్రితను బొందిస్థూలాంగమనిల

క్షింపబడినది.

శ్లో॥ శరీరప్రాణజీవానాం త్రియాణాం భేదకంక్రమాత్॥౧౧॥బిందు

నాదకళాభేదం లింగత్రియముపాదిశత్॥

తా॥ శరీరప్రాణజీవము లైనటువంటి మూటియొక్క భేదము

క్రమముగా బిందునాదకళలభేదముక్షప్రాణ భావలింగత్రియమును

యుపదేశించెను-

శ్లో॥ ఇష్టలింగం తుబాహ్యాంగప్రాణలింగం తథాంతరే ॥౧౨॥ భా

వలింగం తథైవాత్మా ఆత్మాంగసుప్రతిష్ఠితం । విశ్వాజాగ్రదవ

స్థాయాం స్వప్నాఖ్యాయాం తుతైజసః॥౧౩॥ ప్రాజ్ఞోసుషుప్త్య

వస్థాయాంలింగత్రయముపాసతే॥

తా॥ ఇష్టలింగముబాహ్యమందు- ప్రాణలింగముహృదయమందు

భావలింగము ఆత్మయందు జాగ్రదవస్థయందు విశ్వుడనియు స్వప్నావ

స్థయందు తైజసుడనియుసుషుప్త్యవస్థయందుప్రాజ్ఞుడనియు పూర్వోక్త

లింగత్రియమును సేవించుచున్నాడు.

— ❀ షడావధానం ❀ —

శ్లో॥ అంగంచలింగంచ ముఖంచహస్తం భక్తిశ్చశక్తిశ్చతదర్పణంచ।

ప్రసాదిత్యష్టవిధస్థలానిప్రతి స్థలంషడ్విధసంజ్ఞికాని॥౧॥

తా॥ భక్తస్థలమాదైక్యస్థలమువరకు-ఆరుస్థలములు ప్రతిస్థల

మాదష్టవిధలక్షణము లెట్లంటె- అంగము-లింగము- ముఖము, హస్తము

భక్తి- శక్తి- అర్పణ- ప్రసాదమనియు.

శ్లో॥ పృస్వా(?)ంగలింగమాచారం నాసాస్యం చిత్తహస్తకం । దృఢభ

క్తిక్రియాశక్తిః స్యాత్ ద్రాపర్పణప్రసాదభాక్ ॥౨॥

తా॥ పృథివియంగము- ఆచారలింగము- ఘ్రాణముఖము- చిత్తహస్తము- దృఢభక్తి- క్రియాశక్తి- గంధార్పణము- భక్తప్రసాదుండు.

శ్లో॥ జలాంగం గురులింగంచ జిహ్వాస్యం బుద్ధిహస్తకం । నిష్ఠాభక్తి జ్ఞానశక్తి రసార్పణం ప్రసాదభాక్ ॥౩॥

తా॥ జలాంగము- గురులింగము- జిహ్వాముఖము- బుద్ధిహస్తము నిష్ఠాభక్తి- జ్ఞానశక్తి- రసార్పణము- మాహేశ్వరప్రసాది.

శ్లో॥ తేజాంగం శివలింగంచ నేత్రాస్యంనిరహంకృతం । సావధాన భక్తిరిచ్ఛాశక్తిరూప ప్రసాదభాక్ ॥౪॥

తా॥ తేజాంగము- శివలింగము- నేత్రముఖము- నిరహంకారహస్తము- సావధానభక్తి- ఇచ్ఛాశక్తి- రూపార్పణము ప్రసాదప్రసాది.

శ్లో॥ వాయ్వంగం చరలింగంచత్వగాస్యంసుమనఃకరం । భక్తిస్సానుభవాశక్తిరాదిస్పర్శ ప్రసాదభాక్ ॥౫॥

తా॥ వాయ్వాంగము- జంగమలింగము- త్వక్ ముఖము- సుమనహస్తము- అనుభవభక్తి- ఆదిశక్తి- స్పర్శార్పణము ప్రాణలింగిప్రసాది.

శ్లో॥ వ్యోమాంగంప్రసాదలింగంశ్రోత్రాస్యం జ్ఞానహస్తకం । ఆనందభక్తిశ్శక్తిస్తుపరా శబ్దఃప్రసాదభాక్ ॥౬॥

తా॥ ఆకాశాంగము, ప్రసాదలింగము, శ్రవణముఖము, జ్ఞానహస్తము, ఆనందభక్తి, పరాశక్తి, శబ్దార్పణము, శరణప్రసాది.

శ్లో॥ ఆత్మాంగంచమహాలింగంహృదాస్యంభావహస్తకం । భక్తిస్సమరసాశక్తిశ్చిత్తృప్తిశ్చప్రసాదభాక్ ॥౭॥

తా॥ ఆత్మాంగము- మహాలింగము- హృదయముఖము- సద్భావహస్తము- సమరసభక్తి- చిచ్ఛక్తి- తృప్త్యర్పణము- ఐక్యప్రసాది.

—— ॐషట్స్థలలక్షణంॐ——

శ్లో॥ భక్తోమాహేశ్వరశ్చైవ ప్రసాదీప్రాణలింగకః । శరణశ్శివ ఐక్యశ్చషట్స్థలంమమపార్వతి ॥౧॥

తా॥ ఓపార్వతి- భక్తుడు- మాహేశ్వరుడు- ప్రసాది- ప్రాణలిం

గుడు శరణుడు ఐక్యుడు నాయొక్క షట్స్థలములు ॥

శ్లో ॥ అథైషాంలక్షణంవక్ష్యే శృణుష్వసుసమాహితా । త్యక్త్వాభిమానందేహాదౌ భక్త ఇత్యుచ్యతేబుధైః ॥ ౨ ॥ తచ్చిత్తమచలంయస్యనవై మాహేశ్వరఃస్మృతః । చిత్తశుద్ధిభవేద్య స్యసప్రసాదీభవత్యసౌ ॥ 3 ॥ త్యక్త్వాజీవభ్రమశ్చాయం లింగాత్మాప్రాణలింగికః । శివంనిశ్చిత్యనిశ్చింత స్సానందశ్శరణోభవేత్ ॥ ౪ ॥ శివజీవోభయభ్రాంతి రహితశ్చైక్యముచ్యతే ॥

తా ॥ మొదలు వీరియొక్క లక్షణము చెప్పుచున్నాను మంచిగా ఏకాగ్రచిత్తముచే వినుము దేహాము మొదలైన దానియందు నభిమానము (అనగా నాదియనేమమకారము) విడిచినటువంటి వాన్ని భక్తుడని విద్వాంసులచేత చెప్పబడుచున్నది ఎవ్వనియొక్క చిత్తమచలము (అనగా దృఢతర) మానో వాడు మాహేశ్వరుడని తెలియవలయు ఎవ్వనియొక్క చిత్తశుద్ధి (అనగా శుద్ధాంతఃకరణ) యానో వాడు ప్రసాదియాచున్నాడు ఎవడు జీవాభిమానము విడిచి లింగాత్ముడౌనో ప్రాణలింగుండని తెలియవలయు ఎవ్వడు శివున్ని నిశ్చయించి (అనగాదృఢీకరించి) నిశ్చింతానందుడౌనో వాడు శరణుడౌను ఎవ్వడు శివుడుజీవుడనే జ్ఞప్తి రాహిత్యుడౌనో వాడైక్యుడని చెప్పబడుచున్నది ॥

శ్లో ॥ సదాచారశ్శివేభక్తి ర్లింగజంగమవైకధీః । లాంఛనే శరణేభక్తి ర్భక్తిస్థలమనుత్తమం ॥ ౧ ॥

తా ॥ సదాచారము శివునియందు భక్తి లింగజంగములం దేకభావము శివలాంఛనమందు భక్తిగలిగియుండుట భక్తస్థలముత్తమము ॥

శ్లో ॥ పరస్త్రీయంపరార్థంచ వర్జయన్ భావశుద్ధిమాన్ । లింగనిష్ఠానియుక్తాత్మా మాహేశ్వరమహాస్థలం ॥ ౨ ॥

తా ॥ పరస్త్రీని పరద్రవ్యమును వర్జించుచు పరిశుద్ధభావము గలవా

డై లింగనిష్ఠ యుక్తాత్ముండగు వాడు మాహేశ్వర మహాస్థలము॥
శ్లో॥ లింగార్పితపదార్థంచ సుభోగీలింగమోహితః। అన
ర్పితవివర్జీచ ప్రసాదీస్థలముచ్యతె ॥ ౩ ॥
తా॥ లింగమోహితుడై లింగార్పిత పదార్థమును భుజించుచు లిం
గానర్పిత పదార్థము విడిచిన వాడు ప్రసాదిస్థలమని చెప్పబడుచు
న్నది ॥
శ్లో॥ వాయుప్రాణగుణేలింగం లింగప్రాణసమాహితః। సుఖ
దుఃఖోభయంనాస్తి ప్రాణలింగీస్థలంభవేత్ ॥ ౪ ॥
తా॥ ప్రాణవాయువు గుణమందు లింగముభావించి లింగప్రాణస
మాహితుడై సుఖదుఃఖములు రెండులేని వాడే ప్రాణలింగ స్థలమా
ను ॥
శ్లో॥ పతిర్లింగంసతీచాహం హృదియుక్తస్స్వయంప్రభుః।
ప్రాపంచికసుఖంనాస్తి శరణస్థలముత్తమం ॥ ౫ ॥
తా॥ ఆత్మాంతర్యామియైన పరమాత్ముండు తానే లింగస్వరూప
నైన మగడు నేను భార్యనని లౌకిక సుఖము లేనటువంటివాడే శరణస్థ
ల ముత్తమము ॥
శ్లో॥ షడూర్మయశ్చషడ్భావా నాస్తిచాష్టవిధార్చనం। ని
ర్భావోనిజలింగైక్య శ్శిఖికర్పూరయోగవత్ ॥ ౬ ॥
తా॥ షడూర్ములు షడ్భావము లష్ట విధార్చనములు లేక భావహీ
న్యుడై శిఖికర్పూర సంయోగమువలే నిజలింగైక్యుడో వాడే నైక్య
స్థలము ॥

## —) దేహీ దేహలక్షణం (—

శ్లో॥ సాధుసాధుత్వయావత్స యదుక్తంభవతాధునా। వక్ష్యే
హంలింగదేహిత్వం సమాహితమనాశ్శృణు ॥ ౧ ॥
తా॥ ఓయికుమారుడా నీచేత నిపుడు నేది పలుకబడినదో మంచిది
మంచిది లింగదేహిత్వము చెప్పుచున్నాను సావధాన మనస్సులో
వినుము ॥
శ్లో॥ జడోదేహఇతిప్రోక్తో జన్మస్థితిలయాత్మకః। జన్మాది

దుఃఖసంతప్తో జీవోదేహీతికథ్యతె ॥ ౨ ॥

తా॥ జన్మస్థితిల యాత్మకమై నటువంటి దేహముజడము (అనగా చైతన్యము లేనిది) దేహమని చెప్పబడినది జన్మము మొదలుకొని దుఃఖసంతప్తుడై నటువంటి జీవుడు దేహియని చెప్పబడుచున్నది ॥

శ్లో॥ ఆవృతోమాయయా జీవో తుషకంచుకవత్యథా। స్వస్వరూపంశివాంశత్వం నవేదశంభుమాయయా ॥ ౩ ॥ దేహేంద్రియాదిసంసారేమ మ్రాంత్యాచసంయుతః । అహమిత్యభిమానే నబద్ధోజీవస్స్వకర్మణా ॥ ౪ ॥ కర్మణాసంభవో దేహో జడోయంపాంచభౌతికః । పాంచభౌతికదేహేస్మిన్ బద్ధోజీవస్స్వకర్మణా ॥ ౫ ॥ దేహాభిమానసంబంద్ధో జీవో దేహీతికధ్యతే ॥

తా॥ జీవుడు, పొట్టుచేత విత్తులు, కుబుసముచేత సర్పము, నెట్లాగు కప్పబడినవో అట్లాగె మాయచేత కప్పబడిన వాడు శివాంశత్వమైన తనస్వరూపమును తెలియక దేహేంద్రియాది మొదలైనవ్యాపారమందు నాదియనే మిథ్యత్వము కూడుకొన్న వాడై నేననే యభిమానముచేత జీవుడు తనకర్మచే తానుకట్టబడి కర్మముచే పంచభూతాత్మక మగునీజడ దేహముగలిగి పంచభౌతిక దేహమందు నిజకర్మముచె బద్ధుడై దేహాభిమాన సంబంధుడైన జీవుండు దేహియని చెప్పబడుచున్నది ॥

శ్లో ॥ అత్యంతమలినో దేహో దేహీచాత్యంతనిర్మలః । ఉభయోరంతరంజ్ఞాత్వా కస్యశౌచంవిధీయతె ॥ ౬ ॥

తా॥ మిక్కిలి మలినమై నటువంటి దేహము మిక్కిలి నిర్మలమైన టువంటి దేహియు నుభయులయొక్క తారతమ్యమెరింగి దేనికిపరిశుద్ధము విధింప బడుచున్నది ॥

శ్లో ॥ జీవభావంపరిత్యక్తుం శివత్వంప్రాప్తుమిచ్ఛయా ॥ ౭ ॥ శ్రీగురోకృపయాలింగం ధృత్వా దేహీనిరంతరం । లింగదేహీ శివాత్మాయం లింగాచారీనలౌకికః ॥ ౮ ॥ తత్సర్వాంగంలింగమయం లింగేనసహాభుంజతె । లింగాంగీలింగసర్వాణి లింగాత్మాలింగమానసః ॥ ౯ ॥ లింగేంద్రియోలింగభోగీ లింగ

యోగీసకథ్యతే ॥

తా ॥ ఎవ్వడు దేహీ (అనగానాత్ముండు) జీవభావమిడిచి శివత్వము పొందుటకిచ్ఛచేత శ్రీగురువుయొక్క కృపతోనిరంతరము లింగముధ రించి లింగజీవుండు లింగాత్ముడు లింగాచారియైన నితడు లౌకికుడుకా డు అట్టిసర్వాంగ లింగమయుండు లింగముతోగూడి భుంజించువాడు లింగాంగుడు లింగప్రాణుండు లింగాత్ముడు లింగమానసుండు లింగే ద్రియుడు లింగభోగోపభోగియై నటువంటి వాడు లింగయోగియని చెప్పబడుచున్నది ॥

—( శివజీవసంబంధం )—

శ్లో ॥ అద్వైతినోవీరశైవా స్త్వహంబ్రహ్మేతినిశ్చితాః । ఆ రాధయంతివా తేత్వాం తూష్ణీంతిష్ఠంతివావిభో ॥ ౧ ॥ యథా నిస్సంశయంచే తస్తథాకురుమహేశ్వర । ఇతిపృష్టామహాదే వో జగాదవరవర్ణినీం ॥ ౨ ॥

తా ॥ ఓస్వామి యద్వైతులై నటువంటి వీరశైవులు, నేనెబ్రహ్మనని నిశ్చయించి నటువంటివారు, మిమ్ముల పూజించుచున్నారా, ఊరకు డియున్నారా, ఇట్లాటినాయొక్క మనోసంశయము నట్లాగెనిస్సం శయము చేయుమని యడగబడిన పార్వతినిగూర్చి శంకరుడుపలి కెను ॥

శ్లో ॥ వీరశైవక్రమంధర్మం శృణుకల్యాణిసాంప్రదం । యేనవి జ్ఞానమాత్రేణ శివజీవైక్యమాప్నుయాత్ ॥ ౩ ॥ భావాద్వై తంక్రియాద్వైతం వీరశైవేప్రశస్యతే । అద్వైతంభావయేచ్చి త్తెక్రియాయాం ద్వైతమాశ్రయేత్ ॥ ౪ ॥

తా ॥ ఓపార్వతియిపుడు వీరశైవధర్మమును క్రమముగాను వినుము ఎ వ్వనిచె (నీధర్మ) తెలిసిన మాత్రముతోనె శివజీవైక్యము పొందుచు న్నాడు వీరశైవమందు భావాద్వైతమున్ను క్రియాద్వైతమున్ను ప్ర శస్తమూచున్నది (గాని) మనస్సుయందద్వైతము భావించ వలసినది క్రియయందు ( అనగా హరగురుచరా రాధనయందు ) ద్వైతమా శ్రయించవలసినది.

శ్లో ॥ బాహ్యకర్మాణి సంత్యజ్యమ మార్చన విధీరితః । స
త్క్రియాస్సకలానిత్యం వీరశైవఃకరోత్యలం ॥ ౫ ॥ మయ్యే
వసకలంకర్మ సమర్ప్యదృఢభావతః । నాకాంక్షతిఫలంకిం
చి ద్వీరశైవోవిరాగవాన్ ॥ ౬ ॥

తా ॥ శాస్త్రవిధియు బాహ్యకర్మములు విడిచినాయొక్క పూజయు చెప్పుచున్నది (యల్లాగె) వీరశైవుడు సమస్తమైన సత్క్రియలు నిత్యము చేయుచున్నాడు అట్టివైరాగ్యవంతుడు దృఢభావమువలన సర్వకర్మములు నాయందే సమర్పించి కొంచమైన ఫలము కోరకున్నాడుచాలు ॥

శ్లో ॥ అంగలింగైక్యసంబంధా ద్వీరశైవోభవేన్నరః । జీవోం
గంలింగమీశస్స్యాత్త యోరైక్యంహిసంగతిః ॥ ౭ ॥

తా ॥ మానవుడంగ లింగైక్య సంబంధము వలన వీరశైవుడౌను జీవుడంగము శివుడులింగమౌను అంగలింగైక్యమె సంయోగము (అనగా సద్గతి) ॥

శ్లో ॥ యావద్భేదమతిస్తావ త్సంసారో నైవనశ్యతి । భేదబా
ధకమద్వైతం వీరశైవాఖ్యమంగనే ॥ ౮ ॥

తా ॥ ఓపార్వతి యంతమట్టుకు మనోభేదమో నంతవరకు సంసారము నశించదు భేదబాధకమైన శివాద్వైతమే వీరశైవమని తెలియదగు ॥

శ్లో ॥ శివఏవస్వయంలింగ మాత్మైవాంగస్థలంభవేత్ । త
యోశ్శివాత్మనోస్సమ్యగ్యోగస్సంయోగఏవహి ॥ ౯ ॥ ఆత్మా
యంకేవలంశుద్ధ శివస్యాంశస్సదామలః । నిత్యోనిరంజన
శ్శాంతస్తస్మాదాత్మస్వయంశివః ॥ ౧౦ ॥ సోయమాత్మాశి
వాంగస్యా చ్ఛివేనాంగికృతత్వతః । సర్వజ్ఞత్వాదిభేదైశ్చ
శివాంగమిదమిష్యతే ॥ ౧౧ ॥

తా ॥ శివుడేస్వయము లింగస్థలమౌను ఆత్మనేయంగస్థలమౌను ఆ శివాత్మలయొక్క పరస్పర కలవడమె యైక్యము (అనగాఏకత్వము) ఈయాత్మ కేవలశుద్ధుడు శివాంశుడు నిత్యనిర్మలుడు శాశ్వితుడు నిరం--

జనుడు శాంతుడు అందువలన స్వయము శివుడు శివునిచే తంగీకార ము వలన నీయాత్మ శివాంగమౌను సర్వజ్ఞత్వాది భేదములచేత నీ యాత్మశివాంగమౌచున్నది ॥

శ్లో ॥ యద్యల్లింగస్థలం సాక్షాచ్ఛివోభవతిశక్తితః । తత్తదం గస్థలంసాక్షా దాత్మాభవతిభక్తితః ॥ ౧౨ ॥

తా ॥ ఏదేదిలింగస్థలము (అనగా ఇష్టలింగాది మహా లింగాంతము) శక్తియుతముగా ప్రత్యక్షము శివుడౌచున్నాడు ఆయాయంగస్థలము (అనగా యోగాంగాది ఐక్యాంతము) భక్తియుతముగా ప్రత్యక్షము నాత్మయౌచున్నది ॥

శ్లో ॥ ఉపాస్యోపాసకౌపూజ్య పూజకౌ సాధ్యసాధకౌ । గురుశిష్యౌశివాత్మానౌ నిగద్యేతేమహాత్మభిః ॥ ౧౩ ॥

తా ॥ ఎట్లాగుపాస్యోపాసకులు పూజ్యపూజకులు సాధ్యసాధకులు గురుశిష్యులో అట్లాగె శివాత్మలని మహాత్ములచేత చెప్పబడుచున్నది॥

శ్లో ॥ సమ్యగ్యోగోహిసంయోగోభవేల్లింగాంగయోస్సదా । సంయోగమేవసాయుజ్య రూపాముక్తిర్నచాపరా ॥ ౨౪ ॥

తా ॥ నిరంతరము శివాత్మలైన లింగాంగముల యొక్క అన్యోన్య సంయోగమే ఐకత్వమౌను ఐకత్వమే సాయుజ్యము దానికంటెవేరె ముక్తి లేదు ॥

శ్లో ॥ గవాంసర్పిః శరీరస్థం నకరోత్యాత్మపోషణం । విక్రుతం కర్మరచితం పునస్తాంతాంతుభేషజం । ఏవమంతశ్శరీరస్థం స ర్పిః పత్పరమేశ్వరః । వినాచోపాసనం దేవోనకరోతిహితం నృణాం ॥ ౧౬ ॥

తా ॥ ఘృతము గోవులయొక్క శరీరమందున్నదై తనరక్షణ (అన గా తనస్వరూపము) చేసుకొనజాలదు కర్మయత్నము గానువికారమై నపాలు మళ్లిదాన్నిదాన్ని ప్రతికారము చేయగా ఘృతముసిద్ధించు నో అట్లాగెఘృతమువలె శరీరములో పలవున్న పరమేశ్వరుడు నుపా సనము వినా మానవులకు హితముచేయ కుండుచున్నాడు ॥



) షట్స్థల ప్రకరణము (

శ్లో ॥ శిష్యపుత్రఇతిప్రోక్త శ్శిష్యశిక్షత్వయోగతః । జిహ్వా లింగాన్మంత్రశుక్లం కర్ణయోనౌనిషిచ్యవై ॥ ౧ ॥ జాతఃపుత్రోమంత్రపుత్రః పితరంపూజయేద్గురుం । నిమజ్జయతిపుత్రం చ సంసారేజనకఃపితా ॥ ౨ ॥ సుతారయతిసంసారా ద్గురుర్వైసాధకఃపితా । ఉభయోరంతరంజ్ఞాత్వాపి తరంసంప్రపూజయేత్ ॥ 3 ॥

తా ॥ గురునికి శిక్షయోగము వలన శిష్యుండు పుత్రుండని చెప్పబడినది జిహ్వాశిశ్నము వలన మంత్రవీర్యము కర్ణయోనియందు విడిచినను పుట్టినపుత్రుండు మంత్రపుత్రుండు తండ్రియైన గురువును పూజించవలయును కన్నతండ్రి కొడుకును సంసారమందు ముంచుచున్నాడుసాధకుడైన తండ్రి సాంసారమునుండి తరింపజేయుచున్నాడు (కనక) ఉభయులయొక్క తారతమ్యము నెరింగి తండ్రినిపూజించ వలసినది॥

శ్లో ॥ యోగురుస్సశివఃప్రోక్తో యశ్శివస్సగురుస్మృతః । గురుర్వాశివఏవాథ విద్యాకారేణసంస్థితౌ ॥ ౪ ॥ యథాశివస్తథావిద్యా యథావిద్యాతథాగురుః । తస్మాత్సర్వప్రయత్నేన తస్యాజ్ఞాంశిరసావహేత్ ॥ ౫ ॥

తా ॥ ఎవ్వడు గురువో వాడు శివుడని చెప్పబడినది యెవ్వడు శివుడో వాడు గురువని చెప్పబడినది గురువెకాని శివుడెకాని జ్ఞానాకారముచేనుండి యున్నారు ఎట్లశివుడో నట్లజ్ఞానము నెట్లజ్ఞానమో నట్లగురువు నందువల్ల సర్వప్రయత్నముచే గురువాజ్ఞను శిరసావహించ వలసినది ॥

శ్లో ॥ తస్మాద్గురుముఖాత్కర్మ జ్ఞానంచాపివిశేషతః । జ్ఞాత్వాకర్తవ్యమఖిలం భోగమోక్షవివృద్ధయె ॥ ౬ ॥

తా ॥ అందువలన గురుముఖము నుంచి క్రియయైన జ్ఞానమైనను విశేషముగా తెలిసి భోగమోక్ష వృద్ధికొరకు సమస్త కార్యములు చేయవలసినది ॥

సూ ॥ హృదబ్జమధ్యేయల్లింగం ధృత్వాజ్యోతిషింవిశంతి అత్యాశ్రమస్థాపరిణామ్యైవ నర్వేలింగాంగస్యా మోక్షమా

గ్నైష్ఠికనిష్ఠాః తే బ్రహ్మలోకేషుపరాంతకాలె శివప్రసాదాత్ప
రిముచ్యంతి సర్వేలింగాంగసామరస్యాచ శరీరేలింగధారణాత్
నియమేనైవధృత్వాతె ముక్తాసంసారబంధనాత్ ॥

తా ॥ అత్యాశ్రమస్థులైనటువంటివారు హృత్కమల మధ్యమందే ప్రాణలింగమో దాన్ని ధరించి జ్యోతిర్మయ లింగమందు పొందుచున్నారు సమస్త ప్రపంచ భ్రాంతులు విడుచుచున్నారు లింగాంగప్రకాశమో త్తమా గ్నైష్ఠికనైష్ఠికులు వారు పరాంత కాలమందు శివప్రసాదము వలస బ్రహ్మలోకములయందు విడుచుచున్నారు (అనగా సాయుజ్యము పొందుచున్నారు) నియమముచేత లింగముధరించి శరీరమందు లింగధారణ వలన లింగాంగ సామరస్యము వలన వారు సంసారబంధమునుంచి ముక్తులౌచున్నారు ॥

శ్లో ॥ అతఏవాశ్రమాచార రాహిత్యంవీరశైవకె । అత్యాశ్రమీయధర్మాశ్చబహవో భాంతిచాగమే ॥ ౧ ॥

తా ॥ గనుకనే వీరశైవమందు క్రమక్రమ సోపానారూఢ కాలనిబిత ఆశ్రమాచారము రాహిత్యమైనది అత్యాశ్రమ ధర్మములు (అనగా కర్మకాండి సత్కర్మకాండి అత్యాశ్రమి జ్ఞానకాండియని యాశ్రమములు) ననేకమాగమ మందు ప్రకాశించుచున్నవి ॥

శ్లో ॥ వర్ణాశ్రమాపరిత్యక్త్వా లింగత్రయవిమిశ్రితం । సర్వాంగలింగసాహిత్యమతి వర్ణాశ్రమంభవేత్ ॥ ౨ ॥

తా ॥ వర్ణాశ్రమములు విడిచి (అనగా వీరశైవ వీరసామాన్య విశేషనిరాభారములని యన్యోన్య సామరస్యానుకూల వర్ణవిభాగను స్థాపించియైక మతమందు వివర్ణ బాధకము విడిచి) గురు లింగ జంగమ లింగ త్రయముగూడి సర్వాంగ లింగ సాహిత్యమైనదే యతివర్ణాశ్రమమౌను ॥

శ్లో ॥ వీరశైవాచారసంఘో వీర్యవత్తరఉచ్యతె । అభేదంచపురస్కృత్యధర్మాస్తేషుచవర్ణతాః ॥ 3 ॥ గురుర్లింగంజంగమశ్చత్రితయంచైకమేవహి । తతఏవపదోదాభి షేచనంశివలింగకే ॥ ౪ ॥ గురవంత్యభేదదృష్ట్యాత భేదకృత్వాపమ

ళ్ను తే । మనోయస్యతుసంలగ్నం శివేచైవచరేగురౌ ॥ ౫ ॥ సవిజ్ఞానీచవేదాంత జ్ఞానిశృతవిభాగవాన్ । మైర్భేదదృష్ట్యామర్త్యత్వంగురోర్లింగస్యచాశ్మతా ॥ ౬ ॥ కల్పితాజ్ఞానతత్త్వాస్తే తత్వజ్ఞానపరాఙ్ముఖాః। గురోశ్చరస్యచాభేదం లింగస్యచతథాభిదాం ॥ ౭ ॥ యోజానాతిసఏవాసౌ నీలకంఠోభవేద్భుధః । అస్మత్ప్రమాణజాలం తుజాగర్తికీరణాగమే ॥ ౮ ॥

తా ॥ ఓయిపండితుడా వీరశైవాచార సమూహము దృఢోత్సాహము వలె బలీయమని చెప్పబడుచున్నది నిర్భేదమును ముందరనునిచి వాటియందు ధర్మముల వర్ణించబడినవి గురువు లింగము జంగముమునొక్కటేయని యట్లాగె నిర్భేదదృష్టిచేత శివలింగమందు పాదోదకాభిషేకమున్ను చేయుచున్నారు భేదముచేసినవాడు పాతకమొందుచున్నాడు ఎవనియొక్క మనస్సు గురువుయందు లింగమందు జంగమందు కట్టబడినదో వాడు జ్ఞానుండు వేదాంతజ్ఞానుండు వేదవిభాగుండు నెవ్వారిచేత భేదదృష్టితో గురువునకు మనుషత్వము లింగమునకు శిలత్వము కల్పించుచున్నారో వారుతత్వము తెలియనివారు తత్వజ్ఞాన పరాఙ్ముఖులు నెవ్వడు గురువునకు లింగమునకు జంగమునకభేదము నెరెంగుచున్నాడో వాడె శివుడౌను మనయీప్రమాణసమూహము కీరణాగమమందు మేలుకున్నది ॥

శ్లో ॥ లింగమూలేపదద్వంద్వం లింగాగ్రేమస్తకస్మృతః । లింగపార్శ్వేబాహుయుగ్మం వర్తులంమధ్యమీరితం ॥ ౧ ॥

తా ॥ లింగము మొదటియందు రెండుపాదములు లింగముచివర శిరస్సు లింగపార్శ్వమందు రెండుభుజములు వర్తులము నడుమని చెప్పబడినది ॥

శ్లో ॥ శిరస్థానంలలాటంచ కర్ణద్వయమనంతరం । అంసయుగ్మంచహృదయం నాభిరిత్యష్టమంభవేత్ ॥ ౧ ॥ అథవా మస్తకంబాహూ హృదయంనాభిరేవచ । పంచస్థానాన్యమూన్యేవ హ్యుభయాస్మతత్వవిదోజనాః ॥ ౨ ॥

తా ॥ భస్మధారణ స్థానములు శిరస్సు నొసలు రెండుచెవులు రెం డుభుజములు హృదయము నాభియిట్టి యెనమిది స్థానములౌను (అథ వా) శిరస్సు రెండుభుజములు హృదయమునాభియైదుస్థానము లు భస్మతత్వజ్ఞులైన జనులు పలుకుచున్నారు ॥

వృ ॥ ఆధారశ్చతురోదళోరుణ రుచిర్వాసాంతవర్ణాదయః।
స్వాధిష్ఠానమనేకవిద్యుతిని భంబాలాంతషట్పత్రకం ॥ ౧ ॥
రక్తాభంమణిపూరకందశదళండాద్యఃఫకారాంతకం। పత్రై
ర్ద్వాదశభిస్త్వనాహత పరంహైమంకఠారాంతకం ॥ ౨ ॥
మాత్రాభిస్స్వరషోడశైర్దళ యుతంజ్యోతిర్విశుద్ధాంబు
జం। హంక్షంద్వ్యక్షరసంయుతంద్విదళకంపద్మాభమాజ్ఞా
పరం ॥ 3 ॥ తస్మాదూర్ధ్వమధోముఖం వికసితంపత్రంసహస్రా
రకం। సత్యంసర్వగతంపరాత్పరతమం సూక్ష్మంశివం కేవలం ॥
౪ ॥ జ్ఞానానందమఖండమద్వయపదంషట్త్రింశత్త్వాధికం।
ఏతద్యోహృదయేప్రపశ్యతి సదా నైర్గుణ్యమంతస్థితం ॥ ౫ ॥
నిత్యంనిశ్చలమాదిమధ్యరహితం శ్రుత్వాసముక్తోభవేత్ ॥

తా ॥ ఎవ్వడు ఆధారచక్రము నాలుగుదళములు సాంధ్యరాగకాంతి (వశషస) వర్ణములు స్వాధిష్ఠచక్రమారుదళములు మెరుపుతీగెకాం తి (బభమయరల) మణిపూరక చక్రము పదిదళములు రక్తవర్ణ కాంతి(డఢణతథదధనపఫ) అనాహత చక్రము పన్నెండు పత్రములు సౌవర్ణకాంతి (కఖగఘఙచఛజఝఞటఠ) విశుద్ధచక్రము పదియా రుదళములు జ్యోతిర్మయకాంతి (అఆఇఈఉఊఋౠఌౡఎఏఐఓఔ అంఅః) ఆజ్ఞాయచక్రము రెండుదళములు పద్మకాంతి(హంక్షం) దా నికంటె నూర్ధ్వభాగమధోముఖమైవికసించి నటువంటిసహస్రారక మలమును కాలత్రయ భేదశూన్యమైన సమస్త వ్యాపకమైన పరము నకంటె పరతరమైన అణుస్వరూపమైన పరశివస్వరూపమైన శాశ్వ తమైన జ్ఞానానందమైన అఖండమైన రెండుగానిస్థలమైన షట్త్రింశ త్త్వాధికమైన నిర్గుణమైన అవ్యయమైన చలనరాహిత్యమైన నాది మధ్యరహితమైన [illegible] నటువంటి దీన్ని

నిత్యము చూచుచున్నాడో అథవా వినునో వాడు ముక్తుడౌను ॥
శ్లో ॥ క్షమాభిషేకసలిలం వివేకోవస్త్రముచ్యతే । సత్యమాభరణంప్రోక్తం వైరాగ్యంపుష్పమాలికా ॥ ౧ ॥ గంధస్సమతసంపత్తిరక్షతంనిరహంక్రియా । శ్రద్ధాధూపోమహాజ్ఞానం జగద్భాసిప్రదీపికా ॥ ౨ ॥ భ్రాంతిమూలంప్రపంచస్య నైవేద్యంచనివేదితం । మౌనంఘంటాపరిస్పందస్తాంబూలంవిషయార్పణం ॥ 3 ॥ విషయాభోగరాహిత్యం తత్రదక్షిణకల్పనా । బుద్ధేస్తదాత్మికా శక్తిర్నమస్కారక్రియామతా ॥ ౪ ॥
తా ॥ ప్రాణలింగార్చనము, ఓర్పేయభిషేకజలము, నిత్యానిత్యవస్తువివేకమేవస్త్రము, యథార్థమేభూషణము, ఇహ పరఫలవిరాగమే పుష్పమాలిక, ఏకాగ్రచిత్తమే గంధము, నిరహంకారమే యక్షతలు, విశ్వాసమే ధూపము, మహాజ్ఞానమేదీపము, అజ్ఞానమైన నహంకారవర్గంబుని వేదనమే నైవేద్యము,మౌనమే ఘంటానాదము,విషయాతిక్రమణమే తాంబూలము, విషయసౌఖ్యము జెందకుండడమే దక్షణము, బుద్ధియొక్క లింగ స్వరూపమేశక్తి, బుద్ధ్యాదివృత్తి లింగమందు లయమొందుటె నమస్కారము ॥
శ్లో॥శివభక్తిరతోయుస్తు నిత్యంసాయమతంద్రితః। శివశాస్త్రపురాణాని శ్రోతవ్యంతత్వదర్శిభిః ॥ ౧ ॥
తా ॥ ఎవ్వడు శివభక్త్యాసక్తుడైన వాడు నిత్యసాయంకాలమునసేయాలిస్యములేక శివశాస్త్ర పురాణములు శివతత్వాను భవులచేత వినవలసినది ॥
శ్లో ॥ కుమతీనామృషీణాంచ మాయవాదాన్వితానిచ । పురాణానిచరిత్రాణి గాథాసూత్రాణితానిచ ॥ ౧ ॥ త్యజత్వాంశైవసంస్కార యోగినాంరచితానితే । అహంబ్రవీమితాన్యాద్య తేషాం మంత్రార్థధారిణాం ॥ ౨ ॥ దధీచినాగౌతమేన దుర్వాసేనచముండినా । మృకండునాకుంభజేనగుహేనైవోపమన్యునా ॥ 3 ॥ వృషభేనచదుర్ధర్షచండినాభృంగిణాపిమె । శంఖపద్మాఖ్యశ్రేణీభ్యేణ రేణుకేనషడీక్షణా ॥ ౪ ॥

ధర్మగుప్తేనరాజ్ఞాచ మేఘనాథేననందినా । విడంబకేనధీరే ణ విరదేనమహాత్మనా ॥ ౫ ॥ కృతానియానిపుణ్యాని చరిత్రాణిదినేదినే । శృణుత్వంసర్వదా గౌరి తేషాంముక్తిప్రదాన్యపి ॥ ౬ ॥

తా ॥ ఓపార్వతి నీవుకుచ్చితులైన ఋషీశ్వరులయొక్క మాయవాక్యముల గూడినటువంటి పురాణములు చరిత్రములు గాథసూత్రములు వినువుము (అనగా వినకుము) నీకుశివసంస్కార యోగీశ్వరులయొక్క రచితమై నటువంటివి మొదలు మంత్రార్థ ధారులై నటువంటి వారిలో చెప్పుచున్నాను దధీచి గౌతమ దుర్వాస ముండి మృకుండు అగస్త్య షణ్ముఖ ఉపమన్యు వృషభ చండి భృంగి శంభమార వీరభద్ర రేణుక ధర్మగుప్త మేఘనాథ నందికేశ్వర విడంబ విరదాదులచేత చేయబడిన పుణ్యాస్పదములైన చరిత్రములు ముక్తిప్రదములై నటువంటి వాటిని సదాకాలము ప్రతినిత్యము నీవువినుము ॥

—(ఆచారకాండే దానప్రకరణం ప్రారంభః)—

శ్లో ॥ శివలింగేశివాచార్యే శివయోగినిభక్తిమాన్ । దానం కుర్యాద్యథాశక్తి స్తత్ప్రసాదయుతస్సదా ॥ ౧ ॥

తా ॥ శివప్రసాదయుతుండైన భక్తివంతుండు నెల్లపుడు లింగమందు, గురువందు జంగమమందు దానముచేయవలయును ॥

శ్లో ॥ దానంతుత్రివిధం ప్రోక్తంసోపాధినిరుపాధికం, సహజం చేతిసర్వేషాం సర్వతంత్రవిశారదైః ॥ ౨ ॥ ఫలాభిసంధిసంయుక్తం దానంయద్విహితంభవేత్ । తత్సోపాధికమాఖ్యాతం ముముక్షుభిరనాదృతం ॥ 3 ॥ ఫలాభిస్సంధినిర్ముక్తం ఈశ్వరార్పితకాంక్షితం । నిరుపాధికమాఖ్యాతం దానందానవిశారదైః ॥ ౪ ॥ అదాతృదాతృదేయానాం శివభావంవిచింత్య ।ఆత్మనోకర్తృభావంచ యద్దత్తంసహజంభవేత్ ॥ ౫ ॥

తా ॥ దానము సమస్తులకుసోపాధికము, నిరుపాధికము, సహజమని మూడువిధములు నిగమాగమసిద్ధాంతవెత్తలచేత చెప్పబడినది ఏదిఫలాభిసంధి గూడుకొన్న దానమై విహితమైను (గాని) మొక్షార్థుల

చేనంగీకరింప నిదియడిసోపాధికమని చెప్పబడినది యేదిఫలాభి సంధిలేకనీశ్వరార్పిత వాంఛగలదానమొ నిరుపాధికమని దానవిశారదులచేత చెప్పబడినది యేదితీసుకొనె యిచ్చెవారలలో శివభావమును స్మరించుచు తానుకర్తనుగాననే భావముగలదానమొసహాజదానమౌను ॥

శ్లో ॥ సహాజందానముత్కృష్టం సర్వదానోత్తమొత్తమం ।
శివజ్ఞానప్రదంపుంసాం జన్మరోగనివర్తకం ॥ ౬ ॥

తా ॥ సమస్తదానములలో నుత్తమొత్తమైనటువంటి సహాజదానము శ్రేష్ఠము మానవులకు శివజ్ఞానప్రదమున్ను జన్మరోగనివారకమున్ను (గనుక) సహాజదానము ముఖ్యము ॥

శ్లో ॥ శివాయశివభక్తాయ దీయతేయదికించన । భక్త్యాతదపి విఖ్యాతం సహాజందానముత్తమం ॥ ౭ ॥

తా ॥ భక్తిచేతస్థావర లింగముకొఱకు మాహేశ్వరునికొఱకు నేమైననేమి నివ్వబడుచున్నదొ అదినైననుత్తమమైన సహాజదానమని కీర్తింపబడినది ॥

శ్లో ॥ శివఏవపరంపాత్రం సర్వవిద్యానిధిర్గురుః ॥ తస్మైదర్త్తంతుయత్కించిత్త దనంతఫలంభవేత్ ॥ ౮ ॥

తా ॥ శివుడైనటువంటివాడు త్కృష్టమైనపాత్రుండును సమస్తవిద్యలకునిధియు గురువు నతనికొఱకు (అనగా తత్సంబంధగురు లింగజంగములకు) నెంతమాత్రమిచ్చిన నదీయనంతఫలమౌను ॥

శ్లో ॥ శివయోగీమహాపాత్రం సర్వేషాందానకర్మణి । తస్మాన్నాస్తిపరంకించి త్పాత్రంశాస్త్రవిశారద ॥ ౯ ॥ శివయోగిని సంతుష్టే తృప్తిర్భవతిశంకరః । తత్తృప్త్యాతన్మయం విశ్వాం తృప్తిమేతిచరాచరం ॥ ౧౦ ॥ తస్మాత్సర్వప్రయత్నేన యేనకేనాపికర్మణా । తృప్తింకుర్యాత్సదాకాల మన్నాద్యైశ్శివయోగినః ॥ ౧౧ ॥

తా ॥ ఓయిశాస్త్రవిశారదుడా సమస్తులకు దానకార్యమందు జంగమము గొప్పపాత్రుండు (అనగాయోగ్యుండు) అతనికంటె వేరెకొం

చమైన పాత్రుండులేదు జంగమతృప్తియందు శివుడు తృప్తిబొందుచు న్నాడు శివతృప్తిచేత శివమయమైన జగచ్చరాచరము తృప్తిబొం దుచున్నది యందువలన సర్వప్రయత్నముచే నెకృత్యముచేనైన స దాకాల మన్నాదులచేత జంగమయొక్క తృప్తిని చేయవలసినది ॥

శ్లో ॥ దద్యాదన్నంమహాదేవ భక్తాయశివయోగినే । సర్వపా పవినిర్ముక్త శ్శివలోకేమహీయతే ॥ ౧౨ ॥

తా ॥ అశనమును శివభక్తుండైన జంగమ కొఱకు పెట్టవలయును సమస్తపాపములు విడువబడినవాడై శివలోకమందు పూజించబడు చున్నాడు ॥

శ్లో ॥ యావంత్యన్నసిక్థా నిదత్తానిచశివయోగినే । తావద్వ ర్షసహస్రాణి భవేచ్ఛివపురేసుఖీ ॥ ౧౩ ॥

తా ॥ ఎన్నియన్నకణములు జంగమకొఱకు నివ్వబడుచున్నవో అన్ని వెయ్యిల సంవత్సరములు శివలోకమందు సౌఖ్యము బొందును ॥

శ్లో ॥ అన్నంవాజలమాత్రం వాయద్దత్తంలింగధారిణె । తద న్నంమేరుసదృశం తజ్జలంసాగరోపమం ॥ ౧౪ ॥

తా ॥ అన్నంమైన నుదకమాత్రమైన నేదిలింగాంగునికొఱకు నివ్వ బడునో ఆయన్నము మెరువసమాన మాజలము సముద్రతుల్యము ॥

శ్లో ॥ వస్త్రంశీతాపనోదార్థం యొదద్యాచ్ఛివయోగినే । స సర్వభోగసంయుక్తం లభతెబ్రహ్మణఃపదం ॥ ౧౫ ॥

తా ॥ ఎవ్వడు శీతాపహరణార్థము జంగమకొఱకు వస్త్రము నిచ్చు నో వాడు సకలైశ్వర్యము గూడుకొన్న శివునియొక్క పదముబొం దుచున్నాడు ॥

శ్లో ॥ కాపాసతంతురచితాంశయ్యాంఖట్వాంచభక్తిమాన్ । యోదద్యాచ్ఛివభక్తాయ శర్వలోకమవాప్నుయాత్ ॥ ౧౬ ॥

తా ॥ ఎవ్వడు జంగమకొఱకు పత్తినూలు నేసిన పరుపును మంచము నిచ్చునో (వాడు) శివలోకము బొందును ॥

శ్లో ॥ ధనందద్యాద్యథాశక్తి యఃపుమాన్ శివయోగినే । సగ ణేశత్వమవాప్నో తిసర్వభోగసమన్వితం ॥ ౧౭ ॥

తా ॥ ఎపురుషుండు మాహేశ్వరుని కొఱకు శక్తి కొలది ధనమునిచ్చునో వాడు సమస్త సంపదలచే గూడుకొన్న ప్రమథగణేశత్వము పొందుచున్నాడు ॥

శ్లో ॥ ధనంధాన్యంగృహం క్షేత్రంవసనానిచభూరిశః। దద్యాద్భక్తాయధీరా యభక్తి యుక్తేనచేతసా ॥ ౧౮ ॥

తా ॥ భక్తితొ గూడిన బుద్ధిచేత పండితుడైన మాహేశ్వరుని కొఱకు ధనము ధాన్యము ఇల్లు భూమి వస్త్రములు చాలాచాల నివ్వవలయును ॥

శ్లో ॥ సకృత్ లింగార్చకేదత్తం సువర్ణమణుమాత్రకం ।
దేవైశ్చపూజ్యతెసమ్య గ్గణముఖ్యగణేశ్వరైః ॥ ౧౯ ॥

తా ॥ లింగార్చనునియం దణుమాత్రము బంగారుదానము నివ్వబడునో దేవతులచేత గణశ్రేష్ఠులైన గణేశ్వరులచేత పూజింప బడుచున్నాడు ॥

శ్లో ॥ పయస్వినీంసవత్సాంగాం సర్వాలంకారభూషితాం। యొదద్యాచ్ఛివభక్తాయ సగచ్ఛేచ్ఛివసన్నిధిం ॥ ౨౦ ॥

తా ॥ ఎవ్వడు మాహేశ్వరుని కొఱకు పాలుగలది లేగతో గూడిన సర్వాలంకారభూషితమైన యావును నిచ్చునో వాడు శివసామీప్యముపొందును ॥

శ్లో ॥ సర్వసస్యావృతాం భూమింభక్తాయశివయోగినే। యొదద్యాచ్ఛివసాయుజ్యం సయాత్యత్రనసంశయః ॥ ౨౧ ॥ దత్తాయాంభువిసంభూత బీజసంఖ్యాతవత్సరాన్। భూమిదశ్శాంభవేలోకే సర్వకామానవాప్నుయాత్ ॥ ౨౨ ॥

తా ॥ ఎవ్వడు శివభక్తుడైన జంగమకొఱకు సమస్తపంటలుగలభూమిని నిచ్చునో వాడు శివసాయుజ్యము పొందుచున్నాడు ఇందుసంశయములేదు ఇవ్వబడిన భూమియందు పుట్టిన విత్తులనెన్ని కవత్సరములను భూమినుండి శివలోకమందు సకలాభీష్టములను పొందును ॥

శ్లో ॥ దద్యాన్నవాసనంయస్తు శివభక్తాయసాదరం। సభక్తిభక్తిసంపన్నో సపద్వ్యాధిపోభవేత్ ॥ ౨౩ ॥

తా ॥ ఎవ్వడు మాహేశ్వరుని కొఱకాదరించి క్రొత్తాసనము నిచ్చునో ఆభక్తి సంపన్నుడైన భక్తుండు సప్తద్వీపములకు రాజౌను ॥

శ్లో ॥ ఛత్రంచోపానహౌయస్తు చామరంవ్యజనానిచ । దద్యాల్లింగార్చకస్యాసౌ రుద్రలోకమవాప్నుయాత్ ॥ ౨౪ ॥

తా ॥ ఎవ్వడు ఛత్రి, పాదరక్షలు, చామరము విసనకఱ్ఱలు లింగార్చకుండైన మాహేశ్వరునికి నిచ్చునో వీడు రుద్రలోకము పొందును ॥

శ్లో ॥ దద్యాత్పుష్పాణికర్పూర మిళితంయోనులేపనం । లింగార్చనరతాయాసౌ చంద్రలోకమవాప్నుయాత్ ॥ ౨౫ ॥

తా ॥ ఎవ్వడు లింగార్చనాసక్తుడైన మాహేశ్వరుని కొఱకు పుష్పములు కర్పూరము కలిపిన గంధలేపన చేయునో వీడు చంద్రలోకము పొందును ॥

శ్లో ॥ యొదద్యాద్భస్మరుద్రాక్షం వీరశైవస్యలింగినః । సయాతిరుద్రసారూప్యం కిమత్రనాస్తి సంశయః ॥ ౨౬ ॥

తా ॥ ఎవ్వడు వీరశైవుడైన లింగాంగికి భస్మరుద్రాక్షలు నిచ్చునో వాడు రుద్రసారూప్యము బొందుచున్నాడు నిక్కడేమి యుసంశయము లేదు ॥

శ్లో ॥ యొదద్యాచ్ఛివభక్తాయ సద్భక్త్యాకాష్ఠపాదుకె । సయాతిరుద్రసాలోక్యాం పునరావృత్తివర్జితం ॥ ౨౭ ॥

తా ॥ ఎవ్వడు సద్భక్తిచేత జంగమకొఱకు కట్టెపావకోళ్ల నిచ్చునో వాడు పునరావృత్తి (అగానపునర్జన్మము) లేనటువంటి రుద్రసాలోక్యము పొందుచున్నాడు ॥

శ్లో ॥ కారయిత్వాగృహం సమ్యక్ సర్వోపకరణాన్వితం । లింగాంగసంగినేదద్యాత్సవై శైవపదంవ్రజేత్ ॥ ౨౮ ॥

తా ॥ ఎవ్వడు గృహము బాగాగృహోపకరణ యుక్తము గట్టించి మాహేశ్వరునికొఱకు నిచ్చునో వాడు శివస్థానము జెందును ॥

శ్లో ॥ గృహిణేభక్తియుక్తాయ స్వాచారపరివృద్ధయె । కుటింబినే[illegible] ॥ ౨౯ ॥

ఆరామముక్తవిత్తినా ప్రయచ్ఛేద్భక్తిభావితః ॥

తా॥ భక్తిభావితుండై నవాడు గృహస్థుండైన మాహేశ్వరుని కొఱకాయ నాచారవృద్ధికొఱకై కుటుంబియైన నాగమాధ్యయనుని కొఱకై గృహములు మంచిభూములు తోటలు శాస్త్రోక్తవిధిచేత నివ్వవలయును ॥

శ్లో॥ విద్యాదానసమందానం నాస్తిలోకేషుసర్వదా ॥ ౩౦ ॥ విద్యయాప్రాణినాంముక్తిస్తస్మాత్తద్దానముత్తమం । ధ్యానానాముత్తమంయద్వచ్ఛివధ్యానంప్రకీర్తితం ॥ ౩౧ ॥ దానానాముత్తమంతద్వద్విద్యాదానముదీరితం । యొదద్యాచ్ఛివభక్తాయ విద్యాకోశంసుపుస్తకం ॥ ౩౨ ॥ సర్వకర్మవినిర్ముక్తః సపిబేజ్జననీస్తనా ॥

తా॥ విద్యాదానసమానము నెప్పటికి లోకములయందు దానములేదు విద్యచేతప్రాణులకు (అనగా మానవులకు) ముక్తిగలదందు వలన విద్యాదానము శ్రేష్ఠము నేయొ ధ్యానములలో శివధ్యానమును శ్రేష్ఠమని కీర్తింపబడినదో దానములలో విద్యాదానము శ్రేష్ఠమని చెప్పబడినది యెవ్వడు మాహేశ్వరునికొఱకు విద్యాధనమైన పుస్తకము నిచ్చునో వాడు సర్వకర్మవిముక్తుడై తల్లిస్తనములు చీకడు (జన్మవర్జితుడు) ॥

శ్లో॥ శైవశాస్త్రాణియోధీతే సఏవశివరూపధృత్ ॥ ౩౩ ॥ తస్యదేయంధనంధాన్యం నాన్యవిద్యావతోదదేత్ । శివశాస్త్రాధ్యయన వానధ్యాపయతియఃపుమాన్ ॥ ౩౪ ॥ పూజయేత్తంధనైర్ధాన్యైర్వస్త్రైర్భూషణైరపి ॥

తా। ఎవ్వడు శివశాస్త్రములు చదువుకొనుచిన్నాడో వాడే శివరూపముధరించినవాడు వానికి ధనము ధాన్యము నివ్వవలయు నితరవిద్యావంతునికి నివ్వవలదు ఏపురుషుండు శివశాస్త్రములు చదువుకొన్నవాడై చదివించుచున్న వాన్ని ధనములచేత ధాన్యములచేత వస్త్రములచేత భూషణములచేతనున్ను పూజించవలసినది ॥

శ్లో॥ జంగమానాంచ భక్తానాం కన్యాదానంకరోతియః

౩౫ ॥ [illegible] ॥

తా ॥ ఎవ్వడు జంగమ నామవాచ్యులైనటువంటి మాహేశ్వరులకు కన్యాదానము చేయుచున్నాడో (వాడు) వెయ్యిశివాలయ నిర్మాణ ఫలము కోటిసత్పాత్రదాన ఫలమును పొందును ॥

శ్లో ॥ మఠంకృత్వాసువిపులం విచిత్ర స్తంభ సంయుతం ॥౩౬॥ ప్రాంకణైర్భూతివిస్తారైః శోభితంశివయోగినాం । తత్రదక్ష ణాయభృత్యాంశ్చ యోగినాంపరిచారకాన్ ॥ ౩౭ ॥ నిధా యరాజసంస్థానం తత్రధర్మాదయఃపుమాన్ । కేదారంసస్య సంపన్నం విభజ్యస్థిరభక్తితః ॥ ౩౮ ॥ అశక్తస్స్వగృహే వాపి యోగినస్సేవయాన్స్వయం ॥ ౩౯ ॥ తోషయేద్భక్తిభా వేన ప్రతినిత్యమతంద్రితః ॥

తా ॥ భక్తిగలపురుషుండు శివయోగీశ్వరులకు సులక్షణవిభవవిస్తారమైనంగణములచేత శోభింపబడిన విచిత్ర స్తంభములతో గూడుకొన్న గొప్పమఠముకట్టించి యామఠరక్షణకొఱకు భృత్యుల జంగములకు పరిచారకులను అక్కడరాజసంస్థాన ధర్మములు మొదలైనవి యుంచి స్థిరతరభక్తివలన జీవద్పచనుడైన వాడు సస్యసంపన్నమైన మంచిభూమినివిభజించి తానునివ్వవలయు నిష్పించవలయును సమర్థుండుగాడేని తనగృహంబైన భక్తిభావముచేతనె ప్రతిబంధకము లేక నిత్యముతాను జంగముల సేవచే సంతోషింప చేయవలయును॥

—)(లింగావసాన ప్రకరణం ప్రారంభం)(—

శ్లో ॥ రోగేణపీడ్యతోదేవి జనస్యప్రాణసంశయె । లక్షణైరాత్మబుద్ధ్యాచ నిశ్చిత్యభిషజామృతిం ॥౧॥ విహాయలౌకికందృష్టిం దేహపుత్రధనాదిషు । భోగాశంచపరిత్యజ్య ధ్యాయేన్మామే కమీశ్వరం ॥ ౨ ॥

తా ॥ ఓపార్వతి జనునికి (అనగామానవునికి) రోగముచేత బాధితుండై దుర్లక్షణములచేత తనజ్ఞానముచేత వైద్యునిచేత మరణమునిశ్చయించి ప్రాణసంశయమందు లౌకికదృష్టినివిడిచి దేహపుత్రధనాదులయందు ప్రపంచసౌఖ్యకోరికను పరిత్యజించియీశ్వరుడైన నన్నొక్కనినే ధ్యానించవలసినది ॥

శ్లో॥ యదిదేహేబలంతస్య చోపవేష్టుంసుఖాసనే । పూర్వ
వస్త్రాదినంత్యజ్యధార యేచ్ఛుద్ధమంబరం ॥ 3॥ సమీపంమర
ణంతస్య భూమిసమ్మార్జనంచరేత్ । గోమయేనానులిప్యా
థరం గవల్లీంప్రకల్పయేత్ ॥ ౪ ॥ భస్మోద్ధూళితసర్వాంగోధృ
త రుద్రాక్షమాలికాం । భక్త్యాసంపూజయేల్లింగం పూర్వవ
త్ప్రయతశ్శివె ॥ ౫ ॥ మౌనధ్యానసమాయుక్తో నివిన్యస్వస్తి
కాసనే । హస్తావుత్సంగమాధాయ నాసాగ్రేన్యస్తవీక్షణః॥
౬ ॥ శృంగాటకెభృవోర్మధ్యేద్విదళాజ్ఞాంబుజోత్తమే । ధ్యా
యేన్మాంసంస్మరేన్నామ మనసావచసాదృఢం ॥ ౭ ॥
తా॥ ఓపార్వతీ యట్టివానికి సుఖాసనమందు ప్రవేశించుటకు దేహ
మందు బలము (లేని) యడవానికి మరణము సమీపమని పూర్వవస్త్ర
ములు తీసివేసి పరిశుద్ధవస్త్రముధరించ వలసినదిభూమిసమ్మార్జనము
చేయవలయు గోమయముచేనలికి తరువాత రంగవల్లిని కల్పించవలయు
భస్మోద్ధూళిత సర్వాంగుండై రుద్రాక్షమాలికధారుడై పూర్వము
వలె సంస్కృతుడై లింగమును పూజించవలయును మౌనధ్యానము
తో గూడినవాడై స్వస్తికాసనమందు కూరుచుండి హస్తములొడి
యందు నిచిచూపునా సికాగ్రమందుంచి కనుబొమలనడుమ ద్వి
దళాజ్ఞేయ కమలరంధ్రమందు మనస్సుచేత వాక్కుచేత దృఢము
గాను నన్నుగూర్చిధ్యానించ వలసినది నామముస్మరించ వలసిది॥
శ్లో॥ అంత్యకాలేప్రబుద్ధోయ సుహృదాభోధితోపివా।చరపా
దజలైస్స్నాప్యసచేలకమతంద్రితః ॥ ౮ ॥ బహూదకేనశు
ద్ధేన స్నాపయేల్లింగినస్తనుం । పంచాక్షరేణ మంత్రేణశత
రుద్రానువాకతః ॥ ౯ ॥ ఏవంబాహ్యార్చనం కృత్వాపంచ
బ్రహ్మాదిమంత్రకైః । శుద్ధవస్త్రాదలంకృత్వాచో పవిశ్యశుచి
స్థలె ॥ ౧౦ ॥
తా॥ అంత్యకాలమందు నెవ్వడెచ్చరిక గలవాడైనను స్నేహితునివ
ల్ల తెలిసినవాడైనను నాలిస్యముచేయక జంగమపాదోదకముల చేత
వస్త్రయుతముతడిపి చాలపరిశుద్ధోదకముతో పంచాక్షరిమంత్రముచే

త శతరుద్రానువాకము వలన నాలింగాంగిశరీరము స్నానముచేయ
చ వలయు పంచబ్రహ్మాది మంత్రములచేత పరిశుద్ధవస్త్రము వస్త్రము
కరించి యీప్రకారము బాహ్యార్చనచేసి విశుద్ధస్థలమందు (ఆస
గోమయవిలిప్యాది స్థలవస్త్రాసనమందు) పవళింపజేసి ॥

—( బీజన్యాసం )—

శ్లో॥సమలంకృత్యతం దేహంవిధివద్భస్మధారణం॥రుద్రాక్షరణ
కుర్యాత్స మంత్రవిధిపూర్వకం ॥ ౧ ॥ ఓంకారంవదనేదేవి వ
యకారభుజద్వయోః । శికారంనాభిమధ్యేచ నమకారపదద్వ
యోః ॥ ౨ ॥ అకారంవామభాగేచ ఉకారంవక్షసితథా।
మకారంపృష్ఠభాగేచ ఓకారందక్షిణేతథా ॥ ౩ ॥ హకారం
చశిఖాయాం తుకంఠేచబసవాక్షరం । అఉమేతిబాహ్యం
తేవామకక్షేషడక్షరీం ॥ ౪ ॥ ప్రసాదంసవ్యకక్షే చలికారు
బిందునాయుతం । గుదేచస్థాపయేద్దేవి గకారంబిందునాసహ
॥ ౫ ॥ స్థాపయేద్బ్రహ్మరంధ్రేచత త్తత్స్థానేయథావిధి ॥

తా॥ ఓపార్వతీ యట్టియవసాన దేహము విధిప్రకారము భస్మధార
ము రుద్రాక్షధారణము నలంకరించి సమంత్రవిధి పూర్వకముగా
చేయవలయును ఓపార్వతీ ఓంకారము ముఖమందు వకారము య
రము రెండుభుజములయందు శికారమునాభియందు నకారమకారము
రెండుపాదములయందు అకారమెడమభాగమందు ఉకారము వక్ష
లమందు మకారమువీపుయందు ఓంకారము దక్షిణభాగమందు హ
కారముశిఖాయందు బసవాక్షరములు కంఠమందు అఉమమెడయం
దు షడక్షరి యెడమచంకయందు ప్రసాదపంచాక్షరి కుడిచంకయందు
లికారముబిందుతో గూడిగుదయందు గకారముబిందుతోగూడి బ్ర
హ్మరంధ్రమునందు విధినతిక్రమించక నాయాయస్థానములయందు
స్థాపించవలయును ॥

శ్లో॥ పాదోదకప్రసాదైశ్చ లింగభోగోపభోగినః ॥ ౬ ॥ అ
పిహితస్సావధానేన స్వలింగేప్రాణఆహితః । దేహనిర్వాణస
మహేన్మరణాన్మహేశ్వరి ॥ ౭ ॥ సంపూజ్యేత్...ంజపేత్

ప్రయాణమరుతస్తథా। శుభమేవప్రకుర్వీత రోదనాదివివర్జితం ॥ ౮ ॥ భక్తశ్శిష్యోపిపుత్రో వాకుర్యాత్తదార్ధ్వదైహికం। అలంకుర్వీతతం దేహం వస్త్రైశ్చీనాంబరాదిభిః ॥ ౯ ॥ గంధైస్సుగంధసంయుక్తైః శుద్ధమాల్యైఃప్రసాదినః। ధూపదీపాదికందత్వా నైవేద్యంచార్పయేత్తతః ॥ ౧౦ ॥ సంపూజయేన్మృతం దేహంలింగినంలింగసత్రిపమె ॥

తా ॥ ఓపార్వతి యాత్రప్రాణావసానుండు పాదోదక ప్రసాదములచేత లింగార్పితమైనార్పితములు సావధానముచే నర్పితుండై తనలింగమందు ప్రాణముజేర్చిన వాడగుచు దేహము వెడలె సమయమంద నన్ను స్మరించునో నన్ను పొందుచున్నాడు నట్లాగె ప్రాణములు వెళ్లియెడ కర్ణమందు శివమంత్రము చెప్పవలసినవి యేడ్పులు మొదలైనవి విడిచిశుభోత్సనమే చేయవలయు భక్తుడైన శిష్యుడైన కొడుకైనను మాహేశ్వరారాధన దానము చేయవలయును ఆ దేహమును చీనాంబరాది వస్త్రములచేత సుగంధయుక్తమైన గంధములచేత పరిశుద్ధమైన పూలదండలచేత నలంకారము చేయవలయు నాప్రసాదికి ధూపదీపాదికములు నిచ్చి యనంతరము నైవేద్యమర్పించ వలయును ఓ పార్వతిపిమ్మట మృతదేహుండై నటువంటి లింగాంగి లింగము పూజించవలసినది ॥

—)(విమానలక్షణం)(—

శ్లో ॥ అథతద్వాహనార్థాయ విమానంకారయేద్దృఢం। చతుర్ద్వారసమాయుక్తం త్రయమేకంతువాశివె ॥ ౧ ॥ చతుష్పాదంచతుస్తంభ మున్నతంశిఖరాన్వితం। అలంకృతంసువస్త్రాద్యై యథావిభవవిస్తరం ॥ ౨ ॥ మాలికాభిసుగంధిభిర్దర్పణైర్మణిచామరైః। కేతుభిశ్చసుశోభనైరలంకుర్యాద్విమానకం ॥ 3 ॥తద్విమానంస్సశనైస్తౌ జపేత్పంచాక్షరీంశుభాం। అష్టోత్తరంసహస్రం వాశతమేకదశాపివా ॥ ౪ ॥ మూలెనోంవాచయత్తే నవిమానస్తోపయేచ్ఛనైః। యథాసమాథానివసేత్తథైవాస్వస్తికాసనే ॥ ౫ ॥ కరావు

త్సంగయోః క్షిప్త్వా బధ్నీయాద్రజ్జుభిర్దృఢం । చత్వారోలిం
గినోవృద్ధాః జ్ఞానభక్తితపోవ్రతైః ॥ ౬ ॥ వహేయుర్భుజశీ
ర్షేషు విమానం శవసంయుతం । వాచయేచ్ఛతరుద్రీయం శి
వాగమసుకీర్తనైః ॥ ౭ ॥ మంగళార్థాని వాద్యాని వాద
యన్నవటంప్రతి । ఆనీయుర్బహుభిర్జుష్టం లింగాంగసంగిభి
స్సహ ॥ ౮ ॥

తా ॥ ఓపార్వతి మరియు నాఐక్యుడెక్కుకొఱకు విమానము నాలు
గుద్వారములు గూడినదైన మూడైన నొక్కటైన గలదిగాను నా
లుగు పాదములును నాలుగు స్తంభములు శిఖరములగూడి పొడువు
గాను దృఢము చేయించవలయు నైశ్వర్యము కొలది మంచివస్త్రాదులచే
పరిమళముగల పుష్పహారముల చేత నద్దముల చేతస్ఫటిక చామరములచే
త మిక్కిలిరమ్యమగు టెక్కెముల చేత విమానము నలంకరించ వ
లసినది కర్తా (అనగా క్రియ చేయువాడు) నావిమానమును ముట్టుచు
మాంగళ్యమైన పంచాక్షరిని ప్రణవయుక్తముతో వెయ్యి న్నైనమి
దియైన నూరైన పదకొండుమారులైన జపించవలయు నైక్యునివిమా
నమందు కూర్చుండ పెట్టవలయు నెట్లాగు సమాధియందు కూర్చుం
డబడునో అట్లాగె స్వస్తికాసనమందు హస్తములు ముందరి భాగము
దోడిలో పెట్టి గట్టిగా త్రాళ్లచేత కట్టవలసినది లింగాంగులైన నలుగు
రు వృద్ధులు జ్ఞానభక్తి తపోవ్రతులైన వారిచేత భుజశీర్షముల
యందు నైక్యయుక్త విమానము నెత్తుకొవలయు (ముందర) శతరు
ద్రీయశివాగమ కీర్తనల చేత మంగళార్థములైన వాద్యములువా
యింపుచు లింగాంగుల చేగూడి యనేకజనులు కలిసి సమాధినిగూ
ర్చి తీసుకపొవలయును ॥

శ్లో ॥ దగ్ధస్యదహనంనాస్తి పక్వస్యపచనంకుతః । శివజ్ఞానా
గ్నిదగ్ధస్య పునర్దాహోనవిద్యతే॥ ౯ ॥ ప్రాణేనలింగసం
యుక్తః లింగేనప్రాణసంయుతః । ప్రాణస్తుత్యక్తకాలేచ దే
హోదహనవర్జితః ॥ ౧౦ ॥

తా ॥ కాలినవస్తువు [illegible] పక్వమైన వస్తువు

పచనమెక్కడనున్నది శివజ్ఞానాగ్ని దగ్ధమైన లింగశరీరమునకు దహనములేదు ప్రాణముచే లింగముకూడుకొన్నదై లింగముచే ప్రాణముగూడుకొన్నదై ప్రాణమువిడిచిన కాలమందు దేహముదహనవర్జితమని తెలియదగు ॥

—( సమాధినిర్ణయం )—

శ్లో ॥ గ్రామాత్ప్రాచీముదీచీం వాదిశంసమ్యగ్విచారయేత్ । పుణ్యదేశేనదీతీరే బహువృక్షేవనేపివా ॥ ౧ ॥ గిరావారామభూభాగే బిల్వమూలేపివామఠే । శివాలయేపినికటే జీర్ణగోష్ఠేచతుష్పథే ॥ ౨ ॥ సుకరంలభ్యతేయత్ర చాశ్రమేవతపస్వినః ॥

తా ॥ సమాధికిస్థలము గ్రామానకు తూర్పుదిక్కైన నుత్తరదిక్కైనను లెస్సదిగ్విచారము చేయవలయు పుణ్యప్రదేశమందైన (అనగాపవిత్రస్థలమందైన) నదీతీరమందైన అనేకవృక్షములుగల వనమందైన పర్వతముతోటగల భూమియందైన బిల్వవృక్షము క్రిందనైన మఠమందైన శివాలయ సమీపమందైన పాతపసులదొడ్డియందైన నాలుగుత్రోవలు గలసినస్థలమమందైన నెక్కడసులభము గలభించుచున్నదో అదేదైయెక్యునికి యాశ్రయమని తెలియవలయు ॥

శ్లో ॥ ఖాతయిత్వావటంభూమా శ్లక్ష్ణవ్యాయామవిస్తృతం ॥ ౩ రహితంశార్కరాగ్రావ కంటకాశుచిలోష్ఠకం । కీకసాదివిచార్యాథ పుణ్యావాపుణ్యయత్నతః ॥ ౪ ॥ మృతదేహప్రమాణేన గర్తాగాధంవిధియతే । నవవాసప్తపాదం వాగతప్రాణస్యదేహినః ॥ ౫ ॥ తన్మానమధికంవాచే ప్యతుర్యాయామసంక్షయం । చతురశ్రంపంచ పాదంవిస్తీర్ణంతుతథైవచ ॥ ౬ ॥ ఘాతంనవపదంప్రోక్తం సోపానంతుత్రయంకృతం ప్రథమస్యయథాదీర్ఘం సోపానస్యైకపాదకం ॥ ౭ ॥ కుర్యాద్దీర్ఘంద్వితీయస్య ద్విపాదమున్నతంతథా । తృతీయస్యయథాదీర్ఘంత్రిపాదంపరికల్పయేత్ ॥ ౮ ॥ తన్మధ్యేవేదికాంకృత్వాత్రిపాదంచతురశ్రకం । [illegible] లక్ష

క్షైః పరిశోభితం ॥ ౯ ॥ గర్తస్యాంతః పూర్వభాగే దక్షిణోత్తర
కేపివా। భిత్తౌ త్రికోణఘాతంచ త్రిపాదదీర్ఘ మాయతం ॥
౧౦॥ ప్రస్థద్వయంచ విస్తార్య త్రిపాదమున్నతం తథా। కవాటం
దీప మాలంచ గోమయేనానులేపనం ॥ ౧౧ ॥ రంగవల్ల్యాదివివి
ధై రలంకారం ప్రకల్పయేత్ । వేదికాయాం సమాధౌచ ప్ర
వేశ్య వాహనంత్యజేత్ ॥ ౧౨ ॥

తా ॥ పుణ్యవంతుడైన కర్త ప్రయత్నమువలన భూమియందు సన్నపుదారములు నిడివిగలబట్టలు కంబళి మొదలైనవి మొఱపి సకలు రాళ్ళు ముండ్లు మురికి పెడ్డలు ఎముకలాదులు లేకుండా విచారించి సమాధి చదరముగాను త్రవ్వించి మరియు మృతదేహ ప్రమాణముచే మృతదేహ్యునియొక్క తొమ్మిదిపాదములైన నేడుపాదములైన గుంతయొక్క లోతు విధింపబడుచున్నది దానికంటె యెక్కువైనను తక్కువైననాయెనేని కర్తాయువునశించును బొందచదరము (అనగానాలుగుప్రక్కలు) ఐదుపాదములు నదే వెడలుపు తొమ్మిదిపాదములలోతు చెప్పబడినది మూడుతంతెలు చేయదగును మొదటిమెట్టుకొక్కపాద వెళుము నంతెపొడు వొక్కపాదమెత్తు రెండోమెట్టుకు రెండుపాదములపొడువు రెండుపాదములెత్తు మూడోమెట్టుకు మూడుపాదములపొడువు మూడుపాదములెత్తు చేయవలసినది యాసమాధిమధ్యమందు చదరము మూడుపాదములు నొక్కపాదమెత్తున్న లక్షణములచే శోభించునటువంటి యరుగును చేసి సమాధిలోపల పూర్వభాగమైన దక్షిణభాగమైన నుత్తరభాగమైన గోడయందు (అనగాదరియందు) త్రికోణముగూడు మూడుపాదముల దీర్ఘమునంతయు నిడివి రెండుప్రస్థవిస్తీర్ణము మూడుపాదములనెత్తు చేసి యట్లాగె తలుపులు గోమయముచేత పూతయు రంగవల్లి మొదలుకొని దీపచయంబు వివిధంబులైన నలంకారములు చేయవలయు సమాధియందరుగున మృతుని ప్రవేశించి విమానముత్యజించ వలయు ॥

శ్లో ॥ స్వయం పద్మాసనంస్థిత్వా తత నుం సమ్యగర్చయేత్ ।
భస్మరుద్రాక్షకుసుమైశ్చందనాద్యైర్విలేపనైః ॥ ౧౩ ॥ ధూ

పదీపమహావాద్య నైవేద్యైర్విభవాన్వితం । ఫలపానీయతాం
బూలం దత్వావై మంత్రపూర్వకం ॥ ౧౪ ॥ యథాసంపూజ
యేల్లింగం తథైవపరమేశ్వరి । తస్మిన్కాలేమహాపుణ్యే గోభూ
మిరథవాజినః ॥ ౧౫ ॥ నరవాహాద్యనడ్వాహద్విరదాద్దా
సిదాసకాన్ । తపనీయానివస్త్రాణి గృహాణివస్తుజాతయః ॥
౧౬ ॥ భూషణానిచగ్రామాణి రత్నానిసర్వసంపదః । మహే
భ్యశ్చరలింగేభ్యో గురుభ్యశ్చరమేభ్యహి ॥ ౧౭ ॥ దద్యాత్స
ప్తసంతానం హియథావిభవవిస్తరం ॥

తా ॥ ఓపార్వతి కర్తయైనవాడు తానుపద్మాసనముగాను కూర్చుం
డి భస్మరుద్రాక్ష పుష్పములచేత గంధాది లేపనములచేత ధూపదీప
నైవేద్యము మహావాద్య మాంగళ్యసహితము మంత్రపూర్వకము ఫ
లపానియ్యతాంబూలమిచ్చి యటువలె లింగమును పూజించునో అటువ
లెనైన్యునిశరీరము లెస్సఘాజించవలయునట్టిపుణ్యకాలమందైశ్వర్యవి
స్తారము మతస్థులైన చరమూర్తులకొఱకు గురువులకొఱకు జంగము
లకొఱకు గోభూమి రథాశ్వములు పల్లకిమొదలైనవి వృషభముల
నేనుగల దాసిదాసకులను బంగారములు వస్త్రములు గృహములు వ
స్తుజాతములు సొమ్ములు గ్రామములు రత్నములు సర్వసంపదలు స
ప్తసంతానములు నివ్వవలయును ॥

## —)*( సమాధిన్యాసం )*(—

శ్లో ॥ శిఖాయాంలింగముద్రాంకం త్రికోణేబిలమందిరే । చ
తుర్దిక్షుక్రమాద్దే విస్థాపయేద్విధివద్యథా ॥ ౧ ॥ ఓంహ్రాం
హ్రీంహ్రూంహ్రైంనమః శివాయేతిప్రసాదంమనుః । తస్య
వక్త్రేచతల్లింగం తద్దేహగతమేవహి । నిక్షిపేద్వాతాంబూలే
ననిఖనేద్దృఢతరంతత్ । భూమౌప్రతిష్ఠితంలింగం పునర్నో
త్పాట్యతేయథా ॥ 3 ॥ దేహేప్రతిష్ఠితంలింగం మంతెనో
త్పాట్యతేతథా ॥

తా ॥ ఓపార్వతి త్రికోణగుహ మందిరమందు మీదిభాగము శిఖాయం
దు లింగముద్రాంకము నేవిధి యోనావిధి ప్రకారము క్రమముగా నా

లుగుదిక్కులయందు ( హ్రాం హ్రీం హ్రూం హ్రైం నమశ్శివాయ ) అని ప్రసాద పంచాక్షరిమంత్రము స్థాపించవలయు నైక్యునిశరీరము పొంది యున్న నాలింగము నైక్యునియొక్క వదనమందె పెట్టవలయు నథవా తాంబూలము చేతగట్టితరముగాను వక్త్రమందే నిమిడించవలసినది యెట్లాగు భూమియందు ప్రతిష్ఠించిన లింగము తిరిగిపీకివెయ్యబడదో అట్లాగె దేహమందు ప్రతిష్ఠించిన లింగమునంత్యమందు దేహమునుండి వదిలించకూడదు ॥

—:※ స్థాపనం ※:—

శ్లో ॥ తచ్ఛవంవిష్టరోద్ధృత్య అలంకారయుతంహితం ॥ ౪ ॥ గృహాంతరె ప్రతిష్ఠాప్య పద్మాసనసమన్వితం । పంచలోహైశ్చరత్నైశ్చ నిశాచూర్ణైశ్చభస్మనా ॥ ౫ ॥ సైంధవేనసమాపూర్యలవణేనతతశ్శివె । గంధద్రవ్యేణకంఠాంతం పూరయిత్వాతతోపరి ॥ ౬ ॥ గురుమాహేశ్వరాచార్యా మహద్భిస్స్పర్శపావనైః । భస్మాదిబిల్వపత్రైర్వా రత్నగంధాష్టవస్తుభిః ౭ ॥ శేషాంగంముఖమాచ్ఛాద్య యత్నతఃపరిపూరయేత్ । సంఘట్యపద్మాఖ్యంసుదృఢం శేషమాపూరయేన్మృదా ॥ ౮ ॥ సదేహఃపూతిగంధస్స్యాత్తే నవంశక్షుయోభవేత్ । భూమ్యాసమ్మితమాపూర్యకుర్యాదుపరి వేదికాం ॥ ౯ ॥ పౌరుషేణప్రమాణేన తదర్థార్థమథాపివా । గర్త ద్విగుణమానేనపరితః పృథివీతలే ॥ ౧౦ ॥ చతురశ్రాంవర్తులాం వామేఖలాత్రితయాన్వితాం । శ్లక్ష్ణంకుర్యాల్లేపనాద్యై రలంకుర్యాత్సుధాదిభిః ॥ ౧౧ ॥ వితానైర్పుష్పమాలాద్యై రలంకుర్యాత్తథోపరి । తోరణంపరితోబధ్వా పతాకాద్యైస్సుశోభితైః ॥ ౧౨ ॥ యోగురుంమృతభావేన తద్దినంయస్యచోచ్యతే । శుద్ధసిద్ధప్రసిద్ధంచనాస్తినాస్తివరాననే ॥ ౧౩ ॥ త్రిదినాం తేచకుర్యాద్వై మధ్యేలింగంతుమృణ్మయం । తల్లింగంప్రేతలింగస్యాన్న పూజానచవందనం ॥ ౧౪ ॥ లింగంతత్కాలికం దేవి దీక్షాం తెపునరస్యతః । సిద్ధింగతస్యపుణ్యస్య అధికారంచధారయేత్ ॥౧౫॥

వేదేతుపరికుర్వీత వృషభంలింగమేవవా।గురుజంగమపూజాం చ వారంప్రతిసమాచరేత్ ॥ ౧౬ ॥ వేదికారాధనంకృత్వా మోక్షదీపంప్రకల్పయేత్ । పంచమ్యాంవాతథైవాపి సప్తమ్యాంపుణ్యవాసరే ॥ ౧౭ ॥ భూరిదానంమహాదానం సర్వయత్నేనకారయేత్ ॥

తా ॥ ఓపార్వతి ఆలింగాంగము (అనగామృతదేహము) నరుగునుండి దింపి యలంకారసహితము పద్మాసనయుక్తముగాను త్రికోణగృహమందు కూర్చుండబెట్టి పంచలోహములచేత రత్నములచేత పసుపుపొడులచేత భస్మముచేత సైంధవముచేత నిండానింపి తరవాత నుప్పుచే గంధద్రవ్యముతో కంఠము వరకునింపించి పిమ్మటపైన గురుమాహేశ్వరాచార్య మహాత్ములచే పవిత్రస్పర్శనమై నటువంటిభస్మము మొదలు బిల్వపత్రములచే రత్నాష్టగంధములచే యత్నముగా శేషాంగము ముఖముమూసి గూడునింపవలయు పాదములచేత మిక్కిలిగట్టిగానుత్రొక్కి మన్నుచే శేషము నింపవలయు నాదేహము దుర్గంధమాయెనేని దానిచేకర్తయొక్క వంశక్షీణమౌను భూమితోసమానము నింపి మీదనరుగును పురుషప్రమాణమెత్తైన దానిసగమైన సగమునసగమైన చేయవలయును భూమియందు సమాధి రెండింతల ప్రమాణముచే నంతట వెళుము చరమైన గుండ్రగైనను మూడుతడంచలతో గూడకొంచమలుకు పూతలచేత సున్నము మొదలైనవాటిచేత నలంకారము చేయవలయు దానిమీదంతట తోరణముగట్టిపుష్పమాలాదిసముదాములచేత మనోహరములై నపతాకాదులచేత నలంకరించవలసినది ఓపార్వతి యెన్వడాదినము గురువునుమృతభావముచేత నెవ్వనికేని చెప్పుచున్నాడో వానికి శుద్ధసిద్ధప్రసిద్ధ ప్రసాదత్రయములేదు లేదు మూడవదివసాంతము సమాధిమధ్యమందు మృణ్మయలింగమును చేయవలయు నాలింగము ప్రేతలింగమౌను పూజకూడదు నమస్కారము కూడదు ఓపార్వతి ఆసమయమందె లింగభావము దీక్షాంతము మల్లియితరభావము నైన్యుడైన పుణ్యునియొక్క యధికారము విచారించవలయు వేదికయందు వృషభమునైన లింగమునైన చేయవలయు (అధికారుడాయెనేని) ప్రతి దినమును గురుజంగమ పూజ

చేయవలసినది వేదికారాధనము చేసి మోక్షదీపము కల్పించవలయు నైదవనాడైన నట్లొగేడవనాడైన ప్రయత్నముగానన్నప్రదానాది. భూరి దానము చేయవలసినది ॥

## —)"( ఇష్టలింగప్రతిపాదనము )"(—

బాహ్యాంతరసమానేన పురుషేణాప్యథోఫలం । వైలక్షణ్యా బహిశ్చాంతః ఫలనాశాయకల్ప్యతే ॥ ౧ ॥ అంగుష్ఠమాత్రః పురుషో హృదయాకాశశోభితః।లింగాకృతిర్జ్యోతిరేవ శివస త్యాదిలక్షణః ॥ ౨ ॥ బహిర్ధృతంలింగమపి సామ్యమత్రతదే తయోః । బహిరంతర్లింగధృతె ర్లింగధారణమంతరా ॥ 3 ॥ నైవసంఘటతేపుంసాం తస్మాల్లింగంహృదంబుజే । బ హిరింద్రియయోగ్యంచ బాహ్యలింగముదాహృతం॥ ౪॥అం తరేంద్రియయోగ్యంచ హ్యాంతరలింగముచ్యతే ॥

తా ॥ మరియుపురుషునిచేతనైతె బాహ్యాంతరము(అనగానిష్టలింగము ప్రాణలింగము)సమానముతో(నుపాసించుట)సాఫల్యము వెలపలలో పల లక్షణశూన్యము(చేయుట)ఫలనాశముకొఱకు కల్పించబడుచున్న ది పురుషుండంగుష్ఠమాత్రుండు హృదయాకాశశోభితుండు లింగాకా రతయు జోతిర్మయమదే సచ్చిదానందలక్షణుడైన శివుడు వెలుపలధ రించునిష్టలింగమైనను లోపలి యాప్రాణలింగము రెంటికిసమానత్వ ము బహిరంతర లింగధారణమునకు నంతరలింగధారణము మానవు లకు ఘటించదు నందువలన హృత్కమలమందు బహిరింద్రియయో గ్యమైన బహిర్లింగము నుదహరించబడినది యంతరింద్రియయో గ్యమైన నంతర్లింగమును చెప్పబడినది ॥

ఇతి శ్రీమత్పరశివ వామదేవా ననోద్భవ దారుకాచార్య శాఖాసం జనిత సిద్ధలింగాహ్వ యాచార్య కరకంజాత భృంగిగోత్రోత్పన్న గుదెపెట్లవంశ వారధి సుధాకరాయమాన వీరపాఖ్య తనూభ వాగ్రజ సిద్ధరామాభిధమద్భ్రాత్రను మత్యామయా మడివా ళాఖ్యేనసంయోజిత కృతనిఖిలధర్మానుకూలాయాం వీర శైవాచార ప్రదీపకాయాం ద్వితీయాచార కాండం

—(*సమాప్తం*)—

శ్రీమన్మరుళాచార్యాయనమః

## —(*) అపరాధ కాండ ప్రారంభః (*)—



### —( భవిసంస్పర్శనం )—

శ్లో॥ శివభక్తోమహాతేజా శ్శివభక్తిపరాఙ్ముఖాన్ । నస్పృశే న్నైనవిక్షేత తైస్సహావసేత్క్వచిత్ ॥ ౧ ॥

తా॥ శివభక్తుండు గొప్పప్రతాపుండైనవాడు శివభక్తినిగూర్చిన ముఖముద్రింపువారలను ( అనగా శివభక్తేతరుల ) నెక్కడనైనను ముట్టకూడదు చూడకూడదు వారితోగూడివసించగూడదు॥

శ్లో॥ కదాచిదపిలింగాంగీ లింగశూన్యాన్న సంస్పృశేత్ । ప్రమాదాద్యదివాస్పృశ్య భస్మస్నానంసమాచరేత్ ॥ ౨ ॥

తా॥ లింగాంగియైనవాడు నెపుడైనను లింగములేనటువంటివారలను ముట్టవలదు తప్పితమువల్ల ముట్టెనేని భస్మస్నానము చేయవలయు॥

శ్లో॥ భవిసంస్పర్శనాదేవ అశుచిర్లింగసంగినః । భవేత్తదన్యతోనాస్తి లింగదేహీసదాశుచిః ॥ 3 ॥ తస్మాత్కర్మజడస్నానం నకార్యం లింగదేహినా । దేహసౌఖ్యకరంనిత్యం లింగాంబుస్నానమాచరేత్ ॥ ౪ ॥

తా॥ లింగాంగులకు భవిసంస్పర్శవలననే యశుచిగలుగుచున్నది దానికంటెయితరమువలనలేదు లింగదేహిసదాపరిశుద్ధము అందువలన లింగాంగితో ( కేవలము ) కర్మసంబంధమైన జలస్నానముచేయకూడదు అనుదినము దేహసౌఖ్యము పరిశుద్ధత్వము గలగజేయు లింగోదకస్నానము చేయవలయును ॥

శ్లో॥ లింగాంగినోభవిస్పృష్టం కదాచిదపియద్భవేత్ । విభూత్యాలింగాంబునావా సమ్యక్స్నానం సమాచరేత్ ॥ ౫ ॥

బాహ్యామాలిన్యరాహిత్యం దేహసౌఖ్యకరంసదా । ఆత్మనో
నిర్మలార్థంచ లింగాంబుస్నానమాచరేత్ ॥ ౬ ॥

తా ॥ లింగాంగి కెప్పుడేనియు భవిస్పర్శము గలిగెనేనియుభస్మము చేనైన లింగోదకముచేనైన మంచిగాస్నానము చేయవలయు నెల్లపుడు వెలపలిమలిన రాహిత్యమైశరీర సౌఖ్యమును గూర్చి న్ని యాత్మయొక్క నైర్మల్యతకైన్ని లింగోదకస్నానము చేయవలయును ॥

శ్లో ॥ భవీనామాసనేయానే సంపర్కేసహభోజనే । సంచ
రంతిమహాఘోరె నరకేకాలమక్షయం ॥ ౭ ॥

తా ॥ ఎవ్వరుభవులయొక్క ఆసననడుపుసంపర్కసహభోజనము యందు కలసిచరించుచున్నారో వారుమహా భయంకరమైన నరకమంద క్షీణకాలముందురు ॥

శ్లో ॥ భవబంధనమస్యాస్తి భవినామః ప్రవర్తతె । తద్భవి
స్యాచ్ఛరీరంచ శుక్లశోణితసంయుతం ॥ ౮ ॥ భక్తానాం భవి
సంయోగేనభుంజీయాత్కదాచన । తథాపిభుంజీయాద్దే విప్ర
సాదత్రయనాశనం ॥ ౯ ॥

తా ॥ ఓపార్వతిభవియనగా వీనికి జననమరణ బంధమున్నది(కనుక) భవియని పేరువర్తించుచున్నది యాభవిశరీరమున్ను రేతరక్తములగూడుకొన్నదౌను మంత్రాంగులైనభక్తులకు భవిసంయోగమందు నెప్పటికి భుజించతగదు అట్లాగెభుజించెనేని శుద్ధసిద్ధప్రసిద్ధ ప్రసాదత్రయమునశించును ॥

శ్లో ॥ మద్యపానీమాంసభక్షీ అన్యదేవస్యపూజకః । అలిం
గీపరవాదీచపంచైతెభవినస్స్మృతాః ॥ ౧౦ ॥

తా ॥ కల్లుద్రాగువాడు మాంసముభక్షించువాడు అన్యదేవతకుపూజచేయువాడు లింగములేనివాడు పరవాదముచేయువాడు వీరైదుగురు భవులని చెలపబడుదురు ॥

—)*( గురునిరాకరణం )*(—

శ్లో ॥ పూర్వంగురుం పరిత్యజ్య యోన్యంగురుముపాసతె ।

సోపునర్భవఇతిజ్ఞేయ స్సర్వకర్మసుగర్హితః ॥ ౧ ॥

తా ॥ ఎవడుపూర్వగురువునువిడిచి యితరగురువును సేవించుచున్నా డో వాడు మారుమనువుకు పుట్టినవాడని సర్వకర్మములయందు నింద్యుడని తెలియవలయు ॥

శ్లో ॥ గురోరవజ్ఞయామృత్యుర్మంత్రావజ్ఞాదరిద్రతా। గురుమంత్రపరిత్యాగి రౌరవం నరకంవ్రజేత్ ॥ ౨ ॥ ఉపదేశంవినాలింగంప్రపూజయతియోనరః। నరకేపచ్యతేదేవి ఉపదేశమవశ్యకం ॥ 3 ॥

తా ॥ ఓపార్వతీ గురువుయొక్క తిరస్కారముచేతమృత్యువుమంత్ర తిరస్కారము చేదారిద్రము గురుమంత్రము విడిచినవాడు రౌరవ నరకము బొందును యెమానవుం డుపదేశము వినాలింగమును పూజించుచున్నాడో (వాడు) నరకమందుడుకు చున్నాడు ఉపదేశ మవశ్యకమైనది యనగాపొందవలసినది ॥

శ్లో ॥ భ్రాతృపుత్రకళత్రేషు గోత్రమిత్రాగ్రజేష్వపి। గురుభావనమిత్యాద్యం గురుభక్తేస్తులక్షణం ॥ ౪ ॥ హితమేవచరేన్నిత్యంమనోవాక్కాయకర్మభిః। గురుణామహితం క్వాపి మనసాపినచింతయేత్ ॥ ౫ ॥

తా ॥ అన్న దమ్ములు పుత్ర కళత్ర గోత్ర మిత్ర జేష్ఠులందరియందు గురుభావనమిట్టిదని మొదలుగలిగియుండడమే గురుభక్తియొక్క లక్షణముఎప్పటికిమనో వాక్కాయములచేత (వారి) ఇష్టముగా నే చరించ వలసినది - ఎక్కడనైన గురువుల యొక్క యనిష్టము మనసుచే దలంచకూడదు ॥

శ్లో ॥ గజాందోళరథాశ్వేషు నవసేద్గురుసన్నిధౌ। పాదుకాసనశయ్యాసు గురూణాం నవసేత్క్వచిత్ ॥ ౬ ॥ ప్రమాదాద్యదివాగత్వా ప్రత్యవాయోమహాన్భవేత్। పాదుకాసనశయ్యాసు గురుణాయస్సమంవిశేత్ ॥ ౭ ॥ ప్రాయశ్చిత్తంనవిద్యేత ప్రత్యవాయోమహాన్భవేత్ ॥

తా ॥ గురుసన్నిధి యందు శిష్యుండేనుగపల్లకి రథాశ్వముల యందు

నెక్కకూడదు గురువులయొక్క పావకోళ్లపీఠపరవుల యందెక్క
డైన కూచుండవలదు ప్రమాదమువలనవసించేనేని గొప్పప్రత్య
వాయము గలుగుచున్నది యెవ్వడుపాదుకాసన శయ్యలయందు
గురువుతోసమానము వశించుచున్నాడో ప్రాయశ్చిత్తములేని
గొప్పప్రత్యవాయము గలుగుచున్నది ॥

శ్లో ॥ గురుసన్నిహితేయస్తు పూజయేదన్యమగ్రతః ॥ ౮ ॥ స
పాపీనరకంయాతి యావచ్చంద్రదివాకరా ॥

తా ॥ ఎవడుగురువు సమీపమందుండగా ఆయనముందర నితరుణ్ని
పూజించుచున్నాడో అపాపి చంద్రసూర్యులుండుపరకు నరకము
బొందుచున్నాడు ॥

—) ( లింగపూజానిరాసనం ) (—

శ్లో ॥ అనారాధ్యమహాదేవం భుంజీయాన్నకదాచన । అసం
పూజ్యనభుంజీతశివ మాప్రాణసంచరాత్ ॥ ౧ ॥

తా ॥ ఎప్పటికిమహాదేవుడైన లింగమునుపూజించక భుజించకూడదు
దేహమందుప్రాణ సంచారముగలుగువరకు లింగమునుపూజించ
క భుజించకూడదు ॥

శ్లో ॥ నపూజయిత్వా ఈశానం యోహిభుక్తే నరాధమః । పా
పానామన్నరూపాణాం తస్యభోజనముచ్యతే ॥ ౨ ॥

తా ॥ ఎనరాధముడు లింగమును పూచేయక భుజించుచున్నాడోవా
నికి నన్న స్వరూపములైన పాపములయొక్క భోజనమని చెప్పబడు
చున్నది ॥

శ్లో ॥ వరంప్రాణ పరిత్యాగశ్ఛే దనంశిరసోపివా । నత్వన
భ్యర్చ్యభుంజీ యాద్వీరశైవస్త్రిలోచనం ॥ 3 ॥

తా ॥ వీరశైవుడైనవాడు ప్రాణము విడుచుతరినైనా నప్పటుకిశిరచ్ఛే
దనమాచున్నప్పటికిన్ని శ్రేష్ఠమైన శివున్ని యర్చించక భుజించ
కూడదు ॥

శ్లో ॥ యోజాతునార్చయేల్లింగం నస్మరేన్నచకీర్తయేత్ ।
క్షిం తేన జాతమాత్రేణ ... ॥ ౪ ॥

తా॥ ఎవడునొకానొకప్పుడైన లింగమునుపూజించడో స్మరించడో కీర్తించడో వాడు పుట్టిన మాత్రముచే నిశ్చయముగా భూభార మౌచున్నాడు ॥

శ్లో॥ యస్తులింగార్చనం త్యక్త్వాభుఙ్క్తేవిట్క్రిమికీటభుక్ నరోనరకగామీస్యా త్సర్వలోకబహిష్కృతః ॥ ౫ ॥

తా॥ ఎవ్వడులింగార్చనము విడిచిభుజించుచున్నాడో వాడుపురీషము పురుగులభుజించిన వాడగు ఆనరుండు,నరకగామియౌను సమస్తలోకములలో బహిష్కృతుడు ॥

శ్లో॥ నపూజయేద్యశ్శాఠ్యే నకాముకో విషయాతురః । కర్మ జ్ఞానోభయభ్రష్టో నిమగ్నోదుఃఖసాగరే ॥ ౬ ॥ రౌరవేనర కేఘోరేవసేదాచంద్రతారకం ॥

తా॥ ఎవడులింగమును కపటభేదముచేత కాముకుడై స్త్రీయాసక్తుడై పూజించకున్నాడో క్రియాజ్ఞానోభయ భ్రష్టుండై దుఃఖవారధి యందుమునుగుచున్న వాడగుచు చంద్రతారలుండు దనకభయంకరరౌరవ నరకమందు వసించును ॥

శ్లో॥ నాస్తిలింగార్చనం యస్తు మ్లేచ్ఛయోనిషుజాయతే॥ ౭ ॥ లింగార్చనరతోయాతి రుద్రత్వంగణముఖ్యతాం ॥

తా॥ ఎవడులింగార్చన నాస్తికుడో (వాడు) నీచయోనులయందు పుట్టుచున్నాడు లింగార్చనాసక్తుండైనవాడు ప్రమథగణముఖ్యమైన రుద్రత్వముపొందుచున్నాడు ॥

శ్లో॥ సతీసుతాశ్చభృత్యాశ్చ దాసీగోపస్తథైవచ ॥ ౮ ॥ స ర్వేలింగార్చకాశ్శ్రేష్ఠాః అన్యేచాండాలవద్గృహాం ॥

తా॥ భార్యపుత్రులు భృత్యులట్లాగె దాసిగోపాలకులందరు లింగార్చకులుశ్రేష్ఠులు అట్లగాకేని చాండాల గృహమువలే ॥

శ్లో॥ పూజాలోపంనకర్తవ్యం సూతకేమృతకేపివా ॥ ౯ ॥ జలబుద్బుదవద్దేహం తస్మాల్లింగంసదార్చయేత్ ॥

తా॥ ప్రసవసూతకమందేకాని మరణసూతకమందేకాని లింగార్చనలోపము చేయవలదు దేహము నీరుబుగ్గవతు అందువలన సదాకాల

ము లింగమునర్చించ వలయును ॥

—) జంగమనిరాకరణం (—

శ్లో ॥ కదాపినావమన్యేత శివయోగినమాగతం । అవమానా ద్భవేత్తస్యదుర్గతిశ్చనసంశయః ॥ ౧ ॥

తా॥ ఎప్పటికైనను (తనయింటికి) వచ్చినటువంటి జంగమను అవమానించకూడదు అవమానమువలన వానికిదుర్గతిగలుగుచున్నది సంశయములేదు ॥

శ్లో ॥ మాహేశ్వరాయస్యగృహే నకుర్యుర్లింగార్చనం ప్రాణశివైక్యభాజః । భుంజీయురన్నంనతుతస్యజన్మవ్యర్థం పశూనామివజీవితంతత్ ॥ ౨ ॥

తా ॥ ఎవనియొక్క మందిరమున శివైక్యప్రాణులైన మాహేశ్వరులు లింగార్చనమున్ను చేయరో ఇంటివారు భుజించునది యన్నముకాదు వానియొక్క జన్మము వ్యర్థము పశువుల యొక్క బ్రతుకువలెయదీ ॥

శ్లో ॥ వినామాహేశ్వరైర్యోయస్తుభుఙ్క్తే షడానన । సపాపవానభుంభుఙ్క్తే సశ్రీకంఠాపరాధభుక్ ॥

తా ॥ ఓయిషణ్ముఖుడా ఎవ్వడు మాహేశ్వరులతో వినాగానొక్కడే భుజించుచున్నాడో ఆపాపవంతుండు కష్టమనుభవించుచున్నాడు శివాపరాధభుక్తుండు ॥

శ్లో ॥ భక్ష్యభోజ్యరసాన్నాది భుఙ్క్తే జంగమవర్జితః । అసాక్షీజంగమంకృత్వా నరకానేవమాచరేత్ ॥ ౪ ॥

తా ॥ ఎవడుజంగమ వర్జితుడై భక్ష్యభోజ్యరసాన్నాదుల భుజించుచున్నాడో జంగమను సాక్షిచేయక నరకములనుబొందును ॥

శ్లో ॥ వివాహేషుప్రతిష్ఠేషుగణ సంకులపర్వణీ । జంగమేనవినాభుఙ్క్తే ప్రసాదం నిష్ఫలంభవేత్ ॥ ౫ ॥

తా ॥ వివాహముల యందు ప్రతిష్ఠలయందు భక్తమాహేశ్వర సమాగమ పర్వణియందు జంగమతోవినా భుజించుచున్నాడో ప్రసాదము నిష్ఫలమౌచున్నది ॥

శ్లో ॥ ప్రసాదమిష్టసంయుక్తం యోభుఙ్క్తే జంగమంవినా । గు
రుద్రోహీశివద్రోహీ భక్తద్రోహీనసంశయః ॥ ౬ ॥

తా ॥ ఎవడుజంగమ వినాయిష్టముతో గూడినప్రసాదమును భుజించుచున్నాడో (వాడు) గురుద్రోహి లింగద్రోహి జంగమద్రోహి సంశయములేదు ॥

శ్లో ॥ భూరుద్రాణాంజంగమానాం విశుద్ధంముక్తిదాయకం ।
ప్రసాదంమంత్రపూతంచ త్యక్త్వామంత్రబహిష్కృతం ॥ ౭ ॥
ప్రకృతాన్నంఘృతదధీభక్ష్యభోజ్యసమన్వితం । షడ్రసా
పూపసంయుక్త మదంతీధరణీతలె । ౮ ॥ ఏతేయమాలయం
గత్వా యమకింకరవేష్టితాః । దాసవత్ప్రేతరాజస్య వ్రజం
త్యాశువరాననే ॥ ౯ ॥

తా ॥ ఓపార్వతీ భూలోకమందునెవ్వరు భూరుద్రులైనటువంటి జంగములయొక్క నిర్మలమైన కైవల్యమిచ్చు నటువంటి మంత్రపూతముగు ప్రసాదము విడిచి మంత్రవిహీనమైన ప్రకృతిసంబంధమగు నన్నము నెయ్యి పెరుగు భక్ష్యభోజ్యముల గూడిన షడ్రసోపేతములగు పిండివంటల గూడుక భుజించుచున్నారో వారె యమకింకరవేష్టితులై యమధర్మరాజు దాసులవలే ప్రసిద్ధము యమాలయము జేరుచున్నారు॥

—( ప్రాదోదకప్రసాదవర్జనం )—

శ్లో ॥ చరపాదోదకం నిత్యంనివేద్యశివపూజనే । గురూచ్ఛి
ష్టఃప్రసాదంచ భుంజీయాద్భక్తినమ్రధీః ॥ ౧ ॥ స్వజాత్యా
శ్రమధర్మం యస్త్యక్త్వాశ్రుత్యోదితంనరః । అన్యజాత్యుచి
తాచారం యచ్చరేత్పతితోభవేత్ ॥ ౨ ॥

తా ॥ భక్తినమ్రత్వముగలవివేకుండు ననుదినము లింగార్చనయందు జంగమపాదోదకము నివేదించి జంగమోచ్ఛిష్టమైన ప్రసాదము భుజించవలయును ఏమనుజుండు శ్రుత్యోదితమగు తమజాత్యాశ్రమ ధర్మము విడిచి యన్యజాత్యుచితాచారము నడుచుచున్నాడో వాడు కులభ్రష్టుండౌచున్నాడు ॥

శ్లో ॥ నపాత [illegible] । భవేద్య

దివాగంధాద్యైః పునస్సంపూజయేత్సుధీః ॥ 3 ॥
తా ॥ బుద్ధికుశలుండైన భక్తుండుజంగమ పాదాభిషేకజలము యొక్కబిందువు క్రిందపడవేయవలదు అథవా పడెనేనిమల్లి గంధపుష్పాదులచేత పూజించవలయును ॥

శ్లో ॥ ప్రసాదపాత్రమధ్యస్థం ప్రక్షాళ్యాంబువరాననె । యెవిక్షిప్యమహాగర్వాః తోయాంసికరవేష్టితం ॥ ౪ ॥ తేయాంతిరౌరవంఘోరే కల్పాంతేపిభయంకరం ॥
తా ॥ ఓపార్వతీ ప్రసాదపాత్ర మధ్యమందున్న ప్రక్షాళోదకము నెవ్వరతిశయగర్విష్ఠులై చేతికంటియున్న జలములఁజల్లుదురో వారు బ్రహ్మకల్పాంతము భయంకరమైన రౌరవఘోరమందు చేరుచున్నారు

శ్లో ॥ శంభోఃపాదోదకం పీత్వాపశ్చాదశుచిశంకయా ॥ ౫ ॥ యశ్చాచమతిమోహేనతం విద్యాద్బ్రహ్మఘాతకం ॥
తా ॥ ఎవడులింగముయొక్క పాదోదకము పుచ్చుకొని యశుచిశంకతో తరునాతసజ్జానముచే తాచమనము చేయుచున్నాడో వాన్ని బ్రహ్మఘాతకుని గాను తెలియవలయును ॥

శ్లో ॥ అణుమాత్రంప్రసాదాన్నం త్యక్త్వాభుక్త్వాచకిల్బిషం ॥ ౬ ॥ సపాపీనరకం యాతితద్గృహం శ్వపచాలయం ॥
తా ॥ ఎవడణుమాత్రము ప్రసాదాన్నమును విడిచిభుజించునో పాతకము నాపాపిష్టుండు నరకముబొందును ఆగృహముశ్వపచాలయము॥

—(*) శివలాంఛనాదిరాహిత్యం (*)—

శ్లో ॥ వినాభస్మత్రిపుండ్రేణ వినారుద్రాక్షధారణం । పూజతోపిమహాదేవో నతస్యఫలదోభవేత్ ॥ ౧ ॥
తా ॥ శివుడు భస్మత్రిపుండ్రముతో వినారుద్రాక్షధారణము వినాపూజింపబడునుగాని యాపూజకునికి ఫలప్రదుడుకానేరడు ॥

శ్లో ॥ వేదస్యాధ్యయనే శూద్రోనాధికారీయథాభవేత్ । త్రిపుండ్రేనవినాభక్తోనాధి కారీశివార్చనే ॥ ౨ ॥
తా ॥ శూద్రుండు వేదాధ్యయనమందు నెట్లధికారములేనివాడౌచున్నాడో అట్లాగే శివభక్తుండు శివార్చనయందు త్రిపుండ్రముచే వినా

యధికారుడు కాడు ॥

శ్లో॥ యోనరోవిపరీతస్స్యా ద్భస్మరుద్రాక్షధారణే । ద్వేషో వాజాయతేవత్సతం విద్యాజ్జారసంభవం ॥ 3 ॥

తా॥ ఓయికుమారుడా యెపురుషుండు భస్మరుద్రాక్ష ధారణయందు విపరీతుడానో లేక ద్వేషియాచున్నాడో వాన్ని జారసంభవుగాను తెలియవలయును ॥

శ్లో॥ ఏకహస్తేనపుండ్రం స్యాదధోముఖవిలేపనం । శ్వాన యోనిశతంగత్వా రౌరవంనరకంవ్రజేత్ ॥ ౪ ॥

తా॥ఒకచెయ్యిచేత పుండ్రనుక్రిందికి ముఖమొంచి భస్మము ధరించునో నూరుమాసలు కుక్కయోనిజన్మించి రౌరవనరకమును బొందును ॥

శ్లో॥ నధారయేత్కరే మూర్ధ్నికంఠే చజపమాలికాం। జపకాలేజపంకృత్వా సదాశుద్ధస్థలేక్షిపేత్ ॥ ౫ ॥

తా॥ జపమాలను హస్తమందు శిరమందు కంఠమందు ధరించవలదు జపకాలమందు జపముచేసి సదాకాలము పరిశుద్ధ స్థలమం దుంచవలసినది (అనగా లింగార్చన పెట్టెయం దుంచవలసినది ॥

శ్లో॥ ఇత్థంవిదిత్వాయత్నేన జపంకుర్యాద్విచక్షణః । సహస్రంవాతదర్ధంవా తదర్ధంవాశతాష్టకం ॥ ౬ ॥ జపేద్యస్తుసదామంత్రం సర్వపాపైఃప్రముక్తయె । నయాతిజపమాత్రేణశివలోకమథాక్షయం ॥ ౭ ॥ సంఖ్యాహీనంకృతం యేన ఫలసిద్ధిర్నజాయతే। సంఖ్యాహీనంకృతం సర్వంరాక్షసేభ్యస్సమర్పితం ॥ ౮ ॥

తా॥ ఈప్రకారము వీరశైవాచార నిపుణుడైనవాడు తెలిసిప్రయత్నముచే వెయ్యియైన ఐదునూరులైన రెండువందల యాభైయైన నూట యనమిదియైన జపముచేయవలయు నెవ్వడు సమస్తపాపముల చే విడుటకై నిత్యము శివమంత్రమును జపించునో జపమాత్రముచే వాడు నాశరహితమైన శివలోకమును పొందుచున్నాడు నెవ్వనిచేత జపము సంఖ్య తక్కువచేయబడునో ఫలసిద్ధి గలగనేరదు సంఖ్యతక్కు—

వ జేసినయావజ్జపము రాక్షసులవల్ల హరింపబడును ॥

శ్లో ॥ సమంత్రకంతుశూద్రోయః పూజయేద్యదిశంకరం । నారకీస్యాన్నసందేహోమమ పంచాక్షరీంవినా ॥ ౯ ॥

తా ॥ శూద్రుండెవ్వడు నాయొక్క పంచాక్షరీమంత్రము వినాసమంత్రకము శివున్ని పూజించునో వాడు నిస్సందేహము నరకభాద్యుడౌచున్నాడు ॥

శ్లో ॥ యస్యాంగేనాస్తి రుద్రాక్ష ఏకోపిబహుపుణ్యదః । తస్యజన్మనిరర్థంస్యాత్త్రిపుంఢ్రరహితంయథా ॥ ౧౦ ॥ రుద్రాక్షాణాంసహస్రం హిముముక్షుర్ధారయేత్సదా । తదభావేశతంవాపిదశచైకమథాపివా ॥ ౧౧ ॥

తా ॥ ఎవనియొక్క శరీరమందు మిక్కిలి పుణ్యమునిచ్చునటువంటి యొక్కటైన రుద్రాక్షములేదో వానియొక్క జన్మము త్రిపుండ్రరహితునివలే నిరర్థకమౌను మోక్షార్థియైన వాడు నెప్పుడు వెయ్యి రుద్రాక్షములు ధరించవలయును (ఆట్లగాదేని) నూరైన పదియైన నొకటైన ధరించవలయును ॥

శ్లో ॥ ధాత్రీఫలప్రమాణం యచ్ఛ్రేష్ఠమేతదుదాహృతం । బదరీఫలమాత్రంచ మధ్యమంప్రోచ్యతేబుధైః ॥ ౧౨ ॥ అధమంచణకాకారం ప్రక్రియైషామయోదితా ॥

తా ॥ రుద్రాక్షలు ఏదియుసిరికాయ ప్రమాణమో యది శ్రేష్ఠమని యుదాహరింపబడినది రేగుకాయ ప్రమాణము మధ్యమమని విద్వాంసులతో చెప్పబడుచున్నది సెనగవిత్తుల ప్రమాణమ ధమమని నాచేత దీనియధికారము చెప్పబడినది ॥

—(*) అనర్హాపత్రపుష్పాణి (*)—

శ్లో ॥ ధూపదీపోపహారాదేర భావేపిద్విజోత్తమ । సాంగంబిల్వదలై రేవ భవిష్యతిశివార్చనం ॥ ౧ ॥ బిల్వపత్రార్థమన్యంతు భవత్యేవనసర్వథా । శూద్రానీతైః క్రయక్రీతైః బిల్వపత్రైర్నమార్చనం ॥ ౨ ॥ యఃకరోతిసమూఢాత్మా రౌరవం నరకంవ్రజేత్ ॥

తా॥ ఓయిద్విజోత్తముడా ధూపదీపోపహారముల యొక్క యభావ మందైనను బిల్వదళములచేత లింగార్చనము సాంగముకాగలదు బిల్వపత్రము ప్రతిరెండవది సర్వథాకానేరదు ఎవ్వడు శూద్రులు తెచ్చినటువంటి యమ్మఁదగినది కొని తెచ్చినటువంటి బిల్వపత్రములచేత నా యొక్క పూజచేయుచున్నాడో ఆమూఢాత్ముండు రౌరవనరకము బొందును॥

శ్లో॥ కేతకీమపవిద్ధాని శీర్ణపర్యుషితానిచ। స్వయంపతితపుష్పాణిత్యజేదుపహతానిచ। ఉగ్రగంధాన్యగంధానిశూద్రానీతానివర్జయేత్ ॥ ౪ ॥ తథాఎరండపత్రైశ్చవాసోభిః కుత్సితాత్మభిః । ఆనీతేనార్చయేచ్ఛంభుం ప్రమాదాదపి దోషకృత్ ॥ ౫ ॥

తా॥ మొగిలిపుష్పమును కుచ్చబడిన పువ్వులు శిథిలమైనవి రాత్రిగడిచినవి రాలినటువంటివి కొట్టబడినపుష్పములు విషువవలయు నధికగంధము గల నిర్గంధము గల శూద్రులు తెచ్చినవి విషువవలయునట్లాగె యామిదపాకులచే బట్టలచే నీచులచే తెచ్చినటువంటి పుష్పములు లింగమునుగూర్చి యర్పించవలదు ప్రమాదము వల్లైనప్పటికి దోషముచేసినవాడౌను॥

## ( అనర్పితం )

శ్లో॥ పత్రపుష్పం ఫలం తోయం అన్నపానాదిశౌషధం। లింగార్పితం వినాభుక్త్వా సద్యోభవతి కిల్బిషీ ॥ ౧ ॥

తా॥ పత్రము పుష్పము ఫలము జలము అన్నపానము మొదలగు ఔషధమును లింగార్పితముచేయక భుజించుచున్నాడో అప్పుడె పాపియౌచున్నాడు॥

శ్లో॥ అనర్పితానిద్రవ్యాణి వర్జయేద్భక్తిమాన్నరః । అభక్షితానిద్రవ్యాణి భుంజీయాద్యదిమానవః ॥ ౨ ॥ కుర్యాత్ప్రాణపరిత్యాగం పుత్రాదీన్నవిచారయేత్ ॥

తా॥ భక్తివంతుడైన పురుషుండు లింగానర్పిత పదార్థములు వర్జించవలయు నెమానవుండు భక్షిత పదార్థములు భుజించేనేని పు

త్రాదుల విచారించక ప్రాణత్యాగము చేయవలయును ॥

శ్లో ॥ అప్యాపదిదురంతా యామన్య దేవార్పితంసుధీః ॥ 3 ॥
నభుంజీయాత్ప్రమాదేనభుక్త్వాసఃపతితో భవేత్ ॥

తా ॥ వివేక బుద్ధిశాలియైన వాడు దురంతమైనా పదయందైన నితరదేవార్పితమైన పదార్థము భుజించకూడదు ప్రమాదమువలన భుజించుచున్నాడో వాడు పతితుడౌచున్నాడు ॥

శ్లో ॥ పాత్రస్థం శివభుక్తంహి భుంజీయాత్తదతంద్రితః ॥ ౪ ॥
భాండస్థంన భుంజీయాద్యదిభుక్త్వాచసపాపభుక్ ॥

తా ॥ స్థాలియం దున్నటువంటి లింగార్పితమైన ప్రసాగమును తొందరలేక భుజించవలయును భాండమందున్న పదార్థము భుజించకూడదు భుజించినట్లైతె వాడుపాతకభుక్తుండు ॥

—(అన్యదేవార్చనం)—

శ్లో ॥ లింగార్చనైకశరణోఽన్య దేవస్య పూజయేత్ । నరకే నరకంగత్వాకుష్ఠిచాంగీచజాయతె ॥ ౧ ॥

తా ॥ ఏమాహేశ్వరుడు కేవలలింగార్చకుండై యితర దేవతయొక్క పూజచేయుచున్నాడో (అతడు) నరకమందు నరకముబొంది కుష్ఠశరీరియై పుట్టుచున్నాడు ॥

శ్లో ॥ ఇష్టలింగంపరిత్యజ్యఅన్యదై వముపాస్యతె । ప్రసాదం నిష్ఫలంచైవ రౌరవం నరకంవ్రజేత్ ॥ ౨ ॥

తా ॥ ఇష్టలింగమును విడిచిపెట్టి యన్య దేవతను సేవించుచున్నాడో ప్రసాదనిష్ఫలమున్ను రౌరవ నరకముబొందును ॥

శ్లో ॥ శివాచారస్యసంపన్నోన్య దైవస్యప్రసాదభుక్ । నప్రసాదీనచాచారీసర్వభక్షీచకాకవత్ ॥ 3 ॥

తా ॥ శివాచారముయొక్క ప్రపన్నుడై యన్య దేవతయొక్క ప్రసాదముభక్షించునో (వాడు) ప్రసాదికాడు ఆచారుడుకాడు సర్వము భక్షించు కాకివలే ॥

శ్లో ॥ యోలింగనిష్ఠసన్నోమహీ అన్యదైవనమస్కృతః । తస్య నరకంప్రసిద్ధం స్యాత్తస్యసంభాషణంనహి ॥ ౪ ॥

తా ॥ ఎవ్వడు ఇష్టలింగ నిష్ఠ మోహితుడై రెండవ దేవునికి నమస్కారముచేయునో వానికి నరకము ప్రసిద్ధమౌను వానియొక్క సంభాషణముకూడదు ॥

శ్లో ॥ శివార్చనపరోభూత్వా అన్యదైవంక్వచిత్స్మరేత్ ।
అష్టవింశతికోట్యాంచ నరకేకాలమక్షయం ॥ ౫ ॥

తా ॥ లింగార్చన పరుడైయుండి యొకప్పుడన్యదేవతను స్మరించుచున్నాడో (వాడు) ఇరువది యెనిమిది కోట్ల నరకమం దక్షయకాలముండును ॥

శ్లో ॥ శివమేవపరిత్యజ్య అన్యదైవముపాసతే । తృషితోజాహ్నవీతీరె కూపంఖనతిదుర్మతిః ॥ ౬ ॥

తా ॥ శివుడైన లింగమూర్తిని విడిచి యన్యదేవతను సేవించుచున్నాడో దాహముగొన్నవాడై జాహ్నవితీరమందు బావిత్రవ్వుచున్నవానివలె దుర్మతియని తెలియవలయు ॥

శ్లో ॥ అన్యదైవనమస్కార మన్యదైవస్యపూజనం । అన్యదైవజపంస్తోత్రం నరకేకాలమక్షయం ॥ ౭ ॥

తా ॥ అన్య దేవతనుగూర్చి నమస్కార మన్యదేవతయొక్క పూజ యన్యదేవత జపము స్తోత్ర మక్షయకాలము నరకమందుండుటకు కారణము ॥

—(యాత్రాచరణం జ్ఞానకాండ)—

శ్లో ॥ పృథివ్యాంయాని తీర్థానియానిపుణ్యానితానిచ । వసంతిశివలింగేచతాని సర్వాణినారద ॥ ౧ ॥

తా ॥ ఓయినారదుడా భూమియందేవి తీర్థము లేవిపుణ్యములు (గలవో) యవియన్నియు శివలింగమునందుండియున్నవి ॥

శ్లో ॥ ప్రాణలింగంపరిత్యజ్య అన్యలింగముపాసతే । యోనరోనరకంయాతి యావదాచంద్రతారకం ॥ ౨ ॥

తా ॥ ఎవ్వడుప్రాణలింగము (అనగా ఇష్టలింగమును) విడిచి స్థావర లింగమును పూజించుచున్నాడో (ఆపురుషుండు) చంద్రతారలుండు వరకు నరకముబొందుచున్నాడు ॥

శ్లో ॥ ఇష్టలింగమవిశ్వాసం తీర్థలింగంచవిశ్వసేత్ । శ్వాన యోనిశతంగత్వా చండాలగృహమావిశేత్ ॥ ౩ ॥

తా ॥ ఇష్టలింగమును నమ్మక పుణ్యక్షేత్రస్థావర లింగమును నమ్మిక చేయుచున్నాడో(వాడు)కుక్కయోనియందు నూరుమారులు జన్మించి చాండాలగృహము ప్రవేశించును ॥

శ్లో ॥ ఇష్టలింగమవిశ్వాసంగ్రామ లింగంతుపూజయేత్ । శ్వానయోనిశతం గత్వాచాండాలగృహమాచరేత్ ॥ ౪ ॥

తా ॥ ఎవ్వడిష్టలింగమును విశ్వాసముజేయక గ్రామలింగమును పూజించునో(వాడు)కుక్కయోనియందు నూరువరుసల పుట్టిచాండాల గృహముచేరును ॥

శ్లో ॥ సదాశివైకనిష్ఠానాం వీరశైవాధ్వవర్తినాం । నహిస్థావరలింగానాం నిర్మాల్యముపయోజయేత్ ॥ ౫ ॥

తా ॥ ఎల్లప్పుడు లింగైకనిష్ఠులై నటువంటి వీరశైవమార్గ ప్రవర్తులగు వారికి స్థావరలింగములయొక్క నిర్మాల్యము(అనగా పత్రపుష్ప జలగంధాక్షతోపహారము)లుపయోగించతగదు ॥

శ్లో ॥ వీరశైవస్యభక్తానాం త్రివిధంపూజయేత్సదా । భుక్తిదంముక్తిదంచైవ శివాచారపథంభవేత్ ॥ ౬ ॥

తా ॥ వీరశైవముయొక్క భక్తులైనటువంటివారికి భుక్తినిచ్చునటువంటి ముక్తినిచ్చునటువంటి యిష్టప్రాణభావత్రివిధలింగములను సదా పూజించవలయునిదే శివాచారపథమౌను ॥

శ్లో ॥ వీరశైవసుభక్తానాం గురులింగచరస్యచ । పూజనంసతతంభక్త్యాన్యలింగంతు వివర్జితం ॥

తా ॥ వీరశైవ సద్భక్తుల కెల్లపుడు గురులింగ జంగమ యొక్క పూజభక్తితో(చేయుటదక్క)ఇతర లింగమును వర్జింపబడినది ॥

శ్లో ॥ నతేషాంవిద్యతేతీర్థం నయజ్ఞంనవ్రతాన్యపి । నయోగకరణాపేక్షః నవాగపరిశోధనం ॥ ౮ ॥

తా ॥ అట్టివీరశైవులకు గంగాదిస్నానములేదు యజ్ఞములేదు వ్రతములులెవు యోగకరణాపేక్షలేదు వాగపరిశోధనములేదు ॥

## —)*( ఉపవాసఃజ్ఞానకాండ )*(—

శ్లో ॥ ఉపవాసం జపం హోమం శ్రాద్ధంచ పితృతర్పణం ।
ప్రాకృతాచారసంబంధం శివభక్తోవివర్జయేత్ ॥ ౧ ॥

తా ॥ శివభక్తుండు ప్రాకృతాచార సంబంధమై నటువంటి యుపవాసము రుద్రేతర వేదపాఠము విశ్వదేవప్రీత్యర్థకర్మము మృతమైనతిథికర్మముపితృదేవతర్పణము విడిచిపెట్ట వలయును ॥

శ్లో ॥ సోమవారేవ్యతీపాతే పంచపర్వప్రవర్తనే । ఏకభుక్తోపవాసేన నరకేకాలమక్షయం ॥ ౨ ॥

తా ॥ సోమవారమందు వ్యతిపాత యోగమందు పంచపర్వ ప్రవర్తనమందు (అనగా) చతుర్దశి అష్టమి పున్నమ అమవాస్య రవిసంక్రమి పంచపర్వముల యందేక భుక్తోపవాసము చేయుటచే నరకమందక్షయకాల ముండవలయును ॥

శ్లో ॥ సోమేభౌమేపూర్ణిమాయాంసంక్రాంతిశివరాత్రయోః ।
శివభక్తోనిరాహారీ లింగద్రోహీతికథ్యతే ॥ ౩ ॥

తా ॥ శివభక్తుండు సోమవారము మంగళవారము పున్నమ సంక్రాంతి శివరాత్రులయందు నిరాహారియయ్యెనేని లింగద్రోహియని చెప్పబడుచున్నది ॥

శ్లో ॥ ప్రాణలింగప్రసాదీస్యా న్నోపవాసాదికంచరేత్ ।
మోహాద్యదాచరేత్తస్యప్రత్య వాయోమహాన్భవేత్ ॥ ౪ ॥

తా ॥ ప్రాణలింగ ప్రసాదియైన వాడుపవాసము మొదలైనవి చేయకూడ దజ్ఞానమువల నెప్పుడుచేయునో వానికి గొప్పప్రత్య వాయముగలుగును ॥

## —( పరద్రవ్యాపహరణం )—

శ్లో ॥ శివద్రవ్యంగురుద్రవ్యం యతిద్రవ్యంతథైవచ । అపేక్షం నరకంచైవ భక్షితంచకులక్షయం ॥ ౧ ॥

తా ॥ స్థావరలింగ సంబంధ మైనద్రవ్యము గురుద్రవ్యము విరక్తిద్రవ్యమున్ను కోరుట నరకము, భక్షించునేని వంశక్షయము ॥

శ్లో ॥ పరద్రవ్యంతృణంచైవ యోగృహ్ణాంతినరాధమాః । కృ

తపుణ్యం విఫలంస్యాజ్జా యం తేహీనయోనిషు ॥ ౨ ॥

తా ॥ ఎవరాధములు పరద్రవ్యమై నటువంటి తృణమైనను తీసుకొను చున్నారో (వారుచేసిన) పుణ్యమునిష్ఫలమై నీచయోనులయందు పుట్టుచున్నారు ॥

శ్లో ॥ క్షేత్రం విత్తం ధనం ధాన్యం జంగమస్యాహరేద్యది। అధఃపతేద్వీరశైవస్సా మాన్యశైవఏవవా ॥ ౩ ॥ ఉభయోరపితుల్యస్స్యాద్ధర్మశ్శైవపురోదితః । అవిశుద్ధానికుర్వీత విశుద్ధానితుజంగమే ॥ ౪ ॥ సామాన్యశైవధర్మాణాం ప్రమదాద్ద్రోహమాగతే। ఆగమేనర్ణితాదివ్యే నిష్కృతిర్జంగమార్చనాత్ ॥ ౫ ॥ వీరశైవీయధర్మాణాం ద్రోహేనాస్త్యేవనిష్కృతిః । సామాన్యానాం తథాన్యేషామేష ధర్మస్సనాతనః ॥ ౬ ॥

తా ॥ వీరశైవుడైన సామాన్యశైవుడైనను జంగమయొక్క భూమిధనము పశుధనము ధాన్యము హరించునేనియు పూర్వోదితశివధర్మమువల్లను భయులకుసమానమాను (కనక) నరకమునపడును జంగమమందు విశుద్ధముల విశుద్ధములు చేయునా సామాన్యశైవ ధర్మ్మలకు పొరపాటువలన ద్రోహముగలిగిన యడ దివ్యాగమమందు చెప్పిన ప్రకారము జంగమార్చనవలన ప్రాయశ్చిత్తమౌచున్నది వీరశైవ ధర్మ్మలకు ద్రోహమందు ప్రాయశ్చిత్తములేనె లేదు యిది సామాన్యశైవుల కితరులకు సనాతన ధర్మము ॥

—) పరస్త్రీవాంఛాః (—

శ్లో ॥ దాసీకన్యాచత్యక్తస్త్రీ విధవాచపరాంగనా । గణికావనితాషణ్ణాం సంగమంచవివర్జయేత్ ॥ ౧ ॥

తా ॥ దాసికన్యా మగడువిడిచినస్త్రీ విధవా సువాసిని భోగస్త్రీ మోహించుధాన్ని ఈయారుగురియొక్క సంపర్కము విడువలయునది సామాన్య ధర్మము ॥

శ్లో ॥ ఏకపత్నీవ్రతంచైవ శివాచారపథంభవేత్ । అన్యస్త్రీదృగ్విలాసంచ ద్వేష్యం మహాదోషశ్చ సదా ॥ ౨ ॥

శాపుశావర్జయే న్నే త్రె నేత్రశుద్ధిరిహోచ్యతె ॥
తా ॥ ఏకపత్నీవ్రతమే శివాచారపద్ధతి యగుచున్నది యెల్లకాలము పరస్త్రీ దృగ్విలాసమున్ను మహేశ్వరునియందు ద్వేషమున్ను కెం ఱకంచూపులు విడువవలయు నిదీనేత్రశుద్ధియని చెప్పబడుచున్నది ॥
శ్లో ॥ పరదారాన్నపశ్యేచ్చ మనసాచకదాచన ॥ ౩ ॥ దర్శ నంస్పర్శనంచైవ పరస్త్రీణాంచవర్జయేత్ ॥
తా ॥ ఎప్పుడైన మనసుచేత పరభార్యలను చూడవలదు పరస్త్రీల యొక్క దర్శనమున్ను స్పర్శనమున్ను వర్జించ వలసినది ॥
శ్లో ॥ పరయోనిపతన్బిందు జన్మకోటిషుసూకరః ॥ ౪ ॥ సర్వ హానిఃతపోహానిః భ్రూణహత్యాందినేదినే ॥
తా ॥ పరస్త్రీయోని యందు వీర్యబిందువు పడునేని సమస్తపుణ్యవి ఘ్నము తపోహాని దినదినము భ్రూణహత్యయు కోటిజన్మములయం దు పందిగాను పుట్టును ॥
శ్లో ॥ పరనారీకుచాగ్రాహ్య చుంబనాలింగనంరతిం ॥ ౫ ॥ యః కరోతిసపాపాత్మా రౌరవంనరకంవ్రజేత్ ॥
తా ॥ ఎవ్వడు పరస్త్రీ కుచములు బట్టుకాలింగన రతినిచేయుచున్నాడో ఆదురాత్ముడు రౌరవనరకమును బొందును ॥

—(*) అలింగిసాంగత్యం (*)—

శ్లో ॥ లింగధారణసద్భక్తో లింగబాహ్యసతీసుతాః । ఆలిం గనంచుంబనాదీ కుర్యాచ్చేన్నరకంవ్రజేత్ ॥ ౧ ॥
తా ॥ లింగధారుడైన సద్భక్తుండు లింగబాహ్యులైన సతీసుతుల ను కౌంగలించి చుంబనాదులును చేయుచున్నాడో (వాడు) నరక ముబొందును ॥
శ్లో ॥ లింగేనసహదేహీచ లింగబాహ్యసతీయుతః । శ్వాన యోనిశతంగత్వా చాండాలగృహమాచరేత్ ॥ ౨ ॥
తా ॥ లింగముతో గూడుకొన్న శరీరుండు(అనగా లింగాంగుడు)లింగ ములేనిసతిగూడి యున్నాడో (వాడు) నూరుమారులు కుక్కయోని యందుజన్మించి చాండాలగృహము చేరును ॥

శ్లో ॥ లింగినాంసదనేపీత్వా భుంజీయాద్భక్తిసంయుతః । త్రి
లింగీనాంద్విజాదీనాం వర్జయేచ్చగృహాణిచ ॥ 3 ॥
తా ॥ లింగధారులయొక్క మందిరమందు భక్తియుతముగా అన్న
పానము పుచ్చుకొని భుజించవలయును లింగము లేనటువంటి ద్విజుల
యొక్క గృహములను వర్జించవలసినది ॥
శ్లో ॥ సలింగీభవిభాండాని పాకయత్నంవివర్జయేత్ । అభో
జనపదార్థంచ నార్పితంచమమప్రియె ॥ ४ ॥
తా ॥ ఓపార్వతి లింగవంతుడు భవిభాండముల వంటయత్నము వ
ర్జించవలయు నభక్షపదార్థ మర్పించ వలదు ॥
శ్లో ॥ సద్భక్తోభక్తసంయోగేనభుంజీయాత్కదాచన । తథా
పిభుంజీయాద్దేవి ప్రసాదత్రయనాశనం ॥ ౫ ॥
తా ॥ ఓపార్వతీ క్రియాచార సంపన్నుడైన సద్భక్తుండు క్రియాచా
రవిహీనులైన భక్తసం యోగమందు నొకానొకప్పుడు భుజించవల
దు తథాపి భుజించునేని ప్రసాదత్రయ నాశనము ॥

—(*) అన్యాచారం (*)—

శ్లో ॥ యద్గృహేష్వన్యదేవోస్తి తద్గృహాణిపరిత్యజేత్ । యే
చదేవార్చకామర్త్యాః స్సదాశివబహిష్కృతాః ॥ ౧ ॥ తే
షాంగృహేష్వభుంజీత ఎతద్వాక్యప్రమాణతః । యత్రచా
చారనిందాస్తైకదాచిత్తత్రనవ్రజేత్ ॥ ౨ ॥
తా ॥ ఎగృహములయం దితరదేవు డుండియున్నాడో ఆగృహముల
ను వర్జించవలయు నేమానవులు దేవపూజారులో వారు సదాలిం
గబహిష్కృతులునీ వాక్యప్రమాణమువలన వారియొక్క గృహము
లయందు భుజించ కూడదు ఎక్కడా చారనింద గలదో అక్కడెప్ప
టికి పాతగను ॥
శ్లో ॥ స్వమార్గాచారవిముఖై స్సహావాసంపరిత్యజేత్ ॥
యద్గృహేషుభవిప్రాప్తి స్తద్గృహాణిపరిత్యజేత్ ॥ 3 ॥
తా ॥ తమమార్గాచార విముఖుల చేత సహవాసము విడువవలయు
నేగృహములయందు భవిగలిగి యున్నాడో ఆగృహములను విడువ

టసినది ॥

శ్లో ॥ ఉత్తమాంగతిమాశ్రిత్యన నీచాంవృత్తిమాశ్రయేత్ ।
ఆరూఢపతితోజ్ఞేయ స్సర్వకర్మబహిష్కృతః ॥ ౪ ॥

తా ॥ శ్రేష్ఠమైన స్థితిననుసరించి నీచమైనవృత్తి నాశ్రయించ కూడదు పైకెక్కి క్రిందపడినవాడు సర్వకార్యములయందు బహిష్కృతుడని తెలియవలయు ॥

—( శివాచారనిందా )—

శ్లో ॥ శివనిందాకరందృష్ట్వా ఘాతయేదథవాశపేత్ । స్థానం
వాతత్పరిత్యజ్య గచ్ఛేద్యద్యక్షమోభవేత్ ॥ ౧ ॥

తా ॥ శివనింద చేసెవాన్ని చూచిచంపవలసినది యథవా శపించవలసినది యసమర్థుండౌనేని యాస్థలమైన విడిచిపోనలయును ॥

శ్లో ॥ యత్రస్థావరలింగానామపాయఃపరివర్తతే । అథవాశివభ
క్తానాం శివలాంఛనధారిణాం ॥ ౨ ॥ తత్రప్రాణాన్విహాయా
పి పరిహారంసమాచరేత్ । శివార్థంముక్తజీవశ్చేచ్ఛివసా
యుజ్యమాప్నుయాత్ ॥ ౩ ॥

తా ॥ ఎక్కడస్థావర లింగములకు అథవా నవవిధభక్తిగల శివభక్తులకు శిలాంఛన ధారులకు (అనగా) గజాజినమేకంథా గంగయేకమండలము బ్రహ్మకపాలమేభిక్షపాత్ర విష్ణుకంకాళమే దండాగ్రము మన్మథదహనమే భస్మఘుటిక ఈపంచముద్ర ధారులైన మాహేశ్వరులకు నష్టము గలుగుచున్నదో అక్కడ పార్వతిదేవి ప్రతిజ్ఞవహించి ప్రాణములు విడిచినైన పరిహరించ వలసినది శివునికొఱకుజీవము విడుచునేని శివసాయుజ్యము పొందును ॥

శ్లో ॥ శివపంచాక్షరీమంత్రం భస్మరుద్రాక్షనిందతి । శ్వాన
యోనిశతంగత్వా చాండాలగృహమాచరేత్ ॥ ౪ ॥

తా ॥ ఎవ్వాడు శివపంచాక్షరి మంత్రమును భస్మరుద్రాక్షను నిందించుచున్నాడో (వాడు) కుక్కయోనియందు నూరుమార్లు జన్మించి చాండాలగృహము చేరును ॥

శ్లో ॥ లింగజంగమతీర్థంచ ప్రసాదంభస్మదూషణం । శ్రే

ల్పాంతం కోటిజన్మాని భ్రమతిశ్వానయోనిషు ॥ ౫ ॥

తా ॥ ఎవ్వడు లింగజంగమ తీర్థమును ప్రసాదము భస్మము దూషించుచున్నాడో (వాడు) కల్పాంతము కోటిజన్మములు శునకయోనుల యందు పుట్టుచున్నాడు ॥

శ్లో ॥ అపహాస్యతియోమూఢః నిందతేచశివార్చనం । జన్మజన్మార్జితం పుణ్యంభస్మీభవతితత్‌క్షణం ॥ ౬ ॥

తా ॥ ఏమూఢుండు లింగార్చనము గూర్చి యపహసించుచున్నాడో నిందించుచున్నాడో (వాని) జన్మజన్మార్జిత పుణ్యమాక్షణము భస్మమాచున్నది ॥

శ్లో ॥ లింగభక్తేసకృద్ద్వేష్టి సకృల్లింగస్యదూషణం । యుగకోటిక్రిమిన్భుక్త్వా జాయతేక్రిమిజన్మనీ ॥ ౭ ॥

తా ॥ ఎవ్వడు లింగభక్తుని యందొకపారి ద్వేషము చేయుచున్నాడొకపారి లింగముయొక్క దూషణచేయుచున్నాడో (వాడు) కోటియుగములు క్రిములభుజించి క్రిమిజన్మమందు పుట్టుచున్నాడు ॥

శ్లో ॥ శివాచారంశివేభక్తిం లింగజంగమపూజనం । యోనిందతిదురాచారీ రౌరవం నరకం వ్రజేత్ ॥ ౮ ॥

తా ॥ ఎవ్వడు శివాచారమును శివభక్తిని లింగజంగమపూజను నిందించుచున్నాడో ఆదురాచారుండు రౌరవనరకము నొందును ॥

శ్లో ॥ జంగమస్యప్రసాదాన్న ముచ్ఛిష్టమితియోవదేత్ । శ్వానయోనిశతంగత్వా చండాలగృహమాచరేత్ ॥ ౯ ॥

తా ॥ ఎవ్వడు జంగమయొక్క ప్రసాదాన్నము నుచ్ఛిష్టమని పలుకునో (వాడు) కుక్కయోని యందు నూరుమారులు పుట్టి చాండాలగృహము చేరును ॥

శ్లో ॥ వీరశైవవ్రతాచారీ సాక్షాత్సర్వేశ్వరోభవేత్ । తస్మాత్సర్వప్రయత్నేన తన్నిందావర్జయేత్సుధీః ॥ ౧౦ ॥

తా ॥ వీరశైవాచారుండు ప్రత్యక్షము వలన సర్వేశ్వరుం డాచున్నందువలన బుద్ధివంతుడైన వాడు సకలప్రయత్నముచే వానినింద విడువవలయును ॥

) అలింగ్యవలోకనం (

శ్లో ॥ అభక్తదర్శనేసద్యః పదార్థాంపరివర్జయేత్ । అభక్తస్పర్శనంచైవ వర్జయేత్తత్పదార్థకం ॥ ౧ ॥

టీ ॥ భవిదర్శనమందు అర్చనార్పణ పదార్థమప్పుడె విడిచిపెట్టవలయు స్పర్శమాయెనేనియు పదార్థము నువర్జించవలసినది

శ్లో ॥ యశ్శివాచారసంపన్నో అన్యాచారేణమిశ్రితః । నప్రసాదీనచాచారీ సర్వభక్షీచకాకవత్ ॥ ౨ ॥

టీ ॥ ఎవ్వడు శివాచార సంపన్నుడై యితరాచారముతో కలిసియున్నాడో (వాడు) ప్రసాదియుకాడు అచారవంతుడుకాడు సకలము భక్షించు కాకివలెయని తెలియవలయు ॥

శ్లో ॥ దుర్జనంచదురాచారిం దుర్ముఖంచాప్యదీక్షితం । ప్రమాదాద్దర్శనంకృత్వాసా పూజానిష్ఫలాభవేత్ ॥ 3 ॥

టీ ॥ లింగార్చనయెడ దుర్జనుని దురాచారిని దుష్టవాక్యుని లింగ సంస్కారములేన్ని వాని పొరపాటువల్ల దర్శనము చేసెనేని పూజనిష్ఫల మాచున్నది ॥

శ్లో ॥ అంత్యజంపుష్పిణీంమాంస భక్షిణంమద్యపానినం । కుంభకంగోళకంచైవ అసతీంనైవదర్శయేత్ ॥ ౪ ॥

టీ ॥ చాండాలున్ని రజస్వాతకిని మాంసభక్షిని కల్లుద్రాగువాన్ని జారునికి పుట్టినవాన్ని విధవకు పుట్టినవాన్ని వ్యభిచారిని దర్శించకూడదు ॥

—) ( అన్యలాంఛనధారణం ) (—

శ్లో ॥ శివలాంఛనసంయుక్తో అన్యచిహ్నాంచధారయేత్ । తద్దోషేణచభక్తస్య రౌరవంనరకంవ్రజేత్ ॥ ౧ ॥

టీ ॥ శివలాంఛనము గూడుకొన్నవాడై యితర లాంఛనమును ధరించునో ఆదోషముచే భక్తునికి రౌరవనరకము బొందనగును ॥

శ్లో ॥ అన్యలాంఛనసంయుక్తైస్సంభాషీసహవాసవా । మద్ద్రోహీస్నేహసంపన్నో అంతద్రోహీతికథ్యతె ॥ ౨ ॥ బహిద్ద్రోహీసవిజ్ఞేయః అన్యలాంఛనసంయుతః । కల్పాంతేస

విముచ్యేతనాం తద్రోహీవిముచ్యతే ॥ 3 ॥

తా ॥ అన్యలాంఛన యుక్తులైనవారితో (అనగా స్వమతద్వేషమతచిహ్నములుగలవారితో) ప్రియగోష్ఠిచేయుచు సహవాసముచేయుచు స్నేహ సంపన్నుడైనవాడు నాయొక్క ద్రోహీ యంతద్రోహీ యని చెప్పబడుచున్నది యన్యలాంఛన యుతుడగువాడు బహిద్రోహి యని తెలియవలయు కల్పాంతమందు బహిద్రోహి విముక్తుడౌను అంతద్రోహివిముక్తుండు కానేరడు ॥

—( ప్రాణిహింసా )—

శ్లో ॥ వీరశైవమతంప్రాప్య యః కుర్యాత్ప్రాణహింసకం । క
ర్మణామనసావాచా సనస్రౌరవమాచిరం ॥ ౧ ॥

తా ॥ ఎవ్వడు వీరశైవ మతనుబొంది కర్మతో మనసుతో వాక్కుతో ప్రాణహింసచేయునో (అనగా ప్రాణపీడనము చేయునో) వాడు బహుకాలము రౌరవమందు వసించును ॥

శ్లో ॥ యఃకుర్యాద్వీరశైవస్థః పీడనంప్రాణినాంభువి । సజీవ
న్నేవచండాలో మృతోనరకమశ్నుతె ॥ ౨ ॥

తా ॥ ఎవ్వడు వీరశైవమతస్థుడై భూమియందు మనుష్యాది జంతువులకు పీడనము (అనగా బాధకరము) చేయునో వాడు జీవితమందు చండాలుడు మృతుడై నరకము బొందును ॥

శ్లో ॥ మశకాన్మత్కుణాన్యూకాన్ దంశాదీన్ప్రాణినస్సదా ।
ఆత్మోపమ్యేనరక్షంతి మానవాయెదయాళవః ॥ 3 ॥ క్రిమికీటపతం
గాంశ్చ తథాదేవివనస్పతీన్ । ననాశయేద్బుధోజీవాన్ పర
మార్థమితిస్మరన్ ॥ ౪ ॥

తా ॥ఓపార్వతీ యెమానవులు దయావంతులైన వారలెల్లవును దోమలను నల్లులను చిలకలను అడివీగెలు మొదలైనప్రాణులను తమాత్మతుల్యముగా రక్షించుచున్నారు అట్లాగె వీరశైవాచార విద్వాంసుడైన వాడు జీవములగూర్చిన పరమార్థమని స్మరించుచు బుద్ధిమంతుడు పురుగు మిడుతలను వృక్షములను నాశనముచేయ వలదు।



—( లోకనింద )—

 

శ్లో॥ సదాకాలేశివేభక్తిర్లింగజంగమయోరపి। ఏకపత్నీవ్రతంచైవ మమమాహేశ్వరంవ్రతం॥ ౧ ॥

తా॥ సదాకాలమందు శివునియందు లింగజంగముల యందుభక్తియేకపత్నీ వ్రతము నాయొక్క మాహేశ్వరుని వ్రతము॥

శ్లో॥ ఏకలింగాశ్రితంశీలం ద్వితీయోనావమన్యతే। పరిచ్ఛేదకరంశీలం మమమాహేశ్వరంవ్రతం॥ ౨ ॥

తా॥ లింగాశ్రయమైన శీలమొకటియె కాక రెండవది మన్నించకుండియున్నాడో (అదే) ప్రత్యేకించిన శీలము నాయొక్క మాహేశ్వరుని వ్రతము॥

శ్లో॥ శివనిందాగురునిందా భక్తనిందాభవేద్యది। అవిచారణేనహం తన్యంవీరమాహేశ్వరంవ్రతం॥ 3 ॥

తా॥ శివనింద గురునింద భక్తనింద గలిగెనేని విచారరాహిత్యముగా వధించవసినదే వీరమాహేశ్వరుని వ్రతము॥

శ్లో॥ శివచిహ్నంవృషభంచ హంతియోహిదురాత్మవాన్। హంతవ్యాస్తస్య హస్తేనవీరమాహేశ్వరంవ్రతం॥ ౪ ॥

తా॥ ఎదురాత్ముండు శివలాంఛనముగల యెద్దును చంపుచున్నాడో (వాన్ని) తనహస్తముచేత వధించవలసినది వీరమాహేశ్వరుని వ్రతము॥

శ్లో॥ మన్నియమంమయాప్రోక్తం మమమాహేశ్వరంవ్రతం। మత్కృతంతత్పరిత్యజ్య స్వేచ్ఛయావర్తతెయది॥ ౫॥ సమూఢోనరకేఘోరే వసేదాబ్రహ్మకల్పకం॥

తా॥ నాయొక్కని యామకము నాతోచెప్పబడి నటువంటి నాయొక్క మాహేశ్వరుని వ్రతమునెవ్వడు నావల్లచేయబడిన దదివిడిచి తన యిచ్ఛచే నడుచుచుండెనేని ఆమూఖుండు బ్రహ్మకల్పము వరకు ఘోరనరకమందు వసించును॥

శ్లో॥ వ్రతాచారంతుభక్తానాం మత్ప్రియంలోకపూజితం॥ ౬ అవ్రతంచమహాదేవి సలింగీభవినానమః॥

తా॥ శివపార్వతి భక్తులయొక్క వ్రతచర్య నాకుప్రియము లోకపూ

జ్యము వ్రతహీనుడు లింగవంతుడైనను భవితోసమానుడు ॥

—( అనాచారం )—

శ్లో ॥ సదాచారంప్రవక్ష్యామి సమ్యజ్ఞానస్యసాధనం । తస్మా దాచారహీనస్య తత్ జ్ఞానంనిష్ఫలంభవేత్ ॥ ౧ ॥

తా ॥ సదాచారమును చెప్పుచున్నాను లెస్సజ్ఞానమునకు సాధనమై నటువంటిదీ అందువల్లనే యాచారహీనుని యొక్క జ్ఞానము నిష్ఫలమాచున్నది ॥

శ్లో ॥ అస్నాత్వా వైవిషంభుక్త్వా త్వజప్త్వాపూయశోణితం । అనభ్యర్చ్యకిమింభుక్త్వా హ్యదత్వావిష్టిమశ్నుతే ॥ ౨ ॥

తా ॥ స్నానముచేయడేని విషము భుజించుచున్నాడు జపముచేయడేని చీమునెత్తురు త్రాగుచున్నాడు పూజచేయడేని పురువుల భుజించుచున్నాడు అతిథికిపెట్టడేని(అనగాజంగమకు పెట్టడేని) నరకము జెందుచున్నాడు ॥

శ్లో ॥ స్నాత్వాద్వివారం శివమర్చయిష్య । న్భుంజీతనోచే న్నరకంప్రయాతి ॥ ౧ ॥

తా ॥ రాత్రిపవలు రెండుమాలుగా స్నానముచేసి లింగమునర్చించుచు భుజించవలయు (చేయడేని) నరకమును పొందుచున్నాడు ॥

—) ( అవిధిలింగధారణా ) (—

శ్లో ॥ ఉత్తమాంగేగళేకక్షే సర్వదాధారయేచ్ఛివం । మూత్రాద్యుత్సర్జనేయానే భోజనేపిసదాశుచిః ॥ ౧ ॥ నాభేరధో లింగధారీ పాపిచైవసయుజ్యతే । నాభ్యూర్ధ్వే లింగధారీచ సౌభాగ్యంజ్ఞానవర్ధనం ॥ ౨ ॥

తా ॥ లింగమూర్తినెల్లప్పుడు శిరమందు కంఠమందు చంకయందు ధరించవలసినది మూత్రాది విసర్జనమందు పోవడమందు భోజనముచేకాని సదాపరిశుద్ధము నెవడు నాభికి దిగువ లింగము ధరించియున్నాడో వాడు పాపాత్ముండు నాభిపైన లింగము ధరించిన వాడు భాగ్యమున్ను జ్ఞానవృద్ధియును బొందును ॥

శ్లో ॥ కణ్ఠస్థలే నెరలింగం [illegible] కనిష్ఠా

నామికాగ్రాభ్యాం శివలింగంచగోముఖం ॥ ౩ ॥ అంగుష్ఠాగ్రే ణచైవం హిసంస్పృశేదర్చనావిధౌ ॥

తా॥ లింగార్చన కాలమందు కరస్థలాగతమైన లింగము గోముఖము నెడమ భాగముజేసి కనిష్ఠానామిక రెండంగుళములచేత పెన్రువ్రేలు కొనచేత గోముఖమును పట్టవలయును ॥

శ్లో॥ గోముఖంవామభాగస్య పూజాసిద్ధిర్భవిష్యతి ॥ ౪ ॥ దక్షిణేశైవసూత్రంచ ధారయేన్నరకంవ్రజేత్ ॥

తా॥ గోముఖము నెడమభాగమునకు (చేయుట) లింగార్చన సిద్ధియయ్యెని దక్షిణ భాగమందిడునేని నరకము బొందును ॥

## నమస్కారనిరూపణం

శ్లో॥ భక్తదేహంమమాంగంచ భక్తప్రాణంమమైవచ । తస్మాద్భక్తనమస్కారం మన్నమస్కారముచ్యతే ॥ ౧ ॥ సర్వేషాముపచారాణాం నమస్కారమభీష్టదం । యోవినన్యోపచారాశ్చ కృత్వాతేనిష్ఫలంభవేత్ ॥ ౨ ॥

తా॥ జంగమదేహమే నాయొక్కదేహము జంగమప్రాణమే నాయొక్కప్రాణము నందువలన జంగమ నమస్కారము నాయొక్కనమస్కారమని చెప్పబడుచున్నది సమస్తోపచారములలో నమస్కారమభీష్టమిచ్చు నటువంటిది యెవ్వడు నమస్కారమువినా ఇతరోపచారములు చేసినప్పటికవినిష్ఫలములౌను ॥

శ్లో॥ దీర్ఘదండం దేశికస్య పాణిస్పర్శంచలింగకం । జంగమస్యశిరస్పర్శం త్రివిధంభక్తికారణం ॥ ౩ ॥

తా॥ గురునకు దీర్ఘదండము లింగమునుగూర్చి పాణిస్పర్శనము జంగమునకు దీర్ఘదండము శిరస్పర్శము మూడువిధములు భక్తికికారణము ॥

శ్లో॥ మాతాపితృనమస్కారం మధ్యమంపరికీర్తితం । ఇతరేషాం నమస్కార మధమాధమముచ్యతే ॥ ౪ ॥

తా॥ తల్లిదండ్రులకు (చేయబడు) నమస్కారము మధ్యమమని చెప్పబడినది యితరులకు (అనగా అన్యమతస్థులకు చేయబడు) నమస్కా

మథమాధమమని చెప్పబడుచున్నది ॥

శ్లో ॥ లింగధారణసద్భక్తో లింగహీననృపద్విజాన్ । సేవారంభ నమస్కారం కుర్యాచ్చేన్నరకంవ్రజేత్ ॥

తా ॥ లింగధారుడైన సద్భక్తుండు లింగవిహీనులైన రాజులబ్రాహ్మణులగూర్చి సేవాముదలు కొని నమస్కారముచేయునేని నరకముబొందును ॥

—( జంతురక్షణం )—

శ్లో ॥ మార్జాలశ్వానకుల శిఖండిశుకమేషకాన్ । న పోషయేత్సదాచారీ శీలవాన్ క్షితిమండలె ॥ ౧ ॥

తా ॥ సదాచారిస్మైన శీలవంతుడు భూమియందు పిల్లి కుక్క ముంగి చిలుక నెమలి మేకలను నడుపవలదు ॥

—)లోకాచారం నిరాభారపక్షం(—

శ్లో ॥ అంగన్యాసఃకరంన్యా సం వేదపాఠోపవాసకం । స్నానంశ్రాద్ధశ్చయజ్ఞశ్చ అగ్నిహోత్రసురార్చనం ॥ ౧ ॥ శిఖా యజ్ఞోపవీతశ్చ శుద్ధిపంచకమేవచ । వైదికాచారతంత్రంస్యాచ్ఛివభక్తోవివర్జయేత్ ॥ ౨ ॥

తా ॥ శివభక్తుండు కర్మకాండోక్తవిధమైన అంగన్యాసము కరంన్యాసము రుద్రేతర వేదపాఠము ఉపవాసము గంగాదిస్నానము శ్రాద్ధము యజ్ఞము నిత్యాగ్నిహోత్రము విశ్వదేవార్చనము అర్ధశిఖా కేవలతంతు యజ్ఞోపవీతము పంచశుద్ధులు అనగా స్థలశుద్ధి దేహశుద్ధి ద్రవ్యశుద్ధి మంత్రశుద్ధి లింగశుద్ధులను త్యజించ వలయును ॥

శ్లో ॥ అగ్నిహోత్రశ్చమేధాశ్చ యజ్ఞాశ్చబహుదక్షిణాః । శివలింగార్చనాకోపవ తస్మాదేతాన్ పరిత్యజేత్ ॥ 3 ॥

తా ॥ శివలింగార్చకుండైనవాడు అందువల్ల డగ్నిహోత్రము యజ్ఞభేదము యాగములు బహుదక్షిణములు వీటినిత్యజించవలయును ॥

శ్లో ॥ వీరశైవస్యభక్తానాం శిరోముండనముత్తమం । శిరఃకేశసమాపూర్ణా మథవర్తనమాచరేత్ ॥ ౪ ॥

తా ॥ వీరశైవము యొక్క భక్తులకు (సంపూర్ణ) శిరోముండనము

క్షేమము తలవెంట్రుకలు నిండావుండు యెడ నదేవృత్తి నడవ వల యును ॥

శ్లో ॥ అర్ధముండీభవేద్యస్య పూర్వపుణ్యంవినశ్యతి। ఇహం నాస్తిపరం నాస్తినాస్తినాస్తివరాననే ॥ ౫ ॥

తా ॥ ఓపార్వతి యెవ్వనియొక్క శిరము సగము కొరగబడుచున్న దో (వాని) పూర్వార్జిత పుణ్యము నిశించుచున్నది ఇహములేదు పరములేదు లేనెలేదు ॥

శ్లో ॥ దుస్సంగంచదురుక్తంచ దుశ్శీలందుర్గుణంతథా । దుర్నీతిందుశ్చరిత్రంచ వర్జయేద్వీరభక్తిమార్గ ॥ ౬ ॥

తా ॥ వీరశైవభక్తుండు దుస్సాంగత్యమున్ను దుర్వాక్యమున్ను దుశ్శీలమున్ను దుర్గుణమున్ను అట్లాగె యన్యాయమున్ను దుష్ప్రవర్తనమున్ను విసర్జించవలయును ॥

శ్లో ॥ పరదారపరద్వేషం పరార్థంకాంక్షయాశ్రయం । సంకల్పంచవికల్పంచ వర్జయేద్వీరభక్తిమార్గ ॥ ౭ ॥

తా ॥ వీరశైవభక్తుండు పరస్త్రీ పరద్వేషమును పరద్రవ్యమును కాంక్షచేననుసరించుటయును ఇచ్ఛయును నిరిచ్ఛయున్ను వర్జించవలసినది ॥

శ్లో ॥ అనృతంఅస్థిరంవాక్యం వంచనంపఙ్క్తిభేదనం । ఉదాసీనంనిర్దయత్వం షడ్విధంభవిమిశ్రితం ॥ ౮ ॥

తా ॥ అబద్ధము నిలకడలేనిమాట మోసపుచ్చుట పంక్తిభేదము అపకారోపకార శూన్యము నీయారుభవిమిశ్రములు విడువతగ్గవి ॥

## —(*) శ్రాద్ధం (*)—

శ్లో ॥ గురుదీక్షాపరిప్రాప్తశ్శివలింగాంగయోగతః । ద్విరేఫకీటన్యాయేనశివైక్యంప్రాప్తవాన్ద్విజః ॥ ౧ ॥ లింగాంగసంగినిమృతేసంప్రాప్తేద్వాదశేహని । సాపిండ్యాన్నైవకర్తవ్యాప్రేతత్వాభావతోమునే ॥ ౨ ॥

తా ॥ ఓయిమునీశ్వరుడా ద్విజుండు (అనగా దీక్షితుండు) గురుదీక్షపొంది భ్రమరకీట న్యాయముచే లింగాంగసామరస్యమువలన శివై

క్యముజెందియున్నాడో అట్టిలింగాంగసంగి మృతమందు పన్నెండో దివసమందు ప్రేతత్వము లేదనేభావము వలనా పిండకర్మ చేయవలదు ॥

శ్లో ॥ దీక్షాత్రయప్రకారేణ గురుణాదీక్షితోయథా ॥ తథైక్యస్యచభక్తస్యసా పిండ్యాకింప్రయోజనం ॥ ౩ ॥

తా ॥ ఏట్లాగు గురువుచేత వేధాక్రియామాంత్రిక దీక్షాత్రయప్రకారముతో దీక్షితుడై అట్లాగె లింగైక్యమైనటువంటి భక్తునికియాపిండకర్మమేమి ప్రయోజనము ॥

శ్లో ॥ తద్దినందినదోషేణ తద్దినందుర్దినంతథా । తదన్నం మాంసతస్తుల్యం తద్గృహంశ్వపచాంగణం ॥ ౪ ॥

తా ॥ తద్దినము (అనగా మరణమైనదినము) దినదోషముచే యాదినము దుర్దినము (అనగా దుష్టదినము) అలాగెయా అన్నముమాంసతుల్యము నాయిల్లుశ్వపచాంగణము ॥

—( లింగవికలం )—

శ్లో ॥ స్వేష్టలింగవియోగేచ జలాదౌపతనేపిచ । అష్టోత్తరశతంజప్త్వాప్రాణ లింగంచధారయేత్ ॥ ౧ ॥

తా ॥ తనయిష్ట లింగము వియోగమై జలాదులయందు పడినయడ నూటఎనమిది మారులు శివమంత్రము జపించి ప్రాణలింగము ధరించవలయును ॥

శ్లో ॥ అష్టబంధవిశీర్ణేతు పునర్బంధంచకారయేత్ । మధ్యే నష్టేప్రమాదేన దేహం త్యక్త్వాశివంవ్రజేత్ ॥ ౨ ॥

తా ॥ అష్టబంధశిథిలమందు మళ్లియష్టబంధము చేయించవలయును ప్రమాదముచే లింగమధ్యమందు నశించిన దేహము విడిచిశివుని బొందదగును ॥

శ్లో ॥ లాక్షాసర్జరసస్నిక్థం కురవిందంచగుగ్గుళం । గైరికంగుడంతైలంచ అష్టబంధమితిస్మృతం ॥ ౩ ॥ అనేనచదృఢీకుర్యాల్లింగంపీఠేసుసంస్థితం ॥

తా ॥ లక్క [illegible] మైనము గుగ్గిలి

ంజలు గుగ్గుళము కావితాయి బెల్లము నూనె యష్టబంధమని తెలియవ
లయు దీనిచేత పీఠమందు లింగమును నిలిపి గట్టిగా చేయవలయును ॥

శ్లో ॥ శిరసిగోముఖంచైవ వృత్తమధ్యేచపీఠయోః ॥ ౪ ॥ ష
డశచ్ఛిద్రభాగస్యాత్తల్లింగంనచధారయేత్ । తల్లింగంచప
రిత్యజ్య పునర్లింగంతుధారయేత్ ॥ ౫ ॥ తద్దేహంసూకరం
జన్మ రౌరవం నరకంవ్రజేత్ ॥

తా ॥ లింగముయొక్క శిరమందు గోముఖమున్ను గోళాకారమధ్య
పీఠములయందునా రుఛిద్రభాగము లాయేనేని యాలింగము ధరించ
గూడదు ఆలింగము విడిచిపెట్టి మళ్లి లింగము ధరించునా ఆ దేహ
ము పందిజన్మమై రౌరవనరకము బొందును ॥

శ్లో ॥ పతితేప్రాణలింగేయో ప్రాణార్థత్తెనరాధమః ॥ ౬ ॥
సచండాలఇతిజ్ఞేయ స్సర్వకర్మబహిష్కృతః ॥

తా ॥ ఎవ్వడు ప్రాణలింగము పడిపోవుచుండగా ఆ నరాధముండు
ప్రాణములనుంచి యున్నాడో వాడు చాండాలుడని తెలియవలయు
సర్వకార్యముల యందు బహిష్కారుడు ॥

శ్లో ॥ పతితేప్రాణలింగేయః ప్రాయశ్చిత్తంనవిద్యతె । ప్రాణ
త్యాగాత్పరంతస్మాత్సావధానేనధారయేత్ ॥ ౭ ॥

తా ॥ ఎవ్వడు ప్రాణలింగము (అనగా ఇష్టలింగము) పోవుచున్నదో
ప్రాణత్యాగముకంటె యితరమైన ప్రాయశ్చిత్తములేదు కాబట్టిసావ
ధానముతో ధరించవలయును ॥

శ్లో ॥ భక్తస్యలింగదేహస్య తద్దేహంలింగవర్జితం ॥ ౮ ॥
శస్త్రోదకసమాధింశ్చ పాశమేవవివర్జయేత్ । వీరమాహే
శ్వరా మధ్యేలింగేప్రాణంసమర్పయేత్ ॥ ౯ ॥

తా ॥ లింగదేహుడైనటువంటి శివభక్తునికి యా దేహము లింగవిహీ
నమాయేనని శస్త్రోదకసమాధి పాశములవిడువ వలయు (అనగా శస్త్ర
యోగము కూపమందుపడుట సమాధినివసించుట ఉరివేసుకోవడము
విడువవలయు (సత్తాయుండెనేని) వీరమాహేశ్వరుల మధ్యమందున్నలిం
గమందు ప్రాణము సమర్పించవలయును ॥

## —(*) వీరశైవసామాన్యధర్మం (*)—

శ్లో ॥ ప్రమాదాదిష్టలింగంతు చోరాద్యపహృతంభవేత్ ।
తదాత్వఘోరమంత్రంచ లక్షంజప్త్వాతతః శుచి ॥ ౯ ॥ తత
శ్చతుర్భిరాచార్యై ర్యుక్తైనగురుణాతథా । దత్తలింగ
గళేధృత్వాపునరష్టోత్తరంశతం ॥ ౧౦ ॥ జప్త్వాతుశైవగాయ
త్రీం శుచిర్భూత్వాతతఃపరం । హస్తమస్తకసంయోగాద్గు
రుణాభస్మధారణః ॥ ౧౧ ॥ శివ మంత్రోపదేశేన లింగాంగీ
చభవేత్తతః । భవిస్త్రీసంగరహితః కంఠవక్షస్థలాదిషు ॥ ౧౨ ॥
లింగంబధ్వా త్రికాలేషు జపస్నానపరాయణః ॥

తా ॥ అజాగ్రతవలన నిష్టలింగము దొంగలు మొదలగు వారివలన పహరింపబడునో అపుడు అఘోరమంత్రమును లక్షజపముచేసి శుచియై పిమ్మట నలుగు రాచార్యులతో గూడుకొన్నటువంటి గురువుచేతనివ్వబడిన లింగము కంఠమందు ధరించి యట్లాగె మల్లి నూటయెనమిది మారులు శివగాయత్రిని జపించి పరిశుద్ధుండై తరువాత గురువుతో హస్తమస్తకసంయోగమువలన భస్మధారణుండై శివమంత్రోప దేశముచేత లింగాంగుడగుచు తదుపరి భవిస్త్రీసంసర్గ వర్జితుండై కంఠవక్షస్థలాదులయందు లింగముధరించి త్రికాలములయందు జపస్నానపరాయణుడై యుండవలయును ॥

## —( శాస్త్రోల్లంఘనం )—

శ్లో ॥ వర్ణాశ్రమసదాచారా శ్శివేనకథితాఃపురా । ఏతాను
ల్లంఘ్యవర్తంతే శివస్యాజ్ఞాపలాపినః ॥ ౧ ॥ రాజాజ్ఞాభంగ
కృన్మర్త్యాణాం యథాదండోభవేద్ధ్రువం । శివాజ్ఞాభంగకృ
న్మర్త్యాణాం దండోహినరకస్తథా ॥ ౨ ॥ సాంబేనశంభునాజ్ఞ
ప్తం ధర్మంత్యక్త్వార్చయేచ్ఛివం । యస్తస్మైకుప్యతిశివః
స్వాజ్ఞాభంగనిమిత్తతః ॥ 3 ॥ చోదనాలక్షణంధర్మం శివేనా
జ్ఞప్తమత్యజన్ । శంకరంపూజయేద్యస్తు తస్మైసాంబఃప్రసీ
దతి ॥ ౪ ॥

తా ॥ పూర్వము వర్ణాశ్రమ సదాచారాములు శివునిచేత చెప్పబ

ష్టినవి వీటినెవ్వరుల్లంఘించి నడుచుచున్నారో అట్టిశివుని యొక్కాజ్ఞ దాచి నటువంటివారికి రాజాజ్ఞభంగముచేసిన నరులకెట్లాగు నిశ్చయముగాను దండనమౌనో అట్లాగె శివాజ్ఞభంగముచేసిన మానవులకు నిశ్చయముగా నరకదండనమౌచున్నది యెవ్వడు శివునిచేత తెలుపబడిన ధర్మము విడిచి శివున్ని పూజించునో శివుడుతనాజ్ఞభంగ హేతువవలన వాని కొఱకు కోపించుచున్నాడు శివునిచేతప్రేరేపించబడి (అనగా శాస్త్రద్వార) ధర్మలక్షణమున్నాజ్ఞాపించబడినదో (అది) విడువక నెవ్వడు శివున్ని పూజించునో వానికొఱకు శివుడు ప్రసన్నుడౌచున్నాడు ॥

శ్లో ॥ శివోక్తజాతిమర్యాదాం యోతీత్యభువివర్తతే । స చండాలఇతిజ్ఞేయ స్సర్వకర్మబహిష్కృతః ॥ ౫ ॥

తా ॥ ఎవ్వడు శివునిచేత చెప్పబడిన జాతినడతన తిక్రమించి భూలోకమందుండియున్నాడో వాడు చాండాలుడని సర్వకర్మములయందు బహిష్కారుడని తెలియ వలయును ॥

శ్లో ॥ శక్తోయస్థాపితుంధర్మముపేక్షాంకురుతెనరః । సోసిపత్రవనంనామ నరకంప్రతిపద్యతె ॥ ౬ ॥

తా ॥ ఎవ్వడు శివాచార ధర్మము నిలుపుటకు సమర్థుండై యుపేక్షచేయుచున్నాడో ఆ నరుండసి పత్రవనమనే నరకమునుగూర్చి పొందుచున్నాడు ॥

—) గంధధారణం (—

శ్లో ॥ చందనాద్యుపరిప్రాజ్ఞో ధారయేద్భస్మవైదికం । లౌకికం చందనాద్యంతు భస్మోపరినధారయేత్ ॥ ౧ ॥

తా ॥ నేర్పరియైన శివభక్తుండు గంధము మొదలగు బొట్టుమీద వైదికమైన భస్మము ధరించ వలయు లౌకిక సంబంధమగు గంధము మొదలైనవి భస్మమీద ధరించ వలదు ॥

శ్లో ॥ భస్మోపరిగంధచిహ్నం ధారయేన్మానుషాధమః । సపవశౌరవం ఘోరం ప్రయాతినరకార్ణవం ॥ ౨ ॥

తా ॥ ఎమానుషాధముండు భస్మముమీద పరిమళ లాంఛనము ధ

రించుచున్నాడో (వాడు) ఘోరమైన రౌరవ నరకాబ్ధిని పొందుచున్నాడు ॥

—( భక్త్యభావం )—

శ్లో ॥ సర్వాచారవిహీనోపి సర్వధ్యానవివర్జితః । భక్తిలేశయుతస్కంద మత్ప్రియస్సగణాధికః ॥ ౧ ॥

తా ॥ ఓయి షణ్ముఖుడా సకలాచారవిహీనుడై నప్పటికిని సమగ్రము శివధ్యానవర్జితుడై నప్పటికి లేశమాత్రము భక్తియుతుడాయేనేని నాకుప్రియుండు భక్తగణాధికుండు ॥

శ్లో ॥ భక్తిహీనస్యకర్మాణి వృథాపూజాజపాదికం । ధృతమంగళసూత్రాపి విధవానసువాసినీ ॥ ౨ ॥

తా ॥ భక్తిహీనునియొక్క పూజాజపాది సత్కార్యములు నిరర్థకము (ఎట్లంటె) విధవా మంగళసూత్రము ధరించినప్పటికి ముత్తైదువకాదు ॥

శ్లో ॥ భక్తిహీనస్యమర్త్యస్య సమస్తానిష్ఫలాక్రియాః । నతస్యపరలోకోస్తి మృతశ్వాచభవిష్యతి ॥ 3 ॥

తా ॥ భక్తిలేనటువంటి మానవునియొక్క సమస్తమైన క్రియలు (అనగాశివారాధనచేష్టలు) నిష్ఫలములు వానికి పుణ్యలోకములేదు మృతమొంది శునకమయ్యీని ॥

శ్లో ॥ జీవితంశివభక్తానాం సమంపంచదినానిచ । అజకల్పసహస్రాణి భక్తిహీనస్యశాంకరి ॥ ౪ ॥

తా ॥ ఓపార్వతి శివభక్తులయొక్క యైదుదినముల బ్రతుకుతోసమానము భక్తిహీనునియొక్క బ్రహ్మకల్ప సహస్రముల బ్రతుకుకాదు ॥

—)*( నిషేధపాత్రోపకరణం )*(—

శ్లో ॥ సంపాద్యపూజయేల్లింగం యథావిభవవిస్తరం । సువర్ణపాత్రంయత్నేన కుసుమాదిదళానిచ ॥ ౧ ॥ సౌవర్ణాన్యేవసంపాద్య పూజనీయశ్శివస్స్వయం । రాజతంవాదరిద్రశ్చే త్తామ్రపాత్రంహికల్పయేత్ ॥ ౨ ॥ విరక్తోనారికేళేనపాత్రేణైవయజేత్స్వయం। సౌవర్ణపాత్రపూజాపినతస్యాస్సదృ

శీభవేత్ ॥ ౩ ॥ బైల్వనిర్మితపాత్రంతు సర్వేషాముత్తమొత్తమం । బైల్వనిర్మితపాత్రస్య నిష్కృతిశ్శివరూపతః ॥ ౪ ॥ తత్పాత్రసదృశంలోకె నాస్తినాస్తి మహీతలె । సౌవర్ణపాత్రమథవాబిల్వపత్రసమన్వితం ॥ ౫ ॥ పాత్రేషుబైల్వశ్లాఘ్యం స్యాద్బైల్వంపత్రేషుచోత్తమం ॥

తా॥ ఐశ్వర్యము కొలది విస్తారముగాను బంగారుపాత్రను ప్రయత్నము చేపుష్పాదిపత్రములు సంపాదించి లింగమును పూజించ వలయును శివుస్వయము పూజనీయుండు బంగారునైన వెండినైన సంపాదించి దరిద్రుడా యెనేని రాగిపాత్రను కల్పించవలయు విరక్తుండు నారికేళపాత్రచే స్వయము పూజించ వలయును బంగారుపాత్ర పూజనైనప్పటి బిల్వపాత్రకు సమానము కానేరదు బిల్వనిర్మిత పాత్రయు సమస్తులకుత్తమొత్తమము బిల్వనిర్మిత పాత్రయు శివసంబంధము వల్ల ప్రాయశ్చిత్త స్వరూపమైనది ఆ పాత్రసమానము భూలోకమందు లేనేలేదు అథవా సువర్ణ పాత్రమైన బిల్వపత్రి కూడుకొన్నదైన పాత్రలయందు బిల్వపాత్రస్తోత్ర నియ్యమాను పత్రములయందుత్తమము బిల్వమేస్తోత్రనీయ్యము ॥

శ్లో॥ హైమంచరాజతంకాం స్యామృణ్మయంపైత్తలంతథా ॥ వేణ్వాదీనిసుపాత్రాణి విశేషంచవరాణిచ । ఏకస్యభోజనంచోక్తం కాంస్యపాత్రేసులక్షణే ॥ ౭ ॥ భిన్నేనిషిద్ధేచభవనే నభోక్తవ్యంకదాచన ॥

తా॥ బంగారు వెండి కంచు మట్టి వెదురు మొదలగు విశేషమైన శ్రేష్ఠపాత్రలున్ను సులక్షణముగల కంచుపాత్రయందొక్కనికే భోజనము చెప్పబడినది భిన్నమైన పాత్రయందు నిషిద్ధమైన పాత్రయందు ఆను యందెప్పుడేనియు భుజించతగదు ॥

శ్లో॥ అర్ఘ్యాదీనాంనయొగ్యాని భిన్నపాత్రాణిజాతుచిత్ ॥ అభిన్నానివిశుద్ధాని పాత్రేతైవభవంతిహి ॥

తా॥ భిన్నపాత్రలు యుక్తా నొకప్పుడైనను అర్ఘ్యము మొదలగువాటికి యొగ్యములు కావు భిన్నములు కానివి పరిశుద్ధమైనట్టు

వంటి పాత్రలచేత యోగ్యమౌచున్నవి ॥

శ్లో ॥ తామ్రస్ఫటికశంఖేషు సువర్ణాంకలధౌతయోః ॥ ౯ ॥
నవిద్యతేభిన్న దోషః పాత్రేష్వన్యేషువిద్యతే ॥

తా ॥ రాగిస్ఫటిక శంఖములయందు బంగారు వెండియందు భిన్న దోషము లేదు ఇతరమైన నటువంటి పాత్రల యందు దోషముంటూ వున్నది ॥.

శ్లో ॥ దారుమృత్పాత్రయోరస్తి స్పృష్టదోషోన్యజాతిభిః ॥ ౧౦ ॥
శంఖస్వర్ణాదిపాత్రాణాం స్పృష్టదోషోనవిద్యతే ॥

తా ॥ కఱ్ఱపాత మంటిపాత్రల కన్యజాతులచేత నంటుదోష ముంటూ వున్నది శంఖుస్వర్ణాది పాత్రలకంటు దోషములేదు ॥

శ్లో ॥ గండూష పాదశౌచానియః కుర్యాత్కాంస్యభాజనే ౧౧ ॥ షణ్మాసంభువినిక్షిప్యదశక్షారేణశుధ్యతి ॥

తా ॥ ఎవ్వడు కంచు స్థాలియందు నోరుపుక్కలించుట పాద ప్రక్షాళనము చేయుచున్నాడో ఆస్థాలి భూమి యందారు నెలలు పాతి పది మారులు భస్మశుద్ధిచే శుద్ధమౌచున్నది ॥

శ్లో ॥ క్షీరంలవణసమ్మిశ్రం తర్జిన్యాదంతధావనం ॥ ౧౨ ॥
నారికేళపయఃకాంస్యే తామ్రేమేగవ్యంసురాసమం । గృహీత్వా జలపాత్రంతు విణ్మూత్రంయదిసంత్యజేత్ ॥ ౧3 ॥

తా ॥ పాలువుప్పు కలుపుట, తర్జని వ్రేలుతో (అనగా రెండవ వ్రేలుతో) పండ్లుతోముట, కంచుపాత్రయందు నారికేళోదకము పోయుట, రాగిపాత్రయందు గోక్షీరదధిసర్పి గోమూత్ర గోమయములు పోయుట, కల్లుతోసమము ఉదకము పుచ్చుకొనె చెంబును మలమూత్రముగూర్చి తీసుకొనబడునేని యాపాత్రను విడువవలయును ॥

శ్లో ॥ వామపార్శ్వేజలం స్థాప్యనభుంజీయాత్కదాచన । అభోజ్యంతద్భవేదన్నం తత్తోయంచసురాసమం ॥ ౧౪ ॥ జలపానాభిలాషశ్చే ద్భోజనేవామపాణినా । తత్పాత్రంచసమాదాయ మణిబంధేస్వదక్షిణే ॥ ౧౫ ॥ స్థాపయిత్వాపిబేత్తోయమేక హస్తేనభక్తిమాన్ । కదాచిన్నపిబేత్తోయం శైవశాస్త్రానుసా

రతః ॥ ౧౮ ॥

తా ॥ ఎడమ పార్శ్వమందు జలపాత్రనుంచి యెప్పుడైనను భుజించ కూడదు (అథవా భుజించునేని) ఆ యన్నమ భక్ష్యపదార్థమాలాను ఆ జలము సురాసమము నపర్ణాణయం దుదకాభిలాష యాయనేని యెడమచేతితో 'నుదకపాత్ర తీకొని కుడిచేతి మణికట్టుననుంచి జలముపుచ్చుకొన వలసినది శివశాస్త్రాను సారముగా శివభక్తివంతుండును నొకా నొకప్పుడు ఏకహస్తముచే నుదకము పుచ్చుకొనవలదు ॥

—(❋ అనర్హజంగమాచారం ❋)—

శ్లో ॥ నిర్మత్సరోనిర్వికారో సర్వసంగవివర్జితః । ధ్యానయుక్తోభస్మనిష్ఠో విముక్తోవిషయభ్రమః ॥ ౧ ॥ సదాశాంత్యాదియుక్తస్స న్నాత్మస్థాత్మానమీక్ష్యతి । సోయంజంగమవిఖ్యాతోమమదేహాత్మతాంగతః ॥ ౨ ॥

తా ॥ పరులయందు ద్వేషములేనివాడు, తిరస్కారగుణము లేనివాడు లౌకికధర్మమునకు దూరమైనవాడు, శివధ్యాన పరుడైనవాడు, భస్మనైష్ఠికము గలవాడు విషయభ్రమ విడిచినవాడు యావత్కాలము శాంత్యాది గుణములతో గూడుకొన్నవాడై తనయందున్నాత్మను చూచుచున్నాడో వాడే జంగమ మని చెప్పబడినవాడు నాయొక్క దేహాత్మను బొందువాడు ॥

శ్లో ॥ అక్రోధంసత్యవచనము భయేంద్రియనిగ్రహం । సర్వభూతదయాశాంతిః క్షమాషట్శీలముచ్యతె ॥ 3 ॥

తా ॥ కోపములేకుండుట, నిజముపలుకుట, బహిరంతరేంద్రియముల తిరస్కరించుట, సకలప్రాణుల యందు దయయుండుట కామక్రోధాది షడ్వర్గము లేకుండుట ఓర్పుగలగి యుండుట, యీయారుషట్శీలములని చెప్పనవుచున్నది ॥

శ్లో ॥ ఉత్తమంవనవాసంచ మఠవాసంతుమధ్యమం । కనిష్ఠంభక్తగేహం హీనివాసంశివయోగినాం ॥ ౪ ॥

తా ॥ శివయోగీశ్వరులకు గ్రామసమీపతోట యందుండు టుత్తమము గ్రామ మఠమందుండుట మధ్యమము భక్తులయిండ్లనుండుట కని

ష్ఠము ॥

శ్లో ॥ కృషాలోకుత్సితవాణిజ్యోసేవకోనృత్యగాయకః । పిశు
నోయాచకోమూర్ఖో । పాపంచోనచజంగమః ॥ ౫ ॥

తా ॥ ఇతరుల పీడించువాడు జాత్యాచార నిందితుండు వ్యాపారము చేయువాడు పరులసేవ చేయువాడు ఆటపాటలాడువాడు కొండెము చెప్పువాడు సర్వత్రయాచకము చేయువాడు వివేకములేనివాడు గాకికుండు జంగమముకాడు ॥

శ్లో ॥ గురుకల్పితభిక్షాన్న మకల్పితంసమాగతం । ద్వయో
ర్హీనంయోభుజ్క్తే సపాపీజంగమాధమః ॥ ౬ ॥

తా ॥ ఎవ్వడు గురువు కల్పించబడిన భిక్షాన్నమును కల్పించబడక నకస్మాత్తు రాబడిన భిక్షాన్నము రెంటియొక్క విహీనము భుజించుచున్నాడో వాడు పాపియు జంగమాధముడు ॥

శ్లో ॥ క్రియాజ్ఞానవిహీనస్య జంగమాంఘ్రిజలంజడం । తత్ప్ర
సాదంతదుచ్ఛిష్టం నసేవ్యంతన్ముముక్షుభిః ॥ ౭ ॥

తా ॥ క్రియాజ్ఞాన విహీనుడైన నటువంటి జంగముయొక్క పాదోదకమునీరు ఆ ప్రసాద మెంగిలియట్టిది మోక్షార్థులచేత సేవింపతగదు ॥

## —) దీక్షావిహీనం (—

శ్లో ॥ అదీక్షితైరనాచారైర మంత్రజ్ఞైరవైదికైః । దూషితై
స్సమయభ్రష్టైర్నకార్యంశివపూజనం ॥ ౧ ॥

తా ॥ దీక్షారహితులచే, తాచారవిహీనులచేత, శివమంత్రము తెలియనివారిచేత, వేదోక్తము తెలియనివారిచేత, దూషితులైన వారిచేత, మతభ్రష్టులచేత, శివార్చనము (అనగా స్థావర లింగార్చనము ఇష్టలింగార్చనము) చేయతగదు ॥

శ్లో ॥ యథామృగపతిందృష్ట్వామహాభీతోవనేగజః । అదీక్షి
తార్చనేలింగం తథాభీతోమహేశ్వరి ॥ ౨ ॥

తా ॥ ఓపార్వతీ యెట్లా గేనుగు వనమందు సింహమునుచూచి మిక్కిలి భయమొందునో అట్లాగ లింగమూర్తి దీక్షాగానివాని పూజయందు భయమొందును ॥

శ్లో ॥ నాత్రాశ్రమకృతఃకశ్చి దుత్కర్షోవిద్యతేనృణాం ।
పరాందీక్షాంవినాశైవీం బంధత్రయవిమోచనం ॥ 3 ॥

తా ॥ ఇచట బంధత్రయ విమోచనమై నటువంటి శ్రేష్ఠమైన శివదీక్షనువినా మానవుల కేకానొకాశ్రమము బొందినప్పటికి యతిశయముకాదు ॥

—(*) సామాన్యస్త్రీధర్మం (*)—

శ్లో ॥ స్త్రీణాంచభర్తృశుశ్రూషా ధర్మోనాన్యోమహేశ్వరి ।
యానారీభర్తృశుశ్రూషాం విహాయవ్రతతత్పరా ॥ ౧ ॥ సా
నారీనరకంయాతి ఇత్యాజ్ఞాచమయాకృతా ॥

తా ॥ ఓపార్వతీ యాడివాండ్లకు మగనియొక్క సేవయేధర్మము రెండవదిలేదు ఎస్త్రీ మగనిసేవవిడిచి వ్రతాసక్తిపడునో ఆస్త్రీనరకము బొందుచున్నది యిట్లు నాచేతాజ్ఞాపించ బడినది ॥

శ్లో ॥ నాధికారస్స్వతోనార్యాః శివసంస్కారకర్మణి ॥ ౨ ॥
నియోగాద్భర్తురేవ యదిభక్తమహేశ్వరే । తథైవభ
ర్తృహీనాయాః పుత్రాదెరభ్యనుజ్ఞయా ॥ 3 ॥ అధికారో
భవత్యేవ కన్యాయాఃపితురాజ్ఞయా ॥

తా ॥ స్త్రీలుదీక్షోపదేశము పొందుటయందు స్వతాధికారములేనివారలు (అనగా అస్వతంత్రులు) మగడుండేనేనియు వానియాజ్ఞవలన అలాగె మగడులేనిదానికి పుత్రాదులాజ్ఞచేత భక్తమాహేశ్వరులయం దధికారము బొందుచున్నది యట్లాగె కన్యకు తండ్రియాజ్ఞచేత పొందవచ్చును ॥

శ్లో ॥ వీరశైవమతస్థాయాః పతిరేవపరశ్శివః ॥ ౪ ॥ మృతేభ
ర్తరిసాసాధ్వీ తస్యానుమ్రియతేతుయా । యదిపుత్రవతీసా
చేన్నమ్రియతేతదాసతీ ॥ ౫ ॥ సానారీపూజయేల్లింగం శివచిం
తపరాయణా । అభ్యాగతానాంభక్తానా మన్నాద్యైఃపరితో
షయేత్ ॥ ౬ ॥ త్రికాలంభస్మనాస్నానం కౌసుంభాంబర
ధారణం । క్షమాదయాసదా మౌనమసంస్కృతశిరోరుహా
౭ ॥ శివపంచాక్షరీజాప్యం పత్యుఃథాశ్రవణంముదా । బంధు

వర్గేషువాత్సల్యం భూతిరుద్రాక్షధారణం ॥ ౮ ॥ శివక్షే
త్రానుగమనం శివభక్తిపరావశేత్ । భూశయ్యానక్తభోజీచ
ఏకహారిజితేంద్రియా ॥ ౯ ॥ పతిమన్యంనగంతవ్యః గతాచేన్న
రకంవ్రజేత్ ॥

తా ॥ వీరశైవమతస్థురాలు యొక్క మగడు శివైక్యుడైనా మగడు
మృతిజెందిన పతివ్రత మగనివెంట మృతమొంద బహుచున్నది యే
స్త్రీపుత్రవతి యైనేనియు మృతమొందకూడదు అపుడాపతివ్రత
లింగమును పూజించవలయు శివధ్యానపరయై యభ్యాగతులైన మా
హేశ్వరుల కన్నాదులచేత సంతోషింపజేయవలయు త్రికాలములభ
స్మముచే స్నానముచేసి యర్రవస్త్రము ధరించి యోర్పుదయ గలిగి
యెల్లపుడు మౌనముగా తలవెంట్రుకలు బాగుపరచక శివపంచాక్షరి
జపించుచు సంతోషముచె శివకథలువినుచు బంధువర్గములయందు
విశ్వాసము భస్మరుద్రాక్షలు ధరించి శివక్షేత్రముల గూర్చి సేవి
చుచు శివభక్తపరయై యుండవలయు భూశయ్యయై యేకభుక్తము
రాత్రిభుజించుచు జితేంద్రియయై రెండవమగన్ని పొందవలదు (అ
థవాపొందెనేని) నరకము బొందును ॥

—( దుష్టస్పర్శ )—

శ్లో ॥ చండాలఃపతితోరోగి పాపియర్కదేవలోంత్యజః । గణి
కానూతికోదక్యా వ్రతభ్రష్టశ్చకుక్కురః ॥ ౧ ॥ ఓతుఃక్రో
డఃఖరఃకాక షండోవాభక్షభక్షకః । స్వాధ్యాయవిక్రయీ
త్యేతెన స్పృశేదత్రనిందితాః ॥ ౨ ॥

తా ॥ మాలవాడు కులభ్రష్టు రోగిష్టి పాపిష్టి కూలికిపూజచేయువా
డు పంచముడు భోగస్త్రీ బాలెంత రజస్వలా వ్రతభ్రష్టు కుక్క పిల్లి
పంది గాడిదె కాకి నపుంసకుడు అభక్షభక్షకుడు వేదమునమ్మువాడు
వీరిచటనిందితులు ముట్టకూడదు ॥

శ్లో ॥ రక్తంమూత్రఃపురీషంచ ఉచ్ఛిష్టాద్యపవిత్రకం । స్పృష్ట
మాత్రేణకర్తవ్యం స్నానంభూత్యాసమాచరేత్ ॥ 3 ॥

తా ॥ రక్తమూత్రము అమేధ్యము ఎంగిలి మొదలైన నపవిత్రములు

ముట్టినమాత్రముచే స్నానము చేయవలసినది భస్మముతోగూడ చేయ వయును ॥

శ్లో ॥ అజీర్ణేభ్యుదితేవాం తేశ్మశ్రుకర్మణిమైధునే । దుస్వ ప్నేదుర్జనస్పర్శే స్నానమేవవిధీయతే ॥ ౪ ॥

తా ॥ అజీర్ణమందు సూర్యోదయము నిద్రించుటయందు వమనమందు క్షౌరకర్మయందు స్త్రీసంగమయందు దుస్వప్నమందు దుర్జను నిస్పర్శయందు స్నానమే విధింపబడినది ॥

—) శీలలక్షణం (—

శ్లో ॥ అన్యదేవాలయంభవ్యం వేశ్యాగేహంమలీమసం । కా రాగృహంరోగవాసం రాజద్వారంచవర్జయేత్ ॥ ౧ ॥

తా ॥ ఇతరదేవాలయముసొగసైన భోగస్త్రీగృహము మురికిస్థలము చరశాల, రోగస్థలము రాజద్వారముల గూర్చి పోయేదిమానుకొ వలెను ॥

శ్లో ॥ ఔదుంబరంచవార్తాక మేలాబలకులాదికం । కాళింగం శిగ్రుద్రవ్యంచ భూచక్రమగ్నిశాఖిని ॥ ౨ ॥ అన్యానిక్రిమియు క్తాని సర్వాణిచవివర్జయేత్ ॥

తా ॥ మేడికాయలు వంకాయలు పెద్దయాలకులు ఉలువలు మొద లైనవి పుచ్చకాయలు కూరద్రవ్యమును భూచక్రము గడ్డ రేగుకాయ లు పురుగులతో గూడిన నితర పదార్థములు యావత్తువర్జింప వలయును ॥

శ్లో ॥ మాతరఃపితరశ్చైవభ్రాతరోబాంధవాస్తథా ॥ 3 ॥ శివ సంస్కారహీనాశ్చేత్పాకం గోమాంసవిట్సమం ॥

తా ॥ తల్లులుతండ్రులు అన్నదమ్ములు బాంధవులు శివసంస్కారహీ నులైరేని (అనగా దీక్షోపదేశవిహీనులైరేని) యట్టిపాకము గో మాంసపురీషతుల్యము ॥

శ్లో ॥ అసంస్కారికృతంపాకం కుర్యాచ్ఛంభోర్నివేదనం । స్వయమేవతుభుంజీయాద్రౌరవంనరకంవ్రజేత్ ॥ ౪ ॥

తా ॥ సంస్కారహీనుడు చేయబడినపాకము లింగమునకు నివేదన

చేయునో తానున్ను భుజించునో కారవనరకము బొందును ॥

శ్లో ॥ భవినాపాహృతంపుష్ప మన్యైశ్చాహృతతండులః ॥ ౫ ॥
అన్యవస్త్రంచగంధంచ శివార్థంనైవసంగ్రహేత్ ॥

తా ॥ లింగార్థము భవిచేత తెచ్చిన పుష్పములు తదితరులచేత తె చ్చినబియ్యమునితర వస్త్రమున్ను గంధమున్ను తీసుకొనకూడదు॥

—(*) ఉదకలక్షణం (*)—

శ్లో ॥ నసూర్యకిరణస్పృష్ట ముదకంచశివార్చనే । యోగ్యం తథానయేద్రాత్రౌ చోదయాత్పూర్వతోరవేః ॥ ౧ ॥ శుద్ధవ స్త్రేణసంశోధ్య వస్త్రాదావృతభాండకైః । అథవానవనిమ్నేషు త త్తత్కాలేస్వపాణినా ॥ ౨ ॥ నదీరోధేషుపుణ్యేషు గృహీ తవ్యంజలంశివె ॥

తా ॥ ఓపార్వతీ యాదిత్యకిరణ స్పృష్టముగా నటువంటి యుదకము లింగార్చనయందు యోగ్యము (కనక) సూర్యోదయముకంటె పూర్వ మురాత్రియందు పరిశుద్ధవస్త్రముచే శోదించి వస్త్రముల వల్ల గప్పిన బిందెలచేత తీసుకపోవలయును(అట్లగాక)ఆయాయకాలమందు నూత నబిలములయందు పవిత్రమైన నదిదరులయందు తనచేతనే జలముతీ సుకొలసినది ॥

శ్లో ॥ అల్పకూపోదకంచాథ మేఘధారాజలంతథా ॥ ౩ ॥ పీ తశేషజలంచాపి మార్గతోయంపురాతనం । చర్మపాత్ర జలంచైవ వస్త్రతోయంచగర్హితం ॥ ౪ ॥ భవిభాండజలం వర్జం సత్రతోయంచవర్జితం । అన్యపాణిజలంత్యాజ్యం పల్వలేనయుతంజలం ॥ ౫ ॥ వర్జయేచ్ఛీలవాన్నిత్యం సద్భ క్తోపర్వతాత్మజే ॥

తా ॥ ఓపార్వతీ శీలవంతుడైన సద్భక్తుండు చిన్నబావినీరున్ను మ రియువర్షధారనీరు జనులుత్రాగగా మిగిలిననీరున్ను పూర్వమునుండి త్రోవయందు న్నుదకమున్ను చర్మపాత్రోదకము వస్త్రమున తెచ్చిన జలము భవిభాండజలమున్ను సత్రోదకముని తరచేతిజలమున్ను మ డుగునీరును వర్జించవలయును॥



శ్లో ॥ వాపీకూపతటాకేషు మాన్యస్యైశ్శిల్పతేయది। అస్థిచర్మాని

నిర్మక్తైశ్చిరకాలంవసేద్యది । ఉద్ధరేదుదకంసర్వం పంచపిం డాన్మృదస్తథా ॥ ౭ ॥ ప్రక్షిపేత్పంచగవ్యంతు తతశ్శుద్ధిమ వాప్నుయాత్ ॥

తా ॥ కొనేరు బావి చెరువులయందు సమస్తజనులచే ముట్టబడేనేని ము ముకచర్మములచేత లేని వైబహుకాలము నుండేనేనియు నట్టియు ఉకముయావత్తు తీసివేసిపంచమృత్తిక పిండములు పిమ్మట పంచగవ్య ములు వేయవలయు శుద్ధియగును ॥

శ్లో ॥ శ్వభిశ్చకాకచండాలై ర్దూషితేషువిశోధనం ॥ ౮ ॥ ఘ టానాంశతముధృత్య పంచగవ్యాంక్షిపేత్తతః ॥

తా ॥ కుక్కలచేత కాకీచాండాలులచేత దూష్యములై నటువంటి వాటియందు పరిశుద్ధినూరు కడవలయొక్క యుదకము వెత్తిపోసి త రువాత పంచగవ్యము వేయవలయును ॥

శ్లో ఉపానచ్ఛేష్మవిణ్మూత్రం స్త్రీరజోమృతమేవచ ॥ ౯ ॥ ఏ భిర్విదూషితంకూపం ఘటానాంషష్ఠిముద్ధరేత్ ॥

తా ॥ చెప్పులు తెమడ మలము మూత్రము ముట్టురక్తము పీనగమొ దలగు వీటిచేదూషితమైన బావిని యరువై కడవలయొక్క నీరుతీసి వేయవలయు పరిశుద్ధమౌను ॥

—)( నిమిత్తం )(—

శ్లో ॥ సాముద్రికంజోతిషంచ శకునంస్వప్నభైషజం । ఫలా ఫలంద్వయంనాస్తి శివభక్తేనవర్జయేత్ ॥ ౧ ॥

తా ॥ శివభక్తునిచేత ఫలనిష్ఫలము రెండులేనటువంటి సాముద్రికము జ్యోతిష్యము శకునము స్వప్నము వైద్యము విడువవలయును ॥

శ్లో ॥ తిథివారంచలగ్నాని యెభక్తాశ్చరంతితే । సార్వకా లంమహాఘోరం వ్రజేయుర్నరకధృవం ॥ ౨ ॥

తా ॥ ఎవ్వరు శివప్రతిభాష నిశ్చితాత్ములైన భక్తులు తిథివారలగ్న ముల నాచరించుచున్నారో వారు సర్వకాల మధికభయమైన నరక ము నిశ్చయముగా బొందుదురు ॥

—) వ్రతత్యాగం. (—

శ్లో ॥ వ్రతభ్రష్టముఖం దృష్ట్వా ఆసనే శయనే తథా । సపంక్తౌ భోజనం కుర్యాద్రౌరవం నరకం వ్రజేత్ ॥ ౧ ॥

తా ॥ ఎవ్వడు వ్రతభ్రష్టుని ముఖముచూచి (అనగా సంభాషించి) యాసనమందు శయ్యయందు వట్లాగె సపంక్తియందు భోజనము చేయునో (వాడు) రౌరవనరకము బొందును ॥

శ్లో ॥ స్థావరం భిన్నదోషేణ వ్రతభ్రష్టేన జంగమం । ఉభయో భిన్నభావాచ్చ న చ వందన సత్క్రియా ॥ ౨ ॥

తా ॥ భిన్నదోషముచే స్థావరలింగమును వ్రతభ్రష్టత్వముచే జంగమను అధికార భిన్నమువలన నుభయులకు వందనము కూడదర్చన కూడదు ॥

—( ఆసనప్రకారం )—

శ్లో ॥ స్వస్తికం గోముఖం పద్మ మర్ధచంద్రాభిధానకం । చతుః ప్రకారముదితం పూజకస్యాసనం శుభం ॥ ౧ ॥

తా ॥ స్వస్తికము గోముఖము పద్మము అర్ధచంద్రాసన మీనాలుగు ప్రకారము లాసనము పూజకునికి శుభమని చెప్పబడినది ॥

శ్లో ॥ సదా పూర్వముఖః పూజాం కుర్యాల్లింగస్య శాంకరి । ఆయుశ్శ్రియం యశోవీర్యం పూజావృద్ధిం యదిచ్ఛతి ॥ ౨ ॥ దక్షిణాభిముఖః కుర్యాన్మరణాదిషు సుందరి । కామార్థీ పశ్చిముఖో జ్ఞానార్థీ స్యాదుదఙ్ముఖః ॥ ౩ ॥ వహ్నినా వ్యాధిపీడా చ నైఋత్యాం ద్వేషముద్భవం । వాయువ్యాం కర్షణం చైవ ఈశాన్యే మోక్షసంపదః ॥ ౪ ॥ ప్రాతర్మధ్యాహ్నయోః పూర్వముఖః పూజాం సమాచరేత్ । రాత్రావుదఙ్ముఖః కుర్యాద్విధి రేషా మమార్చనే ॥ ౫ ॥

తా ॥ ఓపార్వతీ సదాపూర్వముఖముగాను లింగము యొక్క పూజనుచేయునో ఆయువు సంపద కీర్తి శక్తి పూజవృద్ధి యేదిగోరుచున్నాడో అదిసిద్ధించును మరణాదులయందు దక్షిణాభి ముఖము చేయవలయును కామ్యార్థి పశ్చిమ ముఖము చేయవలయు జ్ఞానార్థియుత్తరముఖము చేయవలయును అగ్నిదిశ వ్యాధిపీడలు నైఋతి ద్వేష సంభవము

వాయువ్యమా కర్షణమున్ను ఈశాన్యము మోక్షలక్ష్మి ప్రాతర్మ ధ్యాహ్నముల యందు పూర్వముఖము పూజచేయ వలయును రాత్రి యందు త్తరముఖము చేయవలయు నాయొక్క పూజయందిటువం టి విధియని తెలియ వలయును ॥

—)*(అతిథ్యనాదరణం)*(—

శ్లో ॥ శివభక్తమతిక్రమ్య యశ్చాన్యస్మైప్రదీయతే । నిష్ఫ లంతద్భవేద్దానం నరకంప్రతిపద్యతే ॥ ౧ ॥

తా ॥ ఎవ్వడు మాహేశ్వరుని యతిక్రమించి యితరునికొరకు దాన ము నిచ్చుచున్నాడో ఆదానము నిష్ఫలమౌను (వాడు) నరకమును బొందుచున్నాడు ॥

శ్లో ॥ శివయోగీగృహేయస్య భిక్షాంగృహ్ణాతిభక్తితః । సద్య స్తారయతేతస్య సప్తసప్తచసప్తచ ॥ ౨ ॥

తా ॥ శివయోగి (అనగాజంగమము) నెవనియొక్క గృహమందు భక్తివలన భిక్షముతీసుకొను చున్నాడో వాని యిరువైయొక్క తర ములవారిని యప్పుడేతరింప చేయుచున్నాడు ॥

శ్లో ॥ అతిథిర్యస్యభగ్నాశో గృహాత్ప్రతినివర్తతే । సతస్మై కిల్బిషందత్వా పుణ్యమాదాయగచ్ఛతి ॥ 3 ॥

తా ॥ అతిథియెవనియొక్క గృహముగూర్చి ఆశభగ్నుడై యుంచు యున్నాడో అయన వాని కొఱకు పాపమునిచ్చి పుణ్యము తీసుకొని పోవుచున్నాడు ॥

శ్లో ॥ నిత్యజంగమపూజాయాం సమయాగతజంగమం । తమ పిశ్రద్ధయాభక్త్యా పూజయేత్స్వగురుంయథా ॥ ४ ॥ నేమజం గమపూజాయాం సమయాగతజంగమం । తమపిశ్రద్ధయాభ క్త్యా పూజయేల్లింగభావతః ॥ ౫ ॥

తా ॥ నిత్య జంగమపూజయొక్క సమయమందు రాబడిన జంగమను తమగురువువలె మన్నించి శ్రద్ధచే భక్తిచేనతని పూజించ వలసినది జంగమనేమ పూజయొక్క సమయమందు రాబడిన జంగమను లిం గభావముగా మన్నించి భక్తితో శ్రద్ధతోనతన్ని పూజించవలయును॥

శ్లో ॥ ప్రాణలింగాంగసంబంధి పాదప్రక్షాళితంజలం । లింగాంగ సంగరహితః పిబేచ్చేత్త స్యపుణ్యదం ॥ ౬ ॥ లింగాంగసంగీచే న్మర్త్యః పిబేదనవధానతః । అన్యాంఘ్రిక్షాళితం పాదానర కంప్రతిపద్యతే ॥ ౭ ॥

తా ॥ ప్రాణ లింగాంగియొక్క పాదాభిషేకోదకము లింగవిహీనుం డు పుచ్చుకొననేని పుణ్యముగలుగును లింగాంగిస్థైన మానవుండు యేమరియైన పుచ్చుకొనవలయు ఇతరుని పాదాభిషేక జలముగ్రహిం చునేని నరకమును బొందుచున్నాడు ॥

శ్లో ॥ పుష్పమూర్ధ్వముఖంయోజ్యం పత్రంయోజ్యాత్వధో ముఖం । ఫలంతుసమ్ముఖంయోజ్యం యథోత్పన్నంతథార్ప యేత్ ॥ ౧ ॥

తా ॥ లింగమూర్తికి పుష్పమూర్ధ్వ ముఖము పత్రియధోముఖము ఫలమే దురుముఖము నెటువలె పుట్టినవో నటువలె ధరించవలసినది ॥

ఇతి శ్రీమత్పరశివ వామదేవా ననోద్భవ దారుకాచార్య శాఖా సంజనిత సిద్ధలింగాహ్వ యాచార్య కరకంజాత భృంగిగో త్రోత్పన్న గుదెపెల్లవంశవారధి సుధాకరాయమాన వీ రపాఖ్య తనూభవాగ్రజ సిద్ధరామాభిధ మద్భ్రాతృతను మత్యామయా మడివాళాఖ్యేన సంయోజిత కృత నిఖిలధర్మానుకూలాయాం వీరశైవాచార ప్ర దీపకాయాం తృతీయాపరాధ కాండం

—( సమాప్తం )—





